సంవత్సర చందా
రు. 13—0—0
విడిపత్రిక 25 న.పై.



సచిత్రవారపత్రిక

**Founder: K. NAGESWARA RAO**

సంపుటము 52
సంచిక 6
2-10-57

హేవిళంబి ఆశ్వయుజం, శుద్ధ నవమి, బుధవారం


ముఖచిత్రం :
మహిషాసురమర్దని





# శ్రీరస్తు! విజయోస్తు!!

పరగనాశ్వీజ శుక్లపక్షంబునందు
తెరగొప్ప దీవించ వస్తిమిటమేము
శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు
భూరివైభవమస్తు పుత్రలాభోస్తు
ధీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తు
ధనకనక వస్తువాహన సిద్ధిరస్తు
కారుణ్యముగ మీకు కల్యాణమస్తు
ఆశ్వీజ శుద్ధ మహార్నవమిగాన
బాగుగా దీవించ వస్తి మిటు మేము
బాలకుల దీవెనలు బ్రహ్మదీవెనలు
చాల సంతోషులై సరసులయ్యెదరు
జయవిజయీభవ! దిగ్విజయీభవ!

* * *

ఏడాది కొకమారు వేడుకతో మేము
పోడిమిగ మిమ్మిట్లు పొగడవచ్చెదము
అయ్యవా రొచ్చెనని అనుమానపడక
సయగారి మాటలని నగుచుపొమ్మనక
రేపురా మాపురా మళ్లి రమ్మనక
పరుసతో ఓవంటివా రెందరనక
యింతసేపుందురా యింత దయలేక
పలుమారు మిమ్మెపుడు అడుగంగరాము.

* * *

అల్లుండ్రవలెగాదు అలిగి మిమ్మడుగ
చెల్లెండ్రవలెగాదు చెలగి మిమ్మడుగ
అలదొమ్మరులుగాము ఆడి మిమ్మడుగ
బలవంతులముగాము బలముచే నడుగ
సొగసు విద్యలుగావు సొక్కించి అడుగ
నిలువు జీతముగాదు నిలిచి మిమ్మడుగ
పాతప్పులునుగావు పలుమారు అడుగు
కొత్తప్పులునుగావు కోరి మిమ్మడుగ
ఖ్యాతిగా మాకిస్తె ఘనకీర్తి యగును
అయ్యవారికి చాలు అయిదు వరహాలు
పిల్లవాండ్లకు చాలు పప్పుబెల్లాలు
శీఘ్రముగ పంపుడీ శ్రీమంతులార
జయ విజయీభవ! దిగ్విజయీభవ!

* * * *

మహిలోన మమ్మేలు మత్స్యావతార!
గురుకృపారతినేలు కూర్మావతార!
వరమిచ్చి కాపుమము వరహావతార!
సిగుల దేలింపు నరసింహావతార!
అర్థముల్ దయసేయు హ్రస్వావతార!
రమ్య తేజంబిమ్ము రామావతార!
ప్రాపునీవే పరశురామావతార!
పాపముల్ బాపు బలభద్రావతార!
ప్రీతిసేయుము మాకు బుద్ధావతార!
కానుకల నిప్పింపు కలికావతార!
జయవిజయీభవ! దిగ్విజయీభవ!




# సాధువుల ఆశీర్వాద ఫలితం!!

శ్రీ కృష్ణ: ఆంధ్రపత్రిక ప్రతినిధి

న్యూఢిల్లీనగరం విశ్రాంతి తీసుకుంటోంది. ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి వాషింగ్టన్, వాణిజ్య మంత్రి శ్రీ మురార్జీదేశాయి బొంబాయి వెళ్ళారు.

మరో సంఘటన ఏమిటంటే ఎడతెరిపి లేకుండా ఒక వారం రోజులపాటు న్యూఢిల్లీలో వానలు కురిశాయి. పొద్దునప్పుడు, రాత్రిప్పుడు చల్లగా, హాయిగా ఉంటోంది. పువ్వుల తోటలంటే ఇష్టమైనవారు కొత్తకొత్త నానా కొలపు మొక్కలువేసి పెంచుతున్నారు.

* * *

జాతీయాభివృద్ధి మండలి స్థాయీసంఘం మూడు నెలల తరవాత ఇటీవల సమావేశమైంది. ఈ సమావేశం ఏదో లాంఛనంగా జరిగింది కాదు. రెండో పంచవర్ష ప్రణాళిక మునిగిపోకుండా ఉద్ధరించడానికి ఈ సమావేశం జరిగింది.

అసలు రెండో ప్రణాళిక దక్కని శుభముహూర్తంలో ప్రారంభమైందన్న సంగతి అందరికీ తెలిసినదే. ప్రణాళిక రచనాసంఘ సభ్యులు ప్రణాళికమీద శంతకొలు పెట్టడానికి ఒకరోజున సమావేశమయ్యారు. ప్లానింగ్ మంత్రి శ్రీగులారీలాల్ నందా అఖిలభారతసాధుసమాజానికి వెళ్లి ప్రణాళికా సంఘసమావేశానికి అప్పుడే వచ్చారట. ఆయన సాధువుల దగ్గిర్నించి కొంచెం "ప్రసాదం" తీసుకువచ్చారు. "ప్రణాళిక దిగ్విజయమగుగాక" అని సాధువులు ఆశీర్వదించారు. శ్రీ నందా సాధువుల ప్రసాదాన్ని సంఘసభ్యులకు పంచిపెట్టారు. వారు భక్తి ప్రపత్తులతో ప్రసాదం స్వీకరించారు. ఇప్పుడు భారత ఆర్థికమంత్రి భిక్షాపాత్ర పట్టుకుని విదేశాలకు వెళ్ళడంచూస్తే బహుశా ఆ సాధువుల ఆశీర్వాద ఫలితమే కాబోలుననిపిస్తుంది! ఇదినిజమైనా కాకపోయినా అసల సంగతేమిటంటే ప్రణాళిక మూలంగా కొన్ని సమస్యలు ఉత్పన్నమైనాయి. వీటిని పరిష్కరించడం దినదినగండమై పోతోంది. విదేశీద్రవ్యంకొరత ఒక సమస్య. ద్రవ్యోల్బణ ఇంకోసమస్య. ద్రవ్యోల్బణ అంటే డబ్బుచవకై పోవడం అంటే జీవనవ్యయం పెరిపోవడం. విదేశీద్రవ్యం కొరత అంటే దిగుమతులు-ముఖ్యంగా ప్రజావసర వస్తువుల దిగుమతులు తగ్గిపోవడం; వస్తువులు కరువై పోవడం; దీనివల్ల ద్రవ్యోల్బణంకూడా అధికమవుతుంది. ధనలక్ష్మిని ఎవరన్నా చులకనచేస్తే ఆమె సహించదు. ఇప్పుడామె పగ తీర్చుకుంటోంది. శ్రీ నందా ప్రణాళికను సమర్థించుకున్నారుగాని ఆ సమర్థింపు ఎవర్నీ నమ్మించినట్లు లేదు. సమర్థించుకున్నంత మాత్రాన ప్రణాళిక నిర్వహణం తేలికై పోదు. దీర్ఘోపన్యాసాలవల్ల విదేశీ ద్రవ్యం లభించేటట్లయితే ఈపాటికి మిగతా దేశాలకంటే భారతదేశానికే ఎక్కువ విదేశీద్రవ్యం లభించి ఉండాల్సింది. ప్రణాళికారయితలవంటి దృఢచిత్తులుకూడా మింగ తప్పనిచేదుమాత్ర ఒకటుంది: ప్రణాళికలోని ప్రధాన కార్యక్రమాలను మాత్రమే



మహాత్మా గాంధీ
[జయంతి: అక్టోబరు 2.]

లుపరచాలన్నా, భారతదేశానికి 700 ట్ల రూ.ల విదేశీ ద్రవ్యం అవసరమవుది. ఈ ద్రవ్యం ఎక్కడ లభ్యమవుదో ఇంతవరకూ తెలియదు. "ప్రపంచపు లుధనంలోంచి ఈమాత్రం ధనం మనకు ంచదా?" అని శ్రీ నందా లోక్ సభలో భావం వెల్లడించారు.

ఇదివరకు చెప్పిందే అయినా, ఒకవిషయం బుతాను. 1961 మార్చి 31వ తేదీతో తమయ్యే ఐదు సంవత్సరాలలో న్యాయంగా నకు మిగలవలసిన బడ్జెట్ ధనం 350 కోట్ల .లు అని ప్రణాళికసంఘం అంచనా సింది.

ఆ అంచనా వేసిన తర్వాత భారత భుత్వం అభివృద్ధికరం కాని 400 కోట్ల రూ.ల వ్యయానికి అంచనా తయారుచేసుని ఉంచుకుంది. అంటే ప్రణాళిక కాలం నే రివిన్యూ పద్దులో 50 కోట్ల రూ॥ టువస్తోందన్నమాట.

## గాలిమేడ ఖరీదు

ఈ పునాదిమీద ప్రణాళిక సంఘం బ్రహ్మాండమైన గాలిమేడ కట్టేసింది. ఈ గాలిమేడ ఖరీదు రూ. 4800 కోట్లు. అయితే ఈ ఖరీదుకూడా కొన్ని కొన్నిటికి తక్కువ అంచనాలు వేసీ, కొన్నిటికి అసలు అంచనాలు వెయ్యకుండానూ తయారుచేశారు. ఇది ఇలా ఉండగా నెమ్మదినెమ్మదిగా ధరలు పెరగనారంభించాయి. ఉదాహరణకి భారతదేశంలో బొగ్గుధరలు, యంత్రాల ధరలు, పరికరాల ధరలు, కార్మికుల జీతాలు పెరిగాయి. శ్రీ నందా చెప్పిన దాన్నిబట్టి ప్రణాళిక ఖరీదు ఇప్పుడు 600 లేక 700 కోట్ల రూ.లు అధికమయింది. అంటే మొత్తం ఖరీదు రూ. 5500 కోట్లదాకా పెరిగిందన్నమాట. అయితే ఇది ఇంకా పెరగదని నమ్మకమేమిటి?

ప్రణాళికకు ధనం ఎలా సమకూర్చదలిచారయ్యా:_అదనపు పన్నులవలన రూ. 450 కోట్లు; ప్రజలనుంచి ఋణాలు రూ. 1200 కోట్లు; ఇతర బడ్జెటరీ విధానాలవలన రూ. 400 కోట్లు; విదేశీ సహాయం రూ. 800 కోట్లు; లోటు ఆర్థిక విధానంవలన రూ. 1200 కోట్లు; ఇంత చేసినా ఇంకా 400 కోట్ల రూపాయలలోటు ఎలా భర్తీ అవుతుందో కూడా తెలియకుండా ఉండిపోయింది.

ఈ ధనసేకరణ మార్గాల్లో రెంటిని కొంచెం విమర్శగా పరిశీలించడం అవసరం.

లోటు ఆర్థికవిధానం అట్టే శ్రేయస్కరం కాదని భారతదేశంలోనూ, ఇతరదేశాల్లోను ఆర్థికనిపుణు లనేకులు హెచ్చరించారు. కాని వారి హెచ్చరికను ఎవరూ పట్టించుకో లేదు.

శ్రీ వి. కె. కృష్ణమీనన్ భారతదేశానికి మిత్రదేశాలంటూ లేవని చెప్పిన తరవాత, 800 కోట్ల రూపాయల విదేశీసహాయం లభిస్తుందని ప్రణాళికాసంఘం ఎలా అంచనా వేసుకుందీ తెలియడంలేదు.

ప్రణాళికను యథాతథంగా నిర్వహిస్తామని కబుర్లయితే చెబుతున్నారు. కాని ఈ కబుర్లవల్ల అటు ప్రణాళికాసంఘంలోగాని ఇటు భారత ప్రభుత్వంలోగాని కించిత్తు నమ్మకమైనా కలగడంలేదు. పైగా ఆర్థికమంత్రి విదేశీద్రవ్యం 700కోట్ల రూపాయలదాకా లోటుగా ఉందని తేల్చి చెప్పనే చెప్పారు. ఇక మనదేశంలో పరిస్థితి: ప్రణాళికకోసం కొత్తపన్నులు వేసే ఉద్దేశంతో కేంద్రప్రభుత్వం శాసనాలు చేసినమాట నిజమే. కాని రాష్ట్రాలు ఏమీ చెయ్యనే లేదు. రిజర్వుబ్యాంకివారి ఇటీవలి సమీక్ష

(54-వ పేజీ చూడండి)



బొమ్మల కొలువు

— ఫొటో: గిరిధర్.

# దేవీనవరాత్రులు

జి. వి. ఎల్. నరసింహారావు

ఆశ్వయుజ శుద్ధవిదియనాడు దేవిని నిల్పి తొమ్మిదిరాత్రులు పూజిస్తారు. వీనినే దేవీనవరాత్రులంటారు. ఆశ్వయుజ శుద్ధ దశమి శరన్నవరాత్రులు గడచిన మరునటి రోజు. దీనికీ దుర్గపూజతో సంబంధంవుంది. ఆరోజున గడపలకు పసుపు కుంకుమలు పెట్టి, పచ్చనితోరణాలతో ఇళ్లు అలంకరించి జాతీయ చిత్రకళాచిహ్నాలైన ముగ్గులను ముచ్చటగాపెట్టి మేళతాళాలతో, నృత్య గీతాలతో, బంధుమిత్రాదులతో "అపరాజితా దేవి" పూజచేస్తారు. అపరాజితా దేవి అంటే పరాజయంలేని దేవత.

ఈ దేవీపూజ వెనుక ఎంతో గూఢార్థం ఉందని చెబుతారు. విశ్వాన్నంతా నడిపించే దేదో ఒక అతీతశక్తి ఉందని భారతీయులెప్పుడో గుర్తించారు. ఈ సత్యాన్ని నేటి శాస్త్రజ్ఞులు కూడా అంగీకరిస్తారు. జగద్వ్యాప్తమైన ఈశక్తిని "మాతృ"రూపంలో ఉపాసించడంద్వారా, తేలికగా కైవసం చేసుకోవచ్చునని గుర్తించి శక్త్యుపాసన మారంభించారు. ఈ శక్తి బ్రహ్మ, విష్ణు, రుద్రాదులకన్న మిన్నయని గుర్తించబట్టే ఈశావాస్యమైనప్పటికీ జగత్తులో "శక్తి" హీనమైనవాటిని ప్రాధాన్యరహితాలుగా భావించారు. నిర్గుణాత్మకమైన శక్తియొక్క ఆరాధనే సగుణరూపమున శక్తి ఉపాసనలేక దేవీపూజ అయింది. ఈ శక్త్యుపాసనతో బాటు సత్, చిత్, తేజస్సు, బుద్ధి భావాల ననుసరించి యేర్పడ్డ బ్రహ్మ, శివ, విష్ణు, సూర్య, గణేశోపాసనలైనూ పంచభూతాలతో సంబంధం కల్గివుండడంవల్ల, బ్రహ్మకు బ్రహ్మాండానికి సమన్వయము చూపుతూ మనవారు పంచాయతనపూజ గావిస్తారు. సత్, చిత్, తేజస్సు, బుద్ధి, భావాలు ప్రపంచాన్ని జగత్తును, బ్రహ్మకర్షణను, సదసద్భేదమును చూపగా శక్తి సృష్టి స్థితిలయములను చేస్తుంది. ఈ రూపకల్పనము నాధారముచేసికొనియే భారతీయ తంత్రము, సాంఖ్యము మొదలగునవి రూపొందాయి.

శక్తి స్వరూపిణియగు ఈ జగజ్జననినే కాశ్మీరీలు అంబ అనీ, కన్యాకుబ్జీయులు కల్యాణిఅనీ, మిథిలావాసులు ఉమ అనీ తమిళులు అమ్మన్ అనీ, దక్కన్‌వాసులు, అంబికఅనీ, అస్సామీయులు, వంగీయులు దుర్గఅనీ, ఘూర్జరులు హింగుళ, రుద్రాణి, భద్రకాళి, శాంభవి అనీ, బీహారీయులు కాత్యాయని అనీ, సౌరాష్ట్ర వాసులు మోహిని అనీ పిలుస్తారు. రౌద్ర, రక్తదంతి, దుర్గామతల్లి, భ్రమరి, భీమ వింధ్యవాసిని వంటి యితర ప్రాంతీయ నామాలేగాక వేరే వెయ్యిపేర్లు (సహస్రనామాలు) గూడా ఈఆదిశక్తికి వున్నాయి.

అంబా శాంభవి చంద్రమౌళిరబలా పర్ణా ఉమాపార్వతీ
కాళీ హైమవతీ శివాత్రినయనీ కాత్యాయనీ భైరవీ
సావిత్రీ నవయౌవనాశుభకరీ సామ్రాజ్యలక్ష్మీప్రదా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ॥

అంటూ యింటింటా ఈ శక్తి స్మరణను మనం వింటూవుంటాం. ఆంధ్రులు ఈమెను లలితగా ఉపాసిస్తారు. ఈమె రక్తవర్ణ చతుర్భుజ, పంచప్రేతాసనాసీన. ఈమె చేతుల్లోని పుష్పబాణము పంచభూతాల స్వరూపాలు శక్తిమయాలు అగు శబ్దస్పర్శ రూప రస గంధములకు, చెరకుగడ యిచ్ఛాశక్తికి, అంకుశము జ్ఞానానికి; పాశము రాగస్వరూపానికి ప్రతీకలు. సృష్టి స్థితిలయ అనుగ్రహ నిగ్రహాలనే పంచ కృత్యాలకు కర్తలు ఈశక్తి లేనినాడు ప్రేత సమానులనీ, ఈశక్తియే వీరి కధిష్ఠానమనీ సూచించడానికీమెను పంచప్రేతాసనాసీనగా వర్ణించారు. భావగర్భితమైన ఈమూర్తి మధురాతి మధుర సృష్టి.

సత్యయుగంలో సురథుడనేరాజు, సమాధి అనే వైశ్యప్రముఖుడు బాహ్య, అంతర్గత ఆసురీ ప్రవృత్తులపై విజయం సాధించడానికి మార్గాన్వేషిస్తూ శక్తిపూజ (దుర్గపూజ) ద్వారా విజయం సాధించగలమని తెలిసి చైత్రమాసంలో (వసంతఋతువు) ఈ పూజ గావించారు. దీనినే వసంతపూజ అన్నారు. రావణునిపై విజయం సాధించడానికి శ్రీరాముని శరత్కాలజనిత శారదాంబను పూజింపమని నారదమహర్షి ప్రబోధిస్తాడు. శ్రీరాముడు శరన్నవరాత్రి పూజలు గావించి రావణునిపై విజయము పొందాడు. సురథ సమాధులవలె వసంతకాలమున గాక శరత్కాలమున ఈ పూజ శ్రీరాముడు చేయడం వల్లనే దీన్ని శారదీయ పూజ అన్నారు. నాటినుండి ఈ పూజలు శరత్కాలమందే జరుపబడడంచేత అకాబోధనములనీ పిలువబడుతున్నాయి.

వంగ ప్రాంతమున దుర్గాదేవిపూజ "బోధనము" పేరుతో ప్రారంభమవుతుంది. తర్వాత విగ్రహ ప్రాణప్రతిష్ఠ జరుపుతారు. వంగదేశపు మహాదుర్గ కిరుపార్శ్వములా మహాలక్ష్మి, మహాసరస్వతు లుంటారు. లక్ష్మి పాదముల చెంత సేనాపతి కార్తికేయుడు (కుమారస్వామి); సరస్వతి ప్రక్కన గణాధిపతి వుంటారు. వీరిరువురూ శక్తిస్వరూపిణి యగు పార్వతికి అనుంగుబిడ్డలు; శక్తి బాహ్యస్వరూప చిహ్నముగు సేనకు అధిపతులు. దశప్రహారిణియైన దుర్గ ఒక కాలు మహిషాసురుని పైన, మరొక కాలు వాహనమయిన సింహముపైన వుంచి బల్లెముతో మహిషుని సంహరిస్తూ వుంటుంది. సింహంగూడ రాక్షసుని చీలుస్తూ వుంటుంది. ప్రతిష్ఠాపించబడిన దేవికి సప్తమినాడు వలువ గప్పబడిన అరటిచెట్టుతో కలిపి తొమ్మిదిచెట్లను (దుర్గాదేవి వివిధ కాలములందు ధరించిన రూపాలకు చిహ్నంగా) గణపతి ప్రక్కనుంచి పూజిస్తారు. దీనిని నవపత్రికా పూజ అంటారు. వంగీయులు దీనిని "కలశే" అనిగూడా అంటారు. ఈ నవ (తొమ్మిది) సంఖ్య దేవి. అత్యంత ప్రియమైంది. మహిషునితో దేవి తొమ్మిదిరాత్రులు యుద్ధం చేసింది. అందుకే నవరాత్రి పూజలలో నవమినాటి పూజ అత్యంత ప్రీతికరమైంది. (ఆమె తొమ్మిది శక్తులను కలిగినదని గూడా అంటారు.) అందుకే ఆమెకు "నవమీ పూజనప్రియ" అనే పేరు వచ్చింది. విజయదశమి పండుగలలో మహార్నవమికి ప్రాధాన్యత అందువలనే. మహార్నవమి గడలపేరుతో మనవారాచరించే కోలాహలం ఈ ప్రత్యేకత యొక్క ప్రదర్శన మన్నమాట. సప్తమినాడే సరస్వతీ పూజకూడా చేస్తారు. మరునాడు మహాష్టమి. దీనినే దుర్గాష్టమి అని అంటారు.

[సీతారామలక్ష్మణులు]

# బొమ్మల కొలువు

[రాధాకృష్ణులు]

ఫొటో: గిరిధర్.

అష్టమిపోయి నవమి వచ్చే సమయంలో సంధిపూజ జరిపి ఆఖరురోజున ఉత్సవంగా వెళ్ళి విగ్రహాన్ని జాహ్నవిలో కలుపుతారు. విగ్రహనిమజ్జనం తరువాత బంధుదర్శనం అనేది ఒక ప్రత్యేక కార్యక్రమం. ఉద్యోగ వ్యాపారాదులుమాని ఈపండుగకు వంగీయులంతా యిళ్ళకు చేరుతారు. పండుగనాడు పాతవైరాలను స్వస్తి అంటూ పూర్వపుకలతలుమరచి మైత్రీ బాంధవ్యాలను సుస్థిరం చేసుకుంటారు. దశహస్తాలదేవి పదిదిక్కులనూ చూపుతూ శక్తి యొక్క సర్వవ్యాపకత్వాన్ని సూచిస్తూ వుంటుంది. స్వశరీరంలోగల ఆసురీశక్తులు సింహంలా అతిబలవత్తరాలైనా వాటిని లొంగదీసుకుని వాహనంచేసుకున్న దుర్గాదేవినిచూచి వారు తమ ఆసురీప్రవృత్తిపై ఆధిపత్యంపొందినట్లు భావిస్తారు. ఆర్థిక సమృద్ధిని లక్ష్మీదేవి, కళాశాస్త్రాభివృద్ధిని గణనాయకుడు, వైజ్ఞానికాభ్యుదయాన్ని సరస్వతీదేవి, సేనాబలానికి షణ్ముఖుడు ప్రతీకలు. ఈ ఆర్థిక, వైజ్ఞానిక శాస్త్ర కళాభివృద్ధి, దాని రక్షణకు సేనాశక్తి గలిగినప్పుడే జయించడానికి ఏ జాతికైనా ఆస్కారం, అర్హత వుంటాయని మననమ్మకం. మనము అనాగరికులనుకునే వారిలో సైతం ఈ శక్తిపూజ బతకమ్మ కొలువులరూపంలో కనబడుతూవుంటుంది.

## సీమోల్లంఘనం

దీనినే పొలిమేరదాటడం అంటారు. విజయదశమినాడు మేళతాళాలతో దేవిని ఊరేగిస్తూ మల్లయుద్ధములు, సాముగరిడీలు మొదలగు వీరప్రదర్శనతో గ్రామ పొలిమేరను దాటడం జరుగుతుంది.

ఆశ్వయుజమాసం—శరదృతువు. వర్షాకాలంపోయి శీతకాలం ప్రారంభమవుతుంది. చెరువుల్లోనీరు బురదవిరిగి నిర్మలమవుతుంది. జలప్రవాహాలు ఉరవడితగ్గి రాకపోకల సౌకర్యాలుకలుగుతాయి. భూమిసస్యశ్యామలమై కనులపండువుగా వుండడంవల్ల ప్రకృతి ఆనందదాయకమై ప్రాణికోటి సంతోషముగా ఉంటుంది. స్వచ్ఛమై, ప్రసన్నమై యలరారుచూ వింతసొబగులీనుతున్నప్పటికీ శరత్కాలము రోగముల కాలవాలముగనుకనే దీనిని "యమదంష్ట్రిక" అంటారు. దీనినుండి రక్షణకై శరత్కాల పూజలు చేసి, దండయాత్రల ఉపక్రమణకుపయుక్తకాలమవడంవల్ల మనపూర్వులు ఆయుధపూజలు చేసి, విజయయాత్రలకు తరలి సరిహద్దులను దాటడం జరిగేది. ఆనాటి సీమోల్లంఘనానికి ప్రతీకంగా ఈనాటి పొలిమేర దాటడం అనే ఆచారాన్ని మనం అనుసరిస్తున్నాం.

## పారువేట

పొలిమేరదాటిన తరువాత ఒక జంతువును వదలి తమ పరాక్రమానికి చిహ్నంగా దానిని వేటాడి కొట్టి జయజయ నినాదాల్లో జరిపే సంబరాన్నే పారువేట అంటారు. శత్రుసంహారవిజయానికీ సంప్రదాయం ప్రతీకం.

## జమ్మికొట్టుట

జమ్మిచెట్టుమీద భేతాళుడుంటాడని ప్రతీతి. ఆ చెట్టుమీదనే పంచపాండవులు తమ ఆయుధాలు దాచి అజ్ఞాతవాసానికి వెళ్లారు. ఉత్తరగోగ్రహణసమయంలో అర్జునుడు భేతాళుని, జమ్మిని పూజించి ఆయుధములు స్వీకరించి నవ్వులాటకైనా ఈ దేశంలో గోవులపై అత్యాచారానికి పూనుకుంటే యెలాటి ప్రతిఫలం లభిస్తుందో తెలియజేశాడు. విజయుడు విజయం సాధించిన దినాన్ని విజయదశమి, ఆనాటి శమీపూజ జ్ఞప్తికి తెస్తాయి. వీటిని స్మరింపచేస్తూ "శమీశమయితే పాపం, శమీశత్రువినాశనం" అంటూ జమ్మిని పూజించి కొమ్మలు కొట్టి ఆపత్రిని తలమీదను చెవులసందున పెట్టుకు ఉల్లాసంగా వూళ్లోకివచ్చి ఊరిపెద్దలకు, యింటిపెద్దలకు, బంధుమిత్రులకు కనిపించిన వారికల్లా - ఆపత్రిని పంచడం జరుగుతుంది. సీమోల్లంఘనం గావించిన శత్రువులపై విజయం సాధించి తిరిగివచ్చినరాజులు, సైనికులు తాము కొల్లలుగా తెచ్చిన సంపదను.

(54-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**( 2-10-57 మొదలు 8-10-57 వరకు )**

ఈ వారము గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | 4 దీని శుక్రుడు వృశ్చికమునకు మారును. ధనుస్సు, మకర, కుంభ, మీనములలో చంద్రుడు. | | |
| | | | |
| | శ | శు రా | ర కు బు గు |

5-10-57 ఉదయం. 8 గం॥ లగాయతు 6-10-57 పగలు 12 వరకు శని వేధ.

7-10-57 పగలు 2 గం॥ మొదలు 8-10-57 సాయంత్రం 5 గం॥ వరకు రవి, కుజ వేధ.

### *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారమున గ్రహస్థితి మీకు అనుకూలముగా లేదు. ఆదాయము సకాలమున చేతికందకపోవుటచేతను ఖర్చులు ఎక్కువగుటచేతను మనస్సునకు అస్థిమితము. సోదరవర్గమువల్ల సహాయము కలుగును. కార్యములలో జాగుకలుగుటచేతను అసంతృప్తి. ఉద్యోగులకు అనుకూలకాలము కాదు. 2, 3 తేదీలలో ఖర్చులు ఎక్కువ 7, 8 తేదీలలో సహాయము.

### *భరణి [లీ, లూ, లే, లో]*

ఈ వారము మీకు గ్రహస్థితి అనుకూలముగా లేకపోయినను, ఖర్చులు ఎక్కువయినను జ్ఞానుల సాంగత్యమువలనను, వేదాంత గ్రంథములు చదువుటచేతను మనస్సునకు తృప్తికలుగును. పితృవర్గమువల్ల సహాయమును పొందుటచే గృహకలతలవల్ల కలిగిన అశాంతి పోవును. ఉద్యోగులకు సకాలమున ధనలేమిచే ఇబ్బందికలుగును. 2, 8 ఖర్చులు ఎక్కువ. 7, 8 తేదీలలో సహాయము.

### *కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]*

ఈవారమందు శరీరమునకు శ్రమ ఎక్కువ కలిగేపనులు చేయవలసివచ్చును. కోర్టువ్యవహారములు వాయిదాపడుటవల్లగాని వ్యతిరేకతీర్పులవల్లగాని ఖేదము కలుగును. 2, 8 తేదీలలో ఖర్చులు ఎక్కువ. 5 తేదీనుండి వారాంతమువరకూ ఉద్యోగులకు కొంత కార్యానుకూలత కలుగును. నీచస్త్రీలతో వివాదము.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

కార్యభారము ఈవారమందు అధికమగుటచేతను, శరీరమునకు ఉష్ణాధిక్యమువల్ల బాధ కలుగును. పండిత గోష్ఠివల్లను, పుస్తక పఠనవల్లను కొంత మనశ్శాంతి కలుగును. ఉద్యోగులకు కొంత మంచి కాలము. మీకు ఓర్పు ఎక్కువగా యుండుటచేతను కష్టములను తట్టుకొనగలరు. 2, 8 తేదీలలో ఖర్చులు ఎక్కువ. 4, 5 తేదీలలో ధనాదాయము, వారాంతమందు సంతానము గురించి సంతోషవార్త.

### * మృగశిర (వే, వో, కా, కీ) *

ఈ వారమున మీకు గ్రహానుకూలత ఎక్కువ. మిత్రులతో ఉల్లాసముగా గడిపెదరు. విజ్ఞులతో పరిచయము కలుగును కొందరు చురుకుమాటలచేతను మీ మనస్సు నొప్పించెదరు. ఉద్యోగులు అధికారులమన్నన పొందుదురు. 2, 8 తేదీలలో ధనాదాయము ఖర్చు. 7, 8 తేదీలలో ప్రయాణము, విద్యార్థులకు మంచికాలము.

బి. నరసింగరావు

### * ఆరుద్ర (కూ, ఖ, జ, ఛ) *

ఈ వారమున గ్రహస్థితి మీకు అనుకూలముగాయున్నది. సకాలమందు ధనాదాయమువల్లను, పెద్దల సాంగత్యమువల్లను సంతృప్తి. బంధుమిత్రులతో వినోదముగా గడుచును. ఉద్యోగులకు అధికారుల ఆదర బాభిమానములు కలుగును. పిల్లలతో సంతోషముగా గడుచును. పండితులకు,న్యాయవాదుల కుపయోగించును. 2, 8, 7, 8 తేదీలలో శుభయోగము.

### * పునర్వసు (కే, కో, హా, హీ,) *

ఈవారము మీకు యోగకాలము. ఉన్నతస్థితియందున్న వారితో సాంగత్యమువల్ల సంతృప్తి. మిత్రులను కలుసుకొనుట, సంతోషవార్తలను వినుట, విందు భోజనము ధనాదాయము కలుగును. యత్నకార్యములు సకాలములో నెరవేరును. కళాకారులకు నటీనటులకు విద్యార్థులకు, మేలుకాలము. 2, 8, తేదీలలో సుఖము ఎక్కువ.

### *పుష్యమి [హూ, హే, హో. డా]*

క్రొత్త సంగతులు నేర్చుకొనుట, స్త్రీల వలన వినోదముగా గడుపుట, తీపి పదార్థములను తినుట సంభవించును. ఈ వారములో యత్నకార్యములు సకాలములో నెరవేరును. కవులకూ, కళాకారులకూ, నటీనటులకూ, విద్యార్థులకూ యోగించును. 2, 8 తేదీలు, వారాంతము మంచికాలము.

### *ఆశ్లేష [డి, డూ, డే, డో]*

ఈ వారము మీకు ధనాదాయము హెచ్చును. మిత్రులవలన లాభము కలుగును. కొంతకాలమునుండి వుంటూవున్న అశాంతి తొలగిపోయి ఆరాటము లేక యుండును. యజమానుల ఆదరణ కలుగును. 2,8 తేదీలలో వినోదము. 7, 8 తేదీలలో దక్షిణదిశనుండి శుభవార్త వినవచ్చును.

### *మఖ [మా, మీ, మూ, మే]*

మీకు ఈ వారములో గ్రహస్థితి మిశ్రమముగా నుండును. ఖర్చులు ఎక్కువయగును. మిత్రులసహాయమును పొందుదురు. అనుకోకుండా ప్రయాణము చేయవలసివచ్చును. ఉద్యోగులకు మొదట్లో వత్తిడి కలిగినను తరువాత అధికారుల ఆదరణ కలుగును. కుటుంబమునందు కొంచము కలతలు

**—ధరలు:—**

నూలు, వస్త్రములు :— కొద్దిగా పెరుగును.

నూనె దినుసులు :— కొంచెము పెరిగే సూచనలు.

బెల్లము, పంచదార, చింతపండు :- సమస్థాయి నుండును.

ఆహారధాన్యములు, పప్పుదినుసులు :- మందముగా నుండును.

వెండి, బంగారము: నిలకడగ నుండును

తీరప్రాంతములలో ఎక్కువగాను, రాయలసీమ, తెలంగాణా ప్రాంతములలో చెదురుగాను వర్షించును.

* జన్మనక్షత్రమునుబట్టిగాని, * నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరుయొక్క మొదటి అక్షరము)ను బట్టిగాని ఫలములు చూచుకొనునది.

కలుగును. 2, 3 తేదీలలో ఖర్చు ఎక్కువ. వారాంతమందు మనశ్శాంతి కలుగును.

### * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *
### [ మో, టా, టీ, టూ ]

ఈ వారములో మీరు పెద్దల సాంగత్యముచే విజ్ఞానాభివృద్ధి పొందెదరు. మొదట్లో కొంత వత్తిడికలిగినను వారాంతములో పిత్రు వర్గమునుండి సహాయము పొందడంవల్ల ఒడిదుడుకులు సర్దుకొనును. మిశ్రమ ఫలములు కలుగును. 2, 3 తేదీలలో ఖర్చు ఎక్కువ. వారాంతంలో బంధుసహాయం.

### * ఉత్తర ఫల్గుణి (ఉత్తర) *
### [ టే, టో, పా, పీ ]

ఈ వారమున శ్రమ అధికముగానుండును. శరీరమందు మందముగా యుండును, కోర్టు వ్యవహారములు సంతృప్తికరముగా నుండును. దుష్టస్త్రీలతో వివాదములు వచ్చును. వారమధ్యమున ధనాదాయము కలుగును. 2, 3 తేదీలలో ఖర్చులు ఎక్కువ. 5, 6 తేదీలలో వివాదములు కలుగును.

### *హస్త [పూ, ష, ణ, ఠ,]*

ఈ వారములో కార్యానుకూలత యున్నప్పటికీ కొని ప్రతిబంధకములు కూడా కలుగును. సకాలములో భోజనము జరుగక అసంతృప్తి కలుగును. ఖర్చులు ఎక్కువగా యుండును. అనుకొనని వారివలన కార్యానుకూలత. బంధుకలహము. వారమధ్యమందు స్వల్ప ధనాదాయము. వారాంతమున ప్రయాణము. 2, 3 తేదీలలో అధిక వ్యయం.

### *చిత్త [పే, పో, రా, రి]*

ఈవారము మీకు చాలా యోగదాయకముగానుండును. ఆప్తులవలన కార్యానుకూలత అధికారులదయ కలుగును. మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. ఉత్తరదిక్కునుండి శుభవార్త వినవచ్చును. సకాలములో ధనాదాయము. విందుభోజనము మొదలగు మంచి యోగములు కలుగును. విద్యార్థులకూ, విద్వాంసులకూ ఈవారము మంచిది. 2 నుండి 5వ తేదీవరకూ మంచికాలము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈవారము కొంత అనుకూల గ్రహస్థితిచే మీకు సకాలమున ధనము చేతికి వచ్చుటవలన సంతృప్తికలుగును. అధికారుల ఆదరణకూడా పొందగలుగుదురు. ఈశాన్యదిక్కునుండి శుభ కార్యములకు సంబంధించిన వార్త వినగల్గుదురు. వారాంతమందు కొంత అశాంతి కలుగును. వర్తకులకు న్యాయవాదులకు ఈ వారము మేలు కలుగును. 2, 5 తేదీలు యోగకాలము.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారమున ఉచ్చస్థులైనవారిని కలియుట మూలముగా కార్యానుకూలత పొందుదురు. పితృవర్గమునకు చెందినవారివల్ల సహాయము కలుగును. కొత్త మిత్రులను కలుసుకొనుట, సంతోషవార్తలు వినుట, భార్యకు నూతనాలంకారములు చేయించుట మొదలగు శుభఫలములు కలుగును. గాయకులకూ, కళాకారులకూ, నటీనటులకూ అనుకూలించును. 2, 3 తేదీలలో అమిత ఖర్చు.

### *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈ వారము మీరు వినోదములతో గడిపెదరు. ఆప్తులవల్ల క్రొత్తసంగతులు వినుట మృష్టాన్నభోజనము సంభవించును. శుభ కార్యములు నెరవేరుటలో కొంత ఆలస్యము, ఆరాటం కలుగును. నటీనటులకు, కళాకారులకు, విద్యార్థులకు మంచికాలము 5, 6 తేదీలలో అసంతృప్తి.

### *జేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారమందు అనుకున్న కార్యములు సకాలములో నెరవేరకపోవుట, పితృవర్గమును గురించి ఆందోళన సంభవించును. అకాలభోజనమువలనశరీరములో వేడిచేసినట్లుండును. వారాంతమందు స్వల్పధనాదాయము 2, 3 తేదీలు అధిక వ్యయం. 5, 6 తేదీలు ఆందోళన 7, 8 తేదీలలో స్వల్ప ధనలాభం.

### *మూల [యే, యో, బా, బి]*

ఈ వారమున ఖర్చులు ఎక్కువగుటచేతను, సకాలములో సొమ్ము చేతికి రాకపోవుటచేతను మనస్సుకు అస్థిమితము కలుగును. అనుకున్న పనులు నెరవేరక వారాంతములో వింత స్నేహితుల సహాయమువలన వెనుకబడిన పనులు నెరవేరును. ఉద్యోగులకు యేమంత మంచికాలము కాదు. అనారోగ్యము కలిగే సూచనలు. 2, 3 తేదీలలో ఖర్చులు ఎక్కువ. 4, 5 తేదీలలో వత్తిడి తగ్గును.

### *పూర్వాషాఢ [బూ, ధా, భా, ఢ]*

ఈవారమందు మిశ్రమఫలములు కలుగును. వేదాంతగ్రంథ పఠనముచే కొంతమనశ్శాంతి, మాతృవర్గమువారివలన కొంత సహాయము కలుగును. ఉద్యోగులకు అంత మంచి కాలముకాదు. కొంత కష్టపడినతరువాతను ధనాదాయము. 4, 5 తేదీలలో వున్న ఒత్తిడి కొంతతగ్గును. 2, 3 తేదీలలో అమితఖర్చు.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ,]*

ఈ వారములో గ్రహస్థితి కొంత అనుకూలముగాను, కొంత ప్రతికూలముగాను యున్నందున అనుకున్న పనులు సకాలములో నెరవేరవు. ఉద్యోగులకు అశాంతి. కోర్టు వ్యవహారములు అనుకూలించును. పడమట దిక్కు నుండి శుభవార్త వినవచ్చును. 5, 6 తేదీలలో స్త్రీలతో వివాదము కలుగును. వారాంతమున అనుకూలత.

### *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఈ వారము సకాలమున అనుకొన్న సొమ్ము రాకపోవుటచే కార్యహాని. మిత్రులనుకున్న వారు తటస్థముగా నుందురు. వారమధ్యమందు అనుకూలించును. వింతగా అజ్ఞాతస్నేహితులవలన కార్యములు ఫలించును. గృహకలతలు కలుగును. వారాంతమందు శుభవార్త. సోదరుల సహాయము కలుగును. 2, 3 తేదీలు అధికఖర్చులు. 5, 6 తేదీలు కలతలు. వారాంతమందు కొంత ఊరట.

### *ధనిష్ఠ [గా, గీ, గూ, గే]*

ఈవారమందు శరీరకష్టము ఎక్కువగును. తలపెట్టిన కార్యములకు జాప్యము. పితామహుని వలన సహాయము కలుగును. ఉద్యోగులకు మంచి కాలముకాదు. ఖర్చులు ఎక్కువ. ఆదాయము తక్కువగా యుండును. గృహకలతలు కలుగును. ఉచ్చయందున్నవారి సహాయమువలన మనశ్శాంతి కార్యానుకూలత కలుగును. 2, 3 తేదీలలో ఎక్కువ ఖర్చులు. 4, 5, తేదీలలో సహాయము.

### *శతభిషం [గో, సా, సీ, సూ]*

మీరు ఈ వారమున బంధువులతోను మిత్రులతోనూ సుఖముగా గడుపుదురు. పెద్దల సాంగత్యము కలుగును. ఆర్థికస్థితి బాగుండును. ఉద్యోగులకు అధికారుల దయ కలుగును. కుటుంబమునకుండువారికి అలంకార లాభము కలుగును. విద్యార్థులకు నటీనటులకు మేలుకాలము. 2, 3 తేదీలు ఖర్చులు ఎక్కువ.

### *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారమున మీరు వెండి వస్తువులు కొందురు. బంధువులవల్ల లాభము. విందు భోజనము. ఉద్యోగులకు గౌరవప్రదముగా యుండును. సంతాన విషయమై సంతోష వార్త తూర్పు దిక్కునుండి వచ్చును. వర్తకులకు మంచి లాభము కలుగును. వారాంతమందు శ్రమ ఎక్కువ. గణితశాస్త్రజ్ఞులకు, న్యాయవాదులకూ యోగము. 2, 3 తేదీలు అధికఖర్చులు. 4, 5 తేదీలు లాభము.

### *[ఉత్తరాభాద్ర దూ,శం,ఝా,థా]*

ఈ వారము మీ నేర్పరితనము వల్ల కార్యములను అనుకూలంగా సాధింతురు. ఇది మీకు చాలా యోగకాలము. మీ ప్రయత్నములు లేకుండా చేకొన్ని కార్యములు అను

# తపఃఫలం

ప్రకృతి స్తంభించిపోయినట్లుగా వుంది. పరమశివుడు ఘోర తపస్సమాధిలో వళ్లు మరచాడు. నందీశ్వరుడు నలుమూలలా పరికించి ఒక్కసారి తల నదిల్చాడు. వాయువులు స్తంభించిపోయాయి. కారు మేఘాలు దట్టంగా క్రమ్ముకున్నాయి. ఫెళ ఫెళారావంతో ఉరుములు... మెరుపులు...

శివుని తపస్సమాధిని భగ్నం చెయ్యటానికి మన్మథుడు ప్రయాణమయ్యాడు. వెడుతూ ఈ అపశకునాల కంతో చింతించాడు. అయేది కాకమానదనుకుని బయలుదేరాడు. ఒక పొదచాటునుంచి శివుణ్ణి చూశాడు.

రమ్యమైన స్ఫటిక హర్మ్య మధ్యంలో వున్న కనక స్తంభంలా, జూటాకృతిలో వున్న శివుణ్ణి చూసి మనోజు డెవలో కొద్దిగా భయపడ్డాడు.

పార్వతీదేవిని తీసుకువచ్చి శివు నెదుట నిలబెట్టాడు ఎరగా!

పూ ములుకుతో కొట్టాడు...

శివుడు కళ్ళు తెరిచాడు. నలుమూలలా కలయజూచాడు. నిటలాక్షంలోంచి వెలువడే భీకరాగ్ని జ్వాలలకి గజగజ వణికి పోతూ మనోజుడు ఒక చెట్టు చాటుకి నక్కాడు.

అంతే! ఆ కళ్ళల్లో ఏదో తెలియని భయంకరాకృతి!

ఆ కళ్ళల్లో నిప్పులు... మెరుపులు...

గిరికన్య భయభ్రాంత అయింది!

మాధవీ లతలా ఊగిపోయింది!

నిలువునా భగ్గున మండిపోయాడు మన్మథుడు—

పార్వతీదేవి ఒక్క వేడి వేడి నిట్టూర్పు వదిలి ఉసూరుమంటూ తిరుగుముఖం పట్టింది!

* * *

అనంగుడు తన సమక్షంలోనే, పినాకపాణి నేత్రాగ్నిలో దహింపబడిపోయేటప్పటికి పార్వతీదేవి మనోరథం భగ్నమైంది! ప్రియుణ్ణి ఆకర్షించలేని తన సౌందర్యం ఎందుకని మనసులోనే తనను నిందించుకుంది...

ఒక్కసారి తన తనూలతని పరికించుకుంది! కాంచనపద్మనిర్మితమైన తన సౌందర్యం ఎందుకనుకుంది... ఇంక పరమశివుని కర్థాంగి కావటానికి ఒక్కటే మార్గము కనిపించింది.

"సర్వంతు తపసా సాధ్యం..." అన్నారు కదా పెద్దలు! అందుకని తపస్సుద్వారా తన మనోరథాన్ని నెరవేర్చుకోవాలనుకుంది!

అనుకోవడమే తడవుగా తపోవనానికి ప్రయాణమైంది!

తపమాచరించటానికి హిమాలయాలకు పార్వతీదేవి ప్రయాణమవుతున్న సంగతి తల్లి మేనా విన్నది! ఆ కఠోరమైన మునివ్రతావలంబనం నుంచి పార్వతిని నివారించటానికి నాందిగా గ్రుచ్చి కౌగలించుకుంది.

"అమ్మాయీ... మంచివాళ్ళకి పూజించుకుందుకు గృహదేవతలు చాలు... నీ శరీరం ఎక్కడ? తపస్సెక్కడ? నీ శరీరం కేవలం శిరీషపుష్పం లాంటిది. దిరిశిన పువ్వు తుమ్మెదవాలితే భరించగలదు కాని, పక్షి వాలితే సహించగలదా?..." అని కౌగిలిలో పొదువుకుంటూ లాలించి చెప్పింది మేనా.

కాని,—

అప్పటికే పార్వతీదేవి మనస్సు సిరనిశ్చయాని కొచ్చేసింది. మేనా పార్వతీదేవి మనస్సు మరలించలేక పోయింది...

పల్లానికి ప్రవహిస్తున్న నీటి గమనాన్ని అరికట్టడం ఎంత సాధ్యమో స్థిరనిశ్చయానికొచ్చిన మనస్సుని మళ్ళించటం అంతే సాధ్యం!

ఫలసిద్ధి పొందేవరకూ అరణ్యవాసానికి అనుమతి నిప్పించవలసిందిగా పార్వతీదేవి సఖీముఖంగా తండ్రియైన హిమవంతుడికి విన్నవించుకుంది. తండ్రి అనుజ్ఞవడసి తపస్సాచరణార్థం గౌరీశిఖరానికి ప్రయాణమైంది!

మణిహారాల్ని త్యజించింది! మేలివస్త్రాలను విసర్జించింది... బాలారుణ బభ్రువల్కలంతో సమున్నత పయోధరాల్ని బిగించి కట్టింది. పయోధరోన్నేధంవల్ల ఆ వల్కలం విశీర్ణమైంది! ఒక్క అక్షమాలికమాత్రం గురుకుచాలపై నర్తించింది!

అసలే వింత వెలుగుతో ప్రతిఫలించే పార్వతీదేవి ముఖపద్మం జటాజూటాలతో మరింత అందంగా తయారయింది, పచ్చగా అలుముకున్న నాచుమధ్యంలోవున్న తామర పద్మంలా.

పార్వతీదేవి తపస్సులో నిమగ్నమైంది. సాయం సమయాలలో బంగరు రంగు కిరణాలుపడి పార్వతీదేవి అధరోష్ఠమూ, వక్షోజాలూ లాక్షారస రాగరంజితాలై మనోరంజకంగా వున్నాయి!

ఆ ప్రదేశంలో అక్షమాలికే తన అనుచరాలు......

ఆనాడు హంసతూలికా తల్పంమీద పరుండేటే వొళ్లునొప్పులుగా వుండేది. స్వకేశాలంకృత పుష్పాలపై దొర్లితే శరీరం కందిపోయేది!

కాని ఈ నాడు—

వట్టి నేలమీద నే బాహులతే ఉపధాయినిగా పెట్టుకుని పడుకుంటున్నది. హరిణాంగనలు వొయ్యారంగా విలాసచేష్టలతో పార్వతీదేవి చుట్టూ చేరుతున్నాయి.

లోలలోచన విలోకిస్తుంది...

లాలించి చేరదీస్తుంది...

మధుశ్రీ

## నక్షత్ర ఫలితాలు

కూలించును. సంఘములో మీ హోదా గౌరవము ఎక్కువగును. కుటుంబమందుండు వారి ఆరోగ్యవిషయమై అశ్రద్ధ చేయకూడదు. వివాహ ప్రయత్నములు చేయుగురు. గాయకులకు, నటీనటులకు, కళాకారులకు యోగించును. 2, 3 తేదీలు ఖర్చులు ఎక్కువ.

### *రేవతి [దే, దో, చా, చీ]*

ఈ వారమున మీకు కాకపోయినను మీ కుటుంబమునవుండువారికి ఆరోగ్యము కలుగును. ఆర్థికముగా ఎంత చేతికి వచ్చినను మీ అవసరములు తీరక మనోవ్యధ కలుగును. గౌరవభంగం కాకుండుటకు మీ నేర్పు నంతయూ ఉపయోగించుకొని పితృవర్గము వారి సహాయమున కొంత ఒత్తిడి తగ్గించుకుంటారు. వారాంతమందు కొంత స్వస్థత కలుగుతుంది. ఉద్యోగులకు మంచికాలము కాదు. 4,5 తేదీలలో ధనలాభము. వారాంతమందు స్వల్పముగా అనుకూలత. ★

## రచయితలకు మనవి

ఇటీవల తపాలా రేట్లు హెచ్చింపబడిన విషయము రచయితలకు విదితమే. బుక్ పోస్టు రేటు మొదటి అయిదు తులాల బరువుకు 8 నయా పైసల చొప్పున హెచ్చింపబడినది. తమ రచనలు నిరాకరింపబడినచో వాటిని త్రిప్పి పంపగోరు రచయితలు 8 న॥పై॥లకు తక్కువ కాకుండా తగినన్ని స్టాంపులు జతపరిచి పంపవలెనని మనవి.

—సం॥

కళ్ళల్లో కళ్లు పెట్టి ఎవరికళ్ళు పెద్దవో కొలుస్తుంది!

స్వయంగా నీరు తెచ్చి వృక్షాలకు పోస్తుంది...పుత్ర వాత్సల్యంతో పెంచుతూంది, చెట్లని.

లేడిపిల్లలకి అడవిలోని ఆహారం ఏరి తెచ్చి తినిపిస్తుంది...

పూర్వమత్సరాల్ని విస్మరించి క్రూరజంతువులు స్నేహభావంతో మెలగజొచ్చాయి. నవోఢ జాజ్వాంతరానలం తపోవనాన్ని పావనంచేసింది!

హోమాలుచేసింది. కఠినదీక్ష పూనింది.. కాని శివదర్శనం మాత్రం కాలేదు. పద్ధతి మార్చింది... శరీరమార్దవాన్ని ఒక ప్రక్కకు పెట్టి మహోగ్రతపస్సుకు పూనుకుంది. ప్రత్యూషంలో లేస్తుంది; స్నానాదులు ముగిస్తుంది. సూర్యుడికి ప్రాంజలి ఘటిస్తుంది. పంచాగ్ని మధ్యంలో పద్మాసనం వేసుకూర్చుని మధ్యందినభానుడికేసి దృష్టి నిగుడుస్తుంది...ఆ వేడికి ముఖం కందిపోయి కమిలిన పద్మంలా కనబడుతుంది. సుదీర్ఘమైన విశాలనేత్రాలు గ్రీష్మతపానికి నల్లబడి కాటుకకండ్లలా కనిపిస్తున్నవి.

అయాచితంగా వచ్చిపడ్డనీటినే త్రాగుతున్నది. పంచభూతాలకి వదిలింది శరీరాన్ని. తపస్సమాధిలో వుండగా స్వేదబిందువు ఒకటి కనురెప్పపైబడి క్షణకాలంవుండి అక్కడనుండి మెల్లిగా అధరోష్ఠంమీదికి జారుతుంది. అక్కడనుండి తిన్నగా వక్షోజాలపై పడి పయోధరోత్సేధానికి రుసారునకరైవళులనుదాటి నాభిని చేరుతుంది. ఎండలకి ఎండుతూ, వానలకి తడుస్తూ కఠినశిలలమీద

## తపః ఫలం

నిరంతరం కొలంగడుపుతుంది.

అలాగా కుదరలేదు.

నిరంతరం హిమంతో నిండిన సరస్సులో కూర్చుని తపస్సు చేస్తుంది. పరస్పరం మెడలు పెనవేసుకుంటూ అభిమతరతుల తేల్తూన్న చక్రవాకదంపతుల్ని చూసి విరహానలంలో గ్రీష్మానికి వాడిపోయిన తమాల లతలా అయిపోయింది.

కఠోరతపో దీక్షతో మృణాళికా పేలవమైన తనశరీరం వసివాడింది.

* * *

బ్రహ్మచారి ప్రత్యక్షమయ్యాడు. బ్రహ్మచారికి అతిథిమర్యాదల్ని సక్రమరీతిని నెరపింది పార్వతీదేవి.

"ఎందుకు నువ్వీకఠోరదీక్ష పూనావు సుగాత్రీ?" అడిగాడు వటువు.

మాట్లాడలేదు పార్వతీదేవి.

మళ్ళీ అడిగాడు.

"ఈశ్వరుణ్ణి భర్తగా పడయటానికి" సిగ్గుతో చెప్పలేక తల వొంచుకుంది. అధరోష్ఠంపై చిరునవ్వు మొలిచింది!

"ఆ పాములవాడినా?" అడిగాడు.

కోపంతో చురచుర చూసింది.

"ఈశ్వరుడంటే ఏమిటనుకున్నావు పద్మముఖీ... అతనికి శ్మశానవాటిక విహారభూమి...

పన్నగాలు నగలు...

బూడిద మైపూత...

పైగా బిచ్చమెత్తుకు జీవిస్తాడు. ఒక అంతఃపురమా? ఒక ఉద్యానమా? తమాల లతలా ఊగిసలాడిపోయే నీశరీరం ఎక్కడ? ఆ ఈశ్వరుడెక్కడ? సుందరి ఆ తలపు మానుకో... నాతో రా..." అన్నాడు వటువు.

"మీరు వచ్చిన పని చూసుకుని సగౌరవంగా వెళ్ళండి... మీకవన్నీ అనవసరం. నా హృదయంలో పూర్తిగా ఈశ్వరుడికే స్థానం ఇచ్చాను. ఈ జన్మలో కాకపోతే, మరోజన్మలోనైనా ఈశ్వరుడి కరాంగినవుతాను. పొండి...అనవసర ప్రస్తావనకి దిగకండి..." కోపగించి కసరికొట్టింది ఉమాదేవి.

ఆమె మాటలకి వృద్ధవటువెంతో సంతసిల్లాడు. నిజాకృతి చూపాడు.

పార్వతీదేవి ముఖపద్మం వేవెలుగులతో వికసించింది.

ఆ కళ్ళల్లో మునపటి అందాలు...

ఆ శరీరంలో కొత్త సొంపు...

ఆ కనుకొలకుల్లో విద్యుత్కాంతి.

శివుణ్ణి కరగించాయి ... సిగ్గుతో ఆమె మొఖం మల్లెమొగ్గలా అయింది.

పార్వతీదేవిని చేపట్టి అర్ధాంగిగా తనలో ఐక్యంచేసుకున్నాడు పరమేశ్వరుడు. ★

['కుమారసంభవం' నుంచి]

# రక్షకులు

రత్తమ్మ కొడుకు ఊరువిడిచిపెట్టిపోయి మిలిటరీలో చేరిపోయాట్ట.

ఆ భోగట్టా తెలియగానే "పీడ పోయింద"నుకొంది సరళ. పీడపోయినప్పటికీ సరళకి సంతోషంమాత్రం లేకపోయింది. పీడపోతే పిశాచం పట్టుకుంది.

సరళకి రా...నగరం టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో పని దొరికింది. ఊరు ఆమెకి కొత్త. అందుచేత నాలుగురోజులపాటు తన స్నేహితురాలొకామె ఆవూళ్ళోఉంటే - ఆమె ఇంట్లో బసచేసి ఈలోగా సీతాపతిగారి వీధిలో ఓ చిన్న ఇల్లు అద్దెకు కుదుర్చుకొంది. తోడుగా ఉండడానికి తల్లిని రమ్మని ఉత్తరంరాసి, తల్లి వచ్చేక అద్దె యింటికి బస మార్చింది. ఆ యిల్లు ఊరికి కొంచెం కొసలో ఉంది. కాని అద్దె తక్కువా, ఆఫీసుకి దగ్గరానూ. తనూ తల్లీ - ఇద్దరూ ఉండడానికి ఇమ్ముగా, సదుపాయంగా ఉంది. వూరు బాగుంది. ఉద్యోగం బాగుంది. బస బాగుంది.

అంతా బాగానే ఉంది. రత్తమ్మకొడుకే బాగులేదు.

రత్తమ్మకొడుకు బాగానే ఉంటాడు. చిన్నవాడూ, అందగాడూను. చూడ్డానికి లక్షణంగా ఉంటాడు. ఎటొచ్చీ ఉన్న చెడ్డ లక్షణం ఏమిటంటే మనిషిలో హెచ్చుపాలు చెడ్డతనం ఉండడమే ఆ చెడ్డలక్షణం.

రత్తమ్మ కొడుకుని చూడగానే "రౌడీ వెధవ" అనుకొంది సరళ.

సరళని చూడగానే "హాయ్ హాయ్" అన్నాడు రత్తమ్మ కొడుకు.

సీతాపతిగారి వీధిలోకి లేడిపిల్లలా వచ్చి పడింది సరళ. ఆ వీధి రౌడీ మూకకి తను పులిపిల్లనని తెలియజేసేడామెకి రత్తమ్మ కొడుకు. అప్పటి కప్పుడే పెద్ద రౌడీలకి శిష్యరికంచేసే 'స్టేజి' దాటిపోయి, పిల్ల రౌడీలకి పెద్దగా ఉండే స్టేజ్‌లోకి వచ్చేడు. వీధికి కొత్తగావచ్చిన పిల్లకి "హాయ్‌హాయ్" అని పేరు పెట్టేడు. ఆమెవెంట పడ్డాడు.

ఆ ప్రకారంగా వెంటతగిలి వెంటతగిలిఆఖరికోరోజున చెంగు పట్టుకున్నాడు రత్తమ్మ కొడుకు. గేవాకలర్ హాలీవుడ్ చిత్రం "ఎడారి వీరుడు" చూసి ఇంటికి వస్తోంది సరళ. కొంతదూరం దాకా స్నేహితురాలు తనతో కూడా వచ్చి, ఆమెను ఇంటిదగ్గర ఆమె విడిపోయింది. సీతాపతిగారి వీధి ఇంక ఆట్టే దూరం లేదు. అందుచేత రిక్షా ఎందుకను కొని నడచే వెళ్తోంది సరళ.

దగ్గరనే చూసుకొంది కాని దారంతా చీకటిగానూ నిర్జనంగానూ ఉంటుందని గుర్తుంచుకోలేదు సరళ. రాత్రి పదయింది.



మైసూరులోని మహిషాసురుడు

—ఫోటో: వాసుదేవన్

చిట్టచీకటిగా ఉంది. రోడ్డుమీద జనసంచారం ఉన్నట్టుగా లేదు. అక్కడికి తీరా వచ్చేసరికి సరళకి భయం ముంచుకొచ్చింది.

దొంగ దయ్యాలు "ఒస్తోందిరోయ్ పిల్ల" అని లోలోపల నవ్వుకొంటూ పక్కలెగ కేస్తూ చీకట్లో తచ్చాడుతున్నటనిపిస్తోంది.

**రాచకొండ విశ్వనాథశాస్త్రి**

రోడ్డు పక్కని ఉండే చెట్లు ఆ చీకట్లో కనిపించడంలేదు. కాని వాటిలోంచి జారు జారు పాములు జారుతూన్నట్టుగా చప్పుడవుతోంది. ఆకాశంలో రాజగాలి పిల్లలంతా పోయిన తల్లిలా ఎడ్చేడ్చి ఆగుతోంది. ఆగి ఆగి ఏడుస్తోంది. ఎదురుగా కొంచం దూరంలో ఎదో కొరివి దయ్యంలా కాల్తూ ఆరుతోంది. ఆరిపోయిం దనుకొనేసరికి కాల్తూ మెరుస్తోంది. వెనకనుంచి శవాలు నడచి వస్తోన్నట్టుగా తపతపలాడే అడుగుల చప్పుడు వినవస్తోంది.

సరళ నిలబడిపోయింది. రుమాలు తీసి ముఖం తుడుచుకొందికి కూడా భయంచేత వీల్లేక నిల్చుండిపోయింది. ఆ భయానికి సబబూ, సందర్భం లేదు. చూస్తోండగా మబ్బులు కమ్ముకొచ్చినట్టుగా కమ్ముకొచ్చింది. అంతలోనే మబ్బులు విడిపోయినట్టుగా వదలిపోయింది.

తను రోజూ నడచే రోడ్డే. తను రోజూ చూసే చెట్లే. భయం ఎందుకూ? ఇదే పగలైతే భయం ఉండదుకదా!

అదే పగలనుకొని నడచేదామనుకొంది సరళ. అనుకొని నాలుగడుగులు వేసింది. ఇంతలో వెనకనుంచి వచ్చే అడుగులు జోరు జోరయేయి. జోరు జోరయి ఆమె దగ్గరికి వచ్చేయి. వచ్చేక, సరళ భుజంమీద చేయి పడింది.

సరళ కేక లేదామనుకొనేలోపున ఆమె నడుం చుట్టూ చెయ్యొకటి తిరిగింది. "నేనే హాయ్ హాయ్" అనే మాటలు ఆమె చెవిని పడ్డాయి.

"అమ్మో" అని కేక వేసింది సరళ.

ఆ విధంగా ఆమె కేక వేయగానే ఏం జరిగిందంటే: ఎదురుగా కొంచెం దూరంలో ఉన్న కొరివిదయ్యం, రవ్వలు ఎగిరేలా కొరివిని నేలకి వేసి కొట్టి, పరిగెట్టివచ్చి రత్తమ్మ కొడుకుని పిడికిలితో గుద్దింది. రత్తమ్మకొడుకు ఒక్కక్షణం తటపటాయిస్తూ నిల్చొనేసరికి కొరివిదయ్యం రెండడుగులు వెనక్కి వేసింది. రత్తమ్మ కొడుకులో కదలిక లేకపోవడం చూసి మళ్ళీ ముందుకొచ్చింది. గర్జించింది. అప్పుడు రత్తమ్మ కొడుకు కొరివిదయ్యపు కడుపులో పిడికిలితో పొడిచి, కొరివిదయ్యపు మెడపట్టుకు లాగి, కొరివిదయ్యపు కాలిలో కాలువేసి తిప్పి, కొరివిదయ్యాన్ని నేల



# రక్షకులు



వేసి కొట్టి పారిపోయేడు. అంతా కూడా "ఎడారి వీరుడు" సినీమాలోలాగే జరిగింది. అయితే ఇక్కడ హీరోయే కిందపడ్డాడు. విలనే తొగ్గుకుపోయేడు. అదీ జరిగింది.

కిందపడ్డ కోరివిదయ్యాం మెల్లిగా లేచి "అబ్బ, అబ్బ" అని ఆయాసం తీర్చుకొని, ఉన్నట్టుగానే ఉండి చెంగు చెంగునగెంతి ఆ చీకట్లో సరళబాలని కొట్టేయబోయింది. దెబ్బలు తప్పించుకొందికి సరళ కూడా అటూ ఇటూ గెంతుతూ "ఆగండాగండి. నేన్నేను," అంటూ తను రత్తమ్మ కొడుకును కానని, తను తనేనని "వాడు పారిపోయేడు పారిపోయే" డని కేకలు వేసి చెప్పవలసి వచ్చింది. పులిపిల్ల తప్పించుకు పారిపోయిందనీ, లేడిపిల్ల అరుస్తోందనీ తెలుసుకున్నాక ఆ దయ్యప్పిల్ల గంతులుమాని "అయామ్ సారీ, ఆయామ్ సారీ" అంది హయాణ భావలో.

విలన్ వదలిపోయినందుకూ, హీరోచేత దెబ్బలు తప్పినందుకూ "థాంక్యూ థాంక్యూ" అంది సరళ.

"ప్రమాద మేం జరగలేదు కద? నో డేంజర్ కద?"

"ఏం లేదు. రౌడీవెధవ. మీకేం దెబ్బలు తగల్లేదు కద?"

"ఇక్కడ చిన్నదెబ్బ...హమ్మ తగల్లేదు."

"అయామ్ సో సారీ."

"ఫర్లేదు, ఫర్లేదు."

"సమయానికి సరిగ్గా ఒచ్చి రక్షించేరు."

"రక్షించనూ? డ్యూటీ డ్యూటీ."

"మీకు చాలా థాంక్స్."

"ఉంచండి. ఫరవాలేదు. హమ్మహమ్మ. ఎవడా 'రోగు?'

"రత్తమ్మ..."

"ఆడదా?"

"కాదు. రత్తమ్మ కొడుకు."

"కొడుకా?"

"అవును."

"ఎవరి కొడుకు?"

"రత్తమ్మ కొడుకు. ఒక్క రౌడీ."

"రౌడీనా?"

"అవును."

"ఏం చేసేడు?"

"తన్నాలండీ అలాటివాళ్ళని."

"ఏం చేసేడు. కొట్టేడా?"

"కొట్టలేదు"

"మరేం చేసేడు?"

"........."

"ఏం చేసేడు మరైతే?"

"........."

"ఒహో"

"........." తెలివి తక్కువ మనిషిలా ఉన్నాడు.

"అవమానించేడా? రాస్కెల్ రాస్కెల్! వాడిపని పట్టిస్తానెండి. ఇప్పుడు కాదు. రేపు, మీరు సరళాదేవిగారు కదూ? అవునవును, నాకు తెలుసు. పదండి పదండి. ఇంటికి దిగబెట్టేస్తాను"

ఇద్దరూ నడిచేరు.

'అతికొంచెం' దూరంవరకూ అతను మౌనంగా ఉన్నాడు. తరువాత టక్కున ఆగిపోయేడు. సరళ కూడా ఆగింది.

అది రోడ్డు జంక్షను. పక్క రోడ్డులో దూరాన్న ఓ దీపం ఉంది. దాని పల్చటి వెలుగులో అతణ్ని కొంచెం క్యూరియస్‌గా చూసింది సరళ. పొడుం రంగుది కాబోలు పంట్లాం. అమెరికన్ జాకెట్టు నీలపురంగుది. అతనికి ముప్ఫయ్యేళ్ళుండ వచ్చు. ఎవరో నెత్తిమీదకొట్టి పొట్టిచేసినట్టుగా ఉన్నాడు. ఆ పొట్టితనం సహజంగా లేదు. అతని జట్టు పొట్టి, అతని ముక్కుపొట్టి, మొత్తం మీద మనిషి కొంచెం వింతగా కనిపిస్తున్నాడు. అంతకు ముందు అతన్నెప్పుడు చూసినట్టు గుర్తు రాలేదు సరళకి.

రోడ్డు జంక్షన్లో ఆగి, సరళ ముఖంలోకి చూస్తూ "నా పేరేవిటో తెలుసా మీకూ?" అని అడిగేడు. తొందరలో అతని మాట తొట్రుపడింది. ఆపదలో ఉన్న ఆడపిల్లకి సాయపడగలిగినందు కతను చాలా ఉద్రిక్తుడయి వున్నాడని తెలుస్తోంది.

"నా పేరేవిటో తెలుసా మీకూ?"

"తెలీదు. సారీ...కాని నా పేరెలా తెలిసింది మీకూ?"

"మిమ్మల్నెందుకు తెలీదూ?! బాగా తెలుసు. కాన్నా పేరు మీకు తెలుసా?"

నేనెవరో మీకు తెలుసా? నన్నెప్పుడైనా మీరు చూసేరా? నేనెవరో మీకు తెలిసుండక పోవచ్చు. నేను ఫలానా... అని ఆ వరసలో మాట్లాడ్డం లేదతను. తన పేరేమిటో తెలుసా అని అడుగుతున్నాడు.

"ఇదేమిటీ వరస?" అనుకొంది సరళ.

"నా పేరు తెలుసా?"

"తెలీదు" పేరు చెప్పడానికి చాలా ముచ్చట పడిపోతున్నాడే!

"చెప్పనా?"

"చెప్పండి" దానికింత సస్పెన్సెందుకూ?

"ఆశ్చర్యపోతారు"

"ఎందుకూ?" పెద్దవాడు కాదు కద?!

"నా పేరు జాన్ లూయీరావు" అని గంభీరంగా చెప్పి ట్రయంఫెంటుగా చూసేడతను.

సరళకి ఏమనడానికీ తోచక "ఓహో" అంది.

పేరు విని ఏం చెయ్యమంటాడు? మూర్ఛపొమ్మంటాడా, ముద్దెట్టుకోమంటాడా?

"కాన్నేను క్రిస్టియన్ని కాను. I am not a Christian. స్వచ్ఛమైన..." అని తనది స్వచ్ఛమైన ఏ వర్ణమో తెలియజేసేడు. ఇంకా చెప్తున్నాడు.

"మాట వింటే తెలుగువాణ్ణనుకోవచ్చు గాని, నోరు మెదపకుండా వుంటే నన్ను చూసి ఎవ్వరూ అనుకోరు తెలుగువాణ్ణని. ఇందాట్లా నన్ను చూసినప్పుడు మీరేమనుకున్నారు?"

"ఇందాట్లా చీకటే, మీరాన్నాకు కనిపించనే లేదు" అంది సరళ.

"సరిగా చూస్తే తప్పక ఆంగ్లో ఇండియన్నని మీరు కూడా అనుకొనుందురు ఎంతోమందన్నారు. "అబ్బ! మీరచ్చంగా ఏంగ్లో ఇండియన్లా ఉంటారండీ" అని ఎన్నోసార్లన్నారు. అంతేకాదండోయ్. నన్ను చూసి ఓ గోజున గబగబ ఒచ్చేసేడు ఒకాడు. ఉంగరాల జుట్టు. తెల్లగా పొడవుగా టిప్‌టాప్‌గా వున్నాడు. మెళ్ళో బంగారపు గొలుసు. దానికి చిన్న బ్యూటిఫుల్ శిలువ. గడగడ మాట్లాడేస్తున్నాడు. ఏవిటది? మళయాళం!

"అహా?"

"వాడు సిరియన్ క్రిస్టియను. నన్ను చూసి వాళ్ళ కజిన్ననుకున్నాడు. చూడం డెలా అనుకున్నాడో, బావుందా?"

"బావుంది."

"తరవాత సారీసారీ అన్నాడు. ఫరవా లేదన్నాన్నేను. ఆ తర్వాత ఇద్దరం ఫ్రెండ్సయి పోయేం. వాడిప్పుడు బొంబేలో వున్నాడు. ఫ్రెంచ్‌ఫర్మ్‌కి మానేజరు."

"అలాగనా?"

"అంతేనండీ. సిరియన్ క్రిస్టియన్ననుకున్నారు, పార్సీపిల్లాణ్ణనుకున్నారు, కొంకణ్ బ్రాహ్మణ్ణనుకున్నారు, ఆఖరికి కూర్గువాణ్ణనికూడా అనుకున్నారు నన్ను చూసి. తెలుగువాణ్ణని మాత్రం ఎవ్వరూ అనుకోలేదు! అదేమిటో?"

తెలుగువాళ్లా కాకుండా మరోలా

ఉన్నందుకు అతను మిక్కిలిగా మురిసిపోతున్నాడు; ఎక్కువగా సంబరపడుతున్నాడు. చేతులూపుతూ గడగడ మాటాడుతూ మెల్లగ నడుస్తూన్నవాడు మళ్లీ టక్కున ఆగిపోయేడు.

"మీ ర్నాకు జాన్ లూయీరావు పేరెలా వచ్చిందో అడగరేం?" అంటూ సరళని తన వావిధంగా ప్రశ్నించవలసిందిగా నిర్బంధించేడు. అడక్క తప్పదు. అంచేత అడిగింది సరళ.

"చెప్తా వినండి......"అంటూ చెప్పడం సాగించేడు. తల్లిగర్భమందు తానున్నయప్పుడు ఆతల్లి కాలుజారి ఏట్లోపడిందట. అప్పుడొక దొర ("ప్యూర్ ఇంగ్లీష్ మన్") గప్పున ప్రవాహంలోకి దూకి ఆమెనిపట్టుకు ఈడుకొచ్చి ఒడ్డుకుచేర్చి రక్షించేట్ట, అతని యెడల తమకుండే కృతజ్ఞతకి చిహ్నంగా తనకా దొర పేరు పెట్టేరుట తన తలిదండ్రులు.

"రెండు ఫర్లాంగులు కొట్టుకుపోయిందిట మామదరు పాపం, మాఫాదరేం చెయ్యగల్డూ? నీరంటే అసలే భయం అతనికి. పూర్మేన్! అగట్టుమీద నిల్చొని లబోలబోమని కేక లేస్తూంటే, పాపం ఆ దొర—మిస్టర్ జాన్‌లూయీ—ఆకేకలు విని కొరాపి మరి వచ్చేట. రావడం ఏంవిటి, సంగతి చూడ్డం ఏంవిటీ, ఏట్లోకి దూకడం ఏంవిటి! అంతా హాఫ్ సెకన్!...అతనే లేకపోతే మామదరు లేకపోను, నేనూ లేకపోగును, మరిప్పుడు మిమ్మల్ని సేవ్ చెయ్యడాని కెవరూ రాకనూ పోగురు గదా!? హహ్హహ్హా!"

జాన్‌లూయీరావుతో ఆవిధంగా పరిచయం అయింది సరళాదేవికి.

ఆ తరువాత కొద్దిరోజులకే తెలిసింది, ఆ తమ్ముకొడుకు ఊరొదిలిపోయి మిలిటరీలో చేరేడన్న భోగట్టా.

ఆ తమ్ముకొడుకు!

పీడపోయింది,

మరి, జాన్ లూయీరావు?

పట్టుకు వదలడం లేదు.

"రక్షించడం కాదుకాని పిశాచంలా పీడిస్తున్నాడు" ఎప్పుడుపడితే అప్పుడు ఇంటికొచ్చేస్తాడు. ఎక్కడపడితే అక్కడ పలకరించేస్తాడు. పలకరించడంలో ప్రమాదమేమీ లేదు. కాని పలకరించిన తరువాత ఇంతకీ వదలడు, అంతకీ, వదలడు. గంట మాట్లాడితే అందులో ముప్పావుగంట తన గురించే చెప్పుకుంటాడు. ఆ విధంగా గంటల తరబడి మాట్లాడతాడు. తనిప్పుడే ఇంత బావున్నాడా? చిన్నప్పుడు ఇంకా బావుండేవాట్ట, "ఫోటో చూపిస్తానుండండి. యూరపియన్ బేబీలా ఉండేవాణ్ని లేదో మీరే చెబుదురుగాని "తనెప్పుడూ డీసెంట్‌గా డ్రెస్ అవుతాట్ట. తనకి మంచిస్నేహితులున్నారట. 'షిప్పుసిగరెట్టు' తప్పించి మరొకటి మరెప్పుడూ తను కాల్చడట. సింధీషాపువాడు తనకి మంచిఫ్రెండట, అక్కడ మంచి బ్రాసియర్స్ దొరుకుతాయట. "ఇద్దరం కల్సివెళ్దాం"ట "రారా?"ట ఎందుకు రారూ?!"ట.

ఈప్రకారం సరళని పిచ్చెత్తించేసేడతను.

అతనికి తమాషా తమాషా "బడాయి"లున్నాయి.

తను తెలుగువాళ్లా ఉండనని గొప్ప; తను ఆంగ్లోఇండియన్లా ఉంటానని గర్వం; తనకి దొరపేరుందని డాబు; తను ఇంగ్లీషు బాగా మాట్లాడగలనని బడాయి; తనకి అరవస్నేహితులున్నారని గొప్ప. తన నేస్తుడొకడు శ్రీనగర్లో ఉన్నాడని గర్వం; మిస్ మేరీని తనకి బాగా తెలుసునని డాబు; తన 'కజిను' పెంటకుప్ప జమీందారని బడాయి; తన చెల్లిపెళ్లికి తాము పదివేలు కట్నమిచ్చేమని గొప్ప. మహ్మద్ హాసన్‌కీ మాధవీలతకీ జరిగినపెళ్ళి తనమధ్యవర్తిత్వమే లేకపోతే జరక్కపోయేదని గర్వం; అను అతి కాస్మాపాలిటన్‌గా ఉంటానని డాబు; తనది స్వచ్ఛమైన ఫలానావర్ణమని బడాయి.

"రక్షించడం కాదుకాని ప్లేగులా పట్టుకున్నాడు."

అతను సరళని రకరకాలుగా బాధించడం ప్రారంభించేడు. గుట్టుగా ఉంచవలసిన విషయమే అయినప్పటికీ కొంతమంది "నాభార్య ఇలాగా, నాభార్య అలాగా"అని పదిమందితోనూ చెప్పుకుంటారు. అటువంటివాడు లూయీరావు. అయితే అతనికి భార్యలేదు. ఇంకా బ్రహ్మచారి. భార్యలేకపోతేనేం? సరళుందికదూ! అందుచేత ఆమెగురించి ఆవిధంగా చాటడం ప్రారంభించేడు.

"రక్షించడంకాదు కాని జీడిమార్కులా ఒదల్డంలేదు"

అతగాణ్ని ఎలా వదల్చుకోడం? బుర్ర బద్దలుకొట్టుకున్నా వదలడంలేదతను. ఆఖరికి, పిణ్ణింక "తంతేతప్ప లాభంలేద"నే అభిప్రాయానికివచ్చింది సరళ. అంతగా వేధించుకు తినేసేడామె నతను.

ఓరోజున సర్వానికీ సిద్ధపడికూర్చుంది సరళ. ఇవాళ 'వాడురావాలి. ఏదైనా అసందర్భంగా మాట్లాడాలి, అప్పుడు పట్టించాలి వాడిపని' అనుకొని కూర్చుంది.

కాని జాన్ లూయీ ఆరోజు రాలేదు; కనిపించలేదు. ఆమర్నాడుకూడా కనిపించలేదు. మరి నాలుగురోజులు వరసగా గడిచేయి. తరువాత ఓసాయంకాలం సరళకి ఉత్తరం వచ్చింది. ఎవ్రాసేరు? "వాడ్రాసేడు."

"నా ప్రియమైనసరళా"తో ప్రారంభించేడు. "నీ ప్రియమైన జాన్"తో ముగించేడు. అతగాడికి కలకత్తాలో ఉద్యోగం అయిందట. తంతిమీద ఆర్డర్లు వచ్చాయట. అందుచేత పిట్టమనిషితోనైనా చెప్పలేకుండా మూణ్ణిముషాల్లో మూటా ముల్లె సర్దుకొనిపోవలసి వచ్చిందట. మళ్ళీ "కలుసుకుంటాం తప్పక తప్పక తప్పక"ట. ఈలోగా అధమం వారానికి ఒక్కసారైనా జాబు రాస్తూండగలనని హామీ ఇవ్వగలడట.

కలకత్తాపోయేడు!

రక్షించేడు!

కాని, పోస్టుద్వారా బాధించడం సాగించేడు. సరళకి ఇంట్లో చిత్తుకాయితాల బుట్ట ఒకటేకూడా లేదు. అందుచేత ఆఉత్తరాలన్నిటినీ పొయ్యిలో పడేసేది. రోజులు నడవగా నడవగా ఉత్తరాల బాధకూడా తగ్గిపోయింది. పోయింది.

ఈవిధంగా కొన్నాళ్ళయింది. వాతావరణం ప్రశాంతంగా ఉంది. సరళకి ఎప్పు

# ★ రక్షకులు ★

డైవా పీడకలొచ్చినప్పుడు తప్ప జాన్ లూయీరావు జ్ఞప్తికి రావడంలేదు. ఆమె జీవితం సాఫీగా హాయిగా సాగిపోతోంది. ఆమెకి లోకం వసంతకాలంలా ఉంది; ఆకాశం నీలపుగోపురంలా ఉంది; వెన్నెల మల్లెల పంటలా ఉంది; రోజులు రోజాపువ్వుల్లా ఉన్నాయి. మనుష్యులు అందరూ రత్తిమ్మ కొడుకులు కాదు. మరి జాన్‌లూయీరావు లేడు.

సరళకి నిజంగా చాలా హాయిగా ఉంది.

ఒకరోజున రాత్రి సుమారు పదిగంటల సమయానికి అదే "చీకటిరోడ్డు"న సరళ ఇంటికి నడుస్తోంది. ఆరోజున అది చీకటి రోడ్డు మాత్రం కాదు. పక్కనున్న చెట్లు వెన్నెల ముసుగులు వేసుకున్నాయి' రోడ్డంతా వెన్నెల ముగ్గులు వేసుకొంది. సరళ నిర్భయంగా నడుస్తోంది. ఆమె బావ వస్తున్నానని ఉత్తరం రాసేడు. ఉత్తరం ఆమెకాదినమే అందినది. తెల్లవారితే వచ్చే రోజు అతను వచ్చేరోజు. తెల్లవారితే ఆమె కది శుభదినం. ఆమెకి చాలా సంతోషంగా ఉంది. పూలపరుపుమీద ఉన్నట్టుగా ఉంది. చెట్లతో రోడ్డు పందిరివేసుకొంది. చంద్రుడు ఏ క్షణానికో పందిరికింద కొచ్చే పెళ్ళికొడుకులా ఉన్నాడు. తారలు తెలిమబ్బుల మధుపర్కాలు కట్టుకొంటున్నాయి. ఎక్కణ్ణించో సన్నని సన్నాయి వాయిద్యం వినవస్తోంది.

సరళ అందుకే అంతగా నవ్వుకొంటూ నడుస్తోంది. పాటలూ, పువ్వులూ, పెళ్ళిళ్లూ వాటిగురించి ఆలోచించుకొంటూ నడుస్తోంటే మీదనుంచి తేళ్ళూ జెర్రులూ పడ్డట్టు "హాలో సరళా" అనే మాటలు ఆమె చెవినిపడ్డాయి.

ఝల్లుపడింది సరళ.

ఆ ఝల్లుపడ్డంలో ఆమె తొడుక్కున్న కోటుకింద, కట్టుకున్న చీరకుచ్చెళ్ళు చిక్కుకున్నాయి. ఆమె ముందుకు తూలిపడి పోలేదు. తూగిపడబోయింది. ఇంతలో జాన్ లూయీరావు వచ్చి ఆమెని పట్టుకున్నాడు.

జాన్ లూయీరావు ఆరోజునే వచ్చేడు కలకత్తానుంచి. రాగానే సరళకోసం ఆమె ఇంటికి వెళ్ళేడు. ఆమె లేదు. రాత్రి పదింటికి కాని ఇంటికి రాకపోవచ్చని తెలుసుకున్నాడు. ఈలోగా బజారంతా తిరిగి, క్లబ్బుకి వెళ్ళి, కనిపించిన పరిచయస్థుల్ని వీలైనంతగా పీడించి, హుషార్‌గా తిరిగి వస్తున్నాడు. వస్తూ ఆమెగురించే ఆలో

(33 వ పేజీ చూడండి)



చలచిత్ర కథలు

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

మా కొట్టుకు ఎదురుగా ఒక పెద్దకారు ఆగింది. అందులో ఆసామి దుకాణం లోకి పరకాయించిచూసి, కారుతోలుకు వెళ్లిపోయాడు.

బల్లకిందనించి కుబేరావతారం మెల్లిగా ఇవతలికొచ్చి కూర్చుంది.

'భలే డేంజరు తప్పింది. వారు కనక చూస్తే ఈ బటాణీ నాకు దక్కేదికాదు—' అన్నాడు కుబేరుడు ఉరఫ్ బాబు తృప్తిగా నవ్వి.

"సార్! మీ మిస్టరీ రానురాను మరింత మహాంధకారంగా ఉంది. చప్పున మీకథ విప్పెయ్యండి."

బాబు ఉలిక్కిపడ్డాడు. 'నా ఏమిటి విప్పెయ్యమన్నారూ' అన్నాడు.

'కథండీ. కథ,'

"ఓ అంతేగదా ... చెప్పేస్తాను...సరే అలా పుకారు లేచిందండి. పుకారేమిటి, పుట్టు అనుకోండి. నా జన్మపుట్టు... కొన్నాళ్ళవరకు నాకే తెలీదు. జనం నాకేసి వింతగాచూసేవారు. ప్రొడ్యూసర్లు అభిమానంతో మాట్లాడేవారు. అతనే అతనే అని నాకేసిచూసి గుసగుసలాడుకునేవారుట.

నాకేంతెలుసు, నేను ఉన్న కొంచెం డబ్బుతో ప్రొడక్షను మొదలెడదామనుకున్నాను.

కొంచెం అంటే ఇంతా అంతా కొంచెం కాదు. దారుణమైన కొంచెంలెండి చెప్పితే సిగ్గేస్తుంది. కాని చాలామంది అంతేనట. ఎవరన్నావస్తే కాఫీ ఇవ్వడానికే, ఎక్కడికన్నా వెళ్తే టాక్సీ ఎక్కడానికి అని కొద్దిగా ఉంచుకున్నాను. మరయితే సినిమా ఎలా తీద్దామనుకున్నావు అంటారేమో.

అక్కడే తెలివితేటలు. అదో మేధస్సు. అంతే. ఉత్తి మేధస్సే అనుకోండి.

ముందర గిరాకీలేని ఆర్టు డైరెక్టరుదగ్గిరకెళ్లాం, నేనూ మా శనిగ్రహమూను. శనిగ్రహం అంటే, చెప్పానుగా మా దాంట్లో షేరుహోల్డరని. షేరంటే షేరుకాదనుకోండి. నేను మైనార్టీవాణ్ణి అయినప్పుడు నాకు బీడీలు ఇవ్వడం, మా నానకి చెప్పకుండా అప్పులివ్వడం అవీ ఉండేది. అవన్నీ

**ఎస్. పార్థసారధి**

పదిలక్షల రూపాయలు అయ్యాయిట. ఇప్పుడిచ్చెయ్యి అన్నాడు వచ్చి. నేను లేదన్నాను. అయితే నీదాంట్లో పార్ట్నరుని అవుతాను అదేపెట్టుబడిమీద అని కాయితం మీద సంతకం పెట్టేశాడు. నేను పెట్టలేదనుకోండి. వెర్రివెధవ.

సరే ఆ ఆర్టువాడిదగ్గిరకెళ్లి ఇలా ఓ పిక్చరుకేమపుచ్చుకుంటావయ్యా అన్నాం. చెప్పాడు. ఇదుగో అబ్బాయి. నువ్వుకోపి లాభంలేదు. పచ్చికొత్తవాడివి. నీకేం గిరాకీ లేదు. మేము కళాభిమానం కొద్దీ నీలాంటి నవయువకులను, యువనవకులను ఫీల్డులోకి రానిచ్చి పైకి తేవాలనుకున్నాం. అందువల్ల నీ రేటు తగ్గించి ఇంతకి ఒప్పుకుంటావా లేదా అన్నాం.

సరే అన్నాడు వాడు. ఇదఎడ్వాన్సు అని వాడి గుప్పిట్లో ఓ రూపాయి పెట్టేసి ముందర బోర్డు రాసియ్యి చిన్నది అన్నాం. దానికి రేఖా రంగులూ వాడే చూసుకుని



మహాదేవి దుర్గ [కటక్]

—ఫొటో : కమ్రుద్దీన్]

# ★ విక్రమార్కుడి మార్కు సింహాసనం ★

రాసిచ్చాడు. దమ్మిడీ ఖర్చు లేదుగదా.

సరే ఇంకకథ. కో అంటే కోటిమంది కథ లిస్తారు.

"సార్ నాదగ్గిర యూడు బ్రిలియంట్ స్టోరీసున్నాయండీ" అన్నాడు రాజా ఉత్సాహంగా అడ్డుతగిలి.

"నా దగ్గర యూడు వందలుండాలి. మొన్ననే వీశలెక్కన అమ్మి పారేశాను. కావలిస్తే గంటకి వంద రాయగలను ఎడంచేత్తో... ఏం?

అపశంగా ఓ రోజున 'క-'అన్నాను. -థలూ, సినేరియాలూ సాంగులూ గట్రా రిక్షాలమీద వచ్చేశాయి. వాటిమీద కూర్చుని ఒకటే డిస్కషన్లు ఒకాటే డిస్కషన్లు. కాఫీ ఖర్చులుకూడా ఆటే అయ్యేవి కావనుకో. ఎందుకంటే, మనం తెప్పించకుండా ఊరుకుంటే, ఆ రాసినవాడున్నాడు చూడు వాడే గాలన్లకొద్దీ తెప్పించేస్తాడు ఆ ఊపులో. అలా ఆశ్చర్యపోతావేం. కూర్చో. అది అంతేలే.

ఇలా డిస్కషన్లు ఎంతకీ తెమలకుండా సీరియల్ గా జరిగిపోతూఉంటే, నా రంగా, ఊళ్ళో ఎంత సస్పెన్సో నేచెప్పలేను. మాకసలు పిక్చరు పూర్తిఅయేదాకా డిస్ట్రిబ్యూటర్లే అక్కర్లేదని ఓ ఫస్టుక్లాసైన పుకారొకటి వూపులో వేసి పాండీబజారులో పబ్లిక్ టీ పార్టీ ఇచ్చేశాం.

ఈ దెబ్బన పెద్ద స్టార్లు నేనంటే నేనని మా కంపెనీకి వచ్చేస్తారని లెక్కేశాం. వచ్చేవారేగాని కొన్ని చిన్న చిన్న ఫిట్టింగులు అడ్డుపడ్డాయనుకో.

సరే డిస్ట్రిబ్యూటర్లకోసం ప్రయత్నం చెయ్యాలిగా. ఒకటిరెండుపత్రికల్లో న్యూసు వేయించాం. ఇలా ఫలానావాడు-మాంచి నవనవలాడే నవయువకుడూ, ఆదర్శజీవి, కళామూర్తి, స్వార్థజీవి, శాంతిమూర్తి, ఫిలిము తీస్తున్నాడూ, వీరు గొప్ప కళాఖండం ఉత్పత్తి చేయగలరని ఆశిస్తున్నామూ అలాని రాశారు.

సరే పిక్చరు ఎక్కడిదో అక్కడ మొదలెట్టాలిగా. బెట్టు తగ్గితే కథ చెడిని కొడుతుందికదా.

డబ్బు ఖర్చులేని ఉత్తమ బిగినింగు మ్యూజిక్కుగదా. అది అందరికీ తెలుసులే.

ఆర్టువాడిలాగే ఆటే గిరాకీలేని ఓమ్యూజిక్కువాణ్ణి పట్టాం. ఆయనకి డ్రామా సాంగులు ఆర్మోణీమీద కొన్ని వచ్చు. పాడతానంటాడుకూడా. ఇంకో అసిస్టెంటున్నాడు. ఈయన నోటితో వరసలు అంటే, ఆయన వాటికి సరిగమలు రాసిస్తాడుట. ఈ మనిషి బాగా లావుగాని గొంతుకమటుకు సన్నమే. బంగారంతీగలాగ సాగుతుంది.

సరే ఆయన్ని బుక్కుచేశాం. ఒకటే కండీషననుకు. ఎడ్వాన్సులేదు.

"అయ్యా ఇది టెక్నీషియన్ల పిక్చరు. కళాజీవులందరు పోగై ఈపనికిఒడిగట్టారూ. అంజలీ నాగేశ్వరరావు ఊరికే నే కోపరేషను చేస్తామన్నారూ. రంగారావు, రేలంగీకూడా ఒప్పేసుకున్నారు. ఎవరికీ (వాళ్ళకి) చెప్పకండీ వీళ్ళందరికీ ఫిజాలూ, బోనసులూ ఆఖర్ని ఇస్తాము" మాకూ అంతేను కావలిస్తే కొంతపని అయ్యాకా మీకోసం ప్రత్యేకం కొంత డబ్బు ఇస్తామూ అని చెప్పాం.

ఇంతకన్నా తక్కువకే - అంటే, డబ్బు ఎదురిచ్చి మ్యూజిక్కుడైరెక్షను చేసేసేవాళ్ళు చాలామంది ఉన్నారని చెప్పడంతో ఆయన తక్కువమని ఒప్పుకున్నాడు. తరవాత, ఆమన్నాడు అసలు కండిషను పెట్టాం.

"ఇదుగో బ్రదర్. కంట్రాక్టు కాయితం రెడీగా ఉంది. నువ్వు ఏంచేస్తావో ఎలా చేస్తావో నీయిష్టంగాని, మళ్ళీ సోమవారం నాటికి మూడుపాటలు రికార్డింగు చేయించి మాకు ఒప్పచెప్పాలి. ఆర్కెస్ట్రావాళ్ళని కుదుర్చుకోడం, వాళ్ళచేత రిహార్సలు చేయించడం, వాళ్ళకి కాఫీ ఉప్మాల దగ్గిర్నించీ డబ్బులివ్వడంవరకూ అంతా నీదె పూచీ. స్టుడియో గిడియో అన్నీ నువ్వే అరువుకి మాట్లాడాలి. పాటలుమటుకు మేం రాసిస్తాం. కావలిస్తే పూజ రోజుని కొబ్బరికాయలూ అవీ తెస్తాం చూసుకో చాన్సు. ఇవి కనక చేస్తివా మా నెస్టు పిక్చరుకికూడా నిన్ను ఇపుడే బుక్ చేస్తాం. అది పెద్ద కాష్ట్యూం పిక్చరు. కలర్ బై టెక్నికలర్ లో తీస్తున్నాం. కొన్నిదృశ్యాలు జీవాకలర్ లో ఉంటాయి చూస్కో" అన్నాం.

ఆ మ్యూజికు డైరెక్టరు సోలటైపోయి సరే నన్నారు. కాని పాడేవాళ్ళు వాళ్ళు అరువు పాడరేమో అన్నాడు మా శనిగ్రహం. నాదగ్గిర మేథస్సు ఉండబట్టి సరిపోయింది. లేపోతే పెద్ద సమస్యే. మ్యూజిక్ డైరెకరు హీరోవీ, అసిస్టెంటు హీరోయినువీ పాడెయ్యొచ్చుగదా అన్నాను. ఖేప్

అన్నారు వాళ్ళు.

ఇంకేముంది వాడు ఆ మూడు పాటలూ రికార్డుచేయించి ఇచ్చేస్తే పత్రికల్లో రెండు సార్లు న్యూసుపడిపోతే, అవి డిస్ట్రిబ్యూటర్ వింటే, దుమ్మని డంగైపోయి డబ్బిచ్చేస్తాడంటే.

బ్రదర్ ఇదంతా నా కథలో సగం అన్న మాట. ఊరికినే చెప్పాను. ఇంట్రెష్టుగా ఉందని. ఇది సులభ పద్ధతిఅన్నమాట. ప్రతివాళ్ళనీ అలా అందరూ నమ్మరనుకో నేను పూర్వజన్మంలో కుబేరుణ్ణి గదా మరి. అందుకని మనమాటకి విలవ.

కాని అదే కొంప ముంచింది చివరికి.

చెప్పానుగా నా దగ్గిర చాలా కొంచెం, దారుణంగా కొంచెం డబ్బుందని? ఆ మ్యూజిక్కువాడు వారం అల్లా నాలుగు వారాలు సాగతీశాడు. డబ్బు కొంత లేకపోతే లాభంలేదని కాళ్లు తేలేశాడు. కొంత సెట్టుచేసి, ఇంక ఇద్దామా అని అనుకుంటూ ఉండగా ఓ పెద్ద ప్రొడ్యూసరు ఓ రోజు పొద్దున్నే వచ్చాడు. 'నమస్కారం సార్' అన్నాడు.

హడిలిపోయాను. వాటీజ్ దిస్ ఈనతో మాట్లాడానికే అవకాశం దొరకదనుకుంటే, ఈయనే మనింటికొచ్చాడే అని ఆశ్చర్యపడి లేచాను.

సార్ నాకు టైమైంది కాని ఒక్క చిన్న ఉపకారం చెయ్యాలి. ఒక హండ్రెడ్ రుపీస్ ఇవ్వండి. కొంచెం ఇబ్బంది ఉంది. ఆనక సర్దుకుందాం అన్నాడు.

నేను షాకు తినేశానులే. ఏమిటిది. ఇంత పెద్దవాడు ఇంత పొద్దున్నే వచ్చి మన్ని వందరూపాయలు అప్పడగడం ఏమిటి అని. నేను అపుడే హైక్లాసు ప్రొడ్యూసర్లలో కలిసిపోయానన్న మాట. ఓరిబాబో అనుకున్నాను.

అనుకుని వెంటనే చెక్కు రాసేసి, రైటో బ్రెదరూ విష్ యూ గుడ్‌లక్ అన్నాను.

ఆయన ఆనందానికి పట్టపగ్గాలు లేవు. ఉన్నా పట్టడం కష్టం అనుకో. ఆనందం గుర్రమా దున్నపోతా.

ఆయన ఆనందంగా నన్ను కౌగలించేసుకుని విడిచేసి కారెక్కి వెళ్ళిపోయాడు.

ఇంకో గంటకి ఇంకోఆయన వచ్చాడు. ఆయనా ఇలాగే అర్జెంటుగా హండ్రెడు కావాలన్నాడు. వాతీజ్ దిస్, అనుకుని ఇచ్చేశాను. సాటి ప్రొడ్యూసరికి సర్దని బ్రతుకెందుకుఅన్నాను. ఆయనా ఆనందంతో నన్ను కౌగలించుకుని గదినిండా వాల్ట్జ్ అనే డాన్సుచేసేసి వెళ్ళిపోయాడు. మధ్యాహ్నం మూడింటికి ఓ డిస్ట్రిబ్యూటరు వచ్చి వెయ్యి రూపాయిలియ్యి అన్నాడు. అదివరలో మాకు పరిచయం ఉంది. నేనే ఈనదగ్గర మాట్లాడి డిస్ట్రిబ్యూషను కాంట్రాక్టు రాయాలనుకుంటున్నాను. వెదకబోయే డిస్ట్రిబ్యూటరే వేడుకుంటున్నాడే అనుకుని చెక్కు రాసేశాను. డబ్బెక్కడికి పోయేనులే అని.

మర్నాడు ఒక యాక్టరు సెకట్రీవచ్చి, ఒక ఫిఫ్టీ రుపీసు తీసుకెళ్ళాడు. ఇంకోగంటకి ఇంకో కొత్తాయనవచ్చి కొత్తగా కంపెనీ పెడుతున్నాను, పూజకి రావాలి అని పిలిచి పది రూపాయలు అడిగి పట్టికెళ్ళాడు.

ఏమిట్రా ఇది అనుకుంటూ ఉంటే, శనిగ్రహం వచ్చి మిష్టరీ విప్పకొట్టాడు. మనం పూర్వ జన్మలో కుబేరుడిమి అని అందరికీ తెలిసిపోయిందట. మనచేత్తో ఒక కానీ పెడితే చాలు అది కోటిరెట్లు పెరిగి కోట్ల కొద్దీ లాభాలు తెస్తోందట. అంతెందుకూ క్రితంరోజు పొద్దున్న వంద పట్టుకెళ్ళినాయన దగ్గిర డబ్బులేదనా? బోల్డుంది. అయితేనేం నా దగ్గిర డబ్బు తన దాంట్లో కలిపేసి పని మొదలెట్టాడో లేదో టామిల్ నాడ్, సిలన్, సర్కార్స్, నైజాంలకి డిస్ట్రిబ్యూషన్ బేరాలు కాళ్ళదగ్గిర కొచ్చాయట సాయంత్రానికల్లా. మళ్ళీ మెడ్రాస్ సిటీ, కోయంబటూర్, స్పెషల్ అన్నమాట. మరి చూస్కో తడాఖా. అలాగే రెండో ఆయన్ని మూణ్ణెల్లనించి తిప్పుతున్న బాక్సాఫీస్ స్టార్ తక్కున సంతకం పెట్టేశాడు కాంట్రాక్టుమీద ఇంకో ఆయన డబుల్ వర్షన్ పిక్చరు తీస్తున్నాడు. ఏక్ దమ్మన మూడు రోజులు ఇద్దరు హీరోలు, హీరోయన్‌లు, కమీడియన్‌లూ ఒక్కసెట్ మీద కలసి పనిచేశారు.

సరే ఇలా నా కీర్తి దారుణంగా కాఫీ హోటలు కాశాలా పెద సైజుకి పెరిగిపోతోంది. రాను రాను ఈ కీర్తివల్ల చాలా బాధ ఆయిపోయింది. నాకు కాతాదార్లు పెరిగిపోయారు. ఇటు నామహిమలూ, వాటి గురించి కథలూ పెరిగిపోతున్నాయి.

బ్రదర్ ఏం చెప్పమన్నావు నా అవస్థ! చూస్తూ ఉండగా నెలరోజుల్లో నాడబ్బంతా హారతి కర్పూరం లా హరించిపోయింది. ఇంక సినిమా ఏం తీస్తాను చెప్పు. అంతా కుట్రలా జరిగిపోయింది. ఉన్న సామానులు అన్నీ అమ్మేశాను. ఏం చెయ్యను. పెద్ద పెద్దవాళ్ళు వచ్చి ఐదూ పదీ అణా బేడా అప్పడుగుతే? వాళ్ళకి లేక కాదు గదా. లేని వాళ్ళడిగితే గట్టిగా గసిరి కొట్టుచ్చు.

నాదగ్గిర నిజంగా డబ్బయిపోయాక కూడా కొందరు నన్ను వదల్లేదంటే నమ్మ. నాకు లేదు మొర్రో అని మొత్తుకున్నా దమ్మిడీ అప్పు దొరికేదికాదు. నాకు అప్పిస్తే మళ్ళీ నామహిమ పనిచెయ్యదట. అదీ మా మావయ్యగాడే ప్రచారంచేసి ఉండాలి. మరి నాదగ్గిర డబ్బయిపోయాక ఏం చెయ్యాలి! ఏపని తలపెట్టినా నన్ను తలచుకుని నాచెయ్యి వేయించకుండా ముందడుగు వెయ్యరు కొందరు. అందుకని వాళ్ళే శక్తికొద్దీ భక్తి అన్నట్టుగా ఓ ట్రిక్కు చేశారు.

ముందస్తుగా ఒకాయనొచ్చి అయ్యో ఇబ్బందిగా ఉందా అని ఓ పది చేతులో పెట్టి అలా చాటుకెళ్ళి ఈలేసేవాడు. ఇంకో ఆయన గబుక్కున వచ్చి సార్ మీ చల్లని చేత్తో ఆపదీ ఇటు పారెయ్యండి. అని అది పుచ్చుకు చక్కాపోయేవాడు. నేను కొయ్యబారిపోయేవాణ్ణి ఈ డ్రామా చూసి. ఉండండి, ఓనాడు బొంబాయి లేచిపోయాను. అక్కడకన్న ఇక్కడే నయం అని తోచి మళ్ళీ తిరుగుటపాలో వచ్చేశానులే. ఏం.కొందరు డబ్బుదాకా ఎందుకని ఓసిగరెట్టో,— ఓ బీడియో పుచ్చుకుని అదే పదివేలని కళ్ళకద్దుకుపోయేవారు. ఖచ్చితంగా వాళ్ళనుకున్నపని జయం అయేదనుకో.

అయితే నాకేలలాభం.ఆఖరుకి నాగురించి అల్లిన కథల పుస్తకాల డబ్బులో రాయల్టీ కూడా రాలేదు. ఒకాయన నాకథ సినిమా తీస్తానని డిస్ట్రిబ్యూటర్లదగ్గర డబ్బుకి ట్రై చేశాడుకూడా. ఎవడేం చేసినా నా పరిస్థితి నానా అధ్వాన్నంగానూ తయారైపోయింది. ఇలా తిరుగుతున్నాను.

ఇపుడు నా పెట్టుబడితో సినిమా తీస్తున్న వాళ్ళు చాలామంది ఆ పిక్చర్లు రిలీజయ్యాక, నేను సినిమా తియ్యడానికి కావలసినంత పెట్టుబడీ అదీ ఇచ్చి సాయంచేస్తామని చెప్పారనుకో. అందాకా నాకు లాట్రీ తప్పదు. మా మావయ్య విలన్‌లా నవ్వి కసి తీర్చుకుని ఊరెళ్ళిపోయాడు. అదీ నా కథ అన్నాడు బాబు.

* * *

"బాగానే ఉంది. ఇందాక డాన్సుచేసినాయన ఎందుకు డాన్సుచేశాడు" అన్నాడు రాజుసిగరెట్టు ముటించి, బాబుకొకటిఇస్తూ.

బాబు నవ్వాడు. ఆయన ఒకడుకాడు. ఒరిజినల్ గా పూర్వం ఇద్దరు ప్రొడ్యూసర్లు. తరవాత ఒకడైపోయి డబుల్ వర్షన్ పిని మాలు తీస్తున్నాడు.

ఆయన పొద్దున్నే వెళ్తూ వెళ్తూ నా ధగ్గర బీడీ తీసుకుని అది కాల్చి వెళ్ళాడు. అంతే వెళ్ళినపని జయం అయిపోయింది. ఇందాక చెప్పాడువినలే? 'రెండు పేరుకుడుతుటాంగ' అని?అంటే ఇద్దరుహీరోలూ— తెలుగాయన అరవాయనకూడా ఒక్కసారే కాల్ షీటు ఇచ్చారట. ఆశ్చర్యపడటం లేదేం? హుఁ నీకేం తెలుస్తుంది కాల్ షీట్ దెబ్బ.

బ్రదర్ ఒకటి చెబుతా గుర్తుంచుకో. నువ్వు ఈ సినిమా ఫీల్డులో ఎన్ని కష్టమైన

(34-వ పేజీ చూడండి)

# అర్ధాంగి అలుక

సాయంత్రమైంది. శాబోటివారిని యిక శెలవుతీసుకుని ఇళ్ళకుపొండని ఆదేశిస్తున్నట్లుగా పుష్యమాసపు సూర్యుడు క్రిందకు జారిపోతున్నాడు. ఆఫీసునుంచి బయటపడి యింటివైపు నడక సాగించాను. శీతాకాలం అవటం మూలాన బాగా ప్రొద్దుగూక్కపోయినా చలి విదరిస్తూనేవుంది. ఆడవాళ్లు సాయంత్రపు వంటలు ప్రారంభించారు కాబోలు, ఇళ్లలోనుంచి సన్నగా పొగ బయటకువస్తోంది. రేపు ఆదివారం. సెలవు రోజున యేం చెయ్యాలో కార్యక్రమాన్ని వూహించుకుంటూ వెళ్తున్న నాకాళ్లు అలవాటుచొప్పున నా ప్రమేయం లేకుండానే పూల అంగడివద్ద ఆగిపోయాయి. అనేక రకాల పూలు అక్కడ అమ్మబడుతున్నా విజయకు ప్రియమైన సన్నజాజిపూలు మాత్రమే నేను రోజూ వాడికగా తీసుకుంటాను. రోజులాగ మామూలు పూలకు డబ్బులిస్తున్న నాకు పూల సాయిబు "ఈ వేళ శనివారం బాబూ!" అన్నాడు. శనివారంనాడు మరికొన్ని పూలు యెక్కువ తీసుకోవటం నాకలవాటు. శనివారాన్ని గురించి ఆలోచిస్తూ ఆరోజు శనివారమన్న మాట మర్చిపోయినందుకు నాలో నేనే నవ్వుకుని "నిజమే. ఇవ్వు." అన్నాను. సాయిబు సంతోషిస్తూ "మరో రెండువందలకంటె యెక్కువ లేవుబాబూ ఎదోయిచ్చి మొత్తం తీసుకోండి." అన్నాడు. జేబులో చూచుకుంటూ "ఇంక చిల్లర లేనట్లుందే!" అన్నా. "లేకపోతే రేపివ్వచ్చు. రోజూ వుండే బేరమేగా బాబూ! తీసుకువెళ్లండి." ముసలిసాయిబు తృప్తిగా నవ్వుతూ పూల అన్నిటి చక్కని కాగితంలో పొట్లంకట్టి చేతికిచ్చాడు. పూలపొట్లాం చేతపట్టుకుని మళ్లా నడక ప్రారంభించాను. సంక్రాంతి దగ్గరకు వస్తోంది. ఈసారి విజయకు యేదయినా ప్రత్యేక బహుమానం ఇవ్వాలి. సంక్రాంతి ఆమె పుట్టిన రోజవటం ప్రత్యేక విశేషం. క్రిందటిసారి అమ్మదగ్గరేవుంది. సంక్రాంతినాడు కొత్త బట్టలు కట్టుకుని అమ్మ చేయించిన రాళ్లబిళ్ళ జడమధ్యలో పెట్టుకుని, తల నిండా సన్నజాజి పూల పరిమళం నింపుకుని ఆరుబయట వెన్నెల్లో పడుకునివున్న నా దగ్గరకు వచ్చి "ఈ వేషం చూచారా?" అన్న విజయ రూపం నా కళ్ళముందు మెదిలింది. ఆనాటి విజయలో నూతన వధువులో గల ముగ్ధత్వం ఇంకా పోలేదు. ఆనాటి విజయకి యీనాటి విజయకి గల వ్యత్యాసాన్ని వూహించుకుంటూవచ్చి ఇంటిముందాగాను. ఒక్కొక్కళ్లకి ఒక్కొక్క వస్తువు అంటే యెందువలన అంతటి అపేక్ష కలుగుతుందో? ఆడవాళ్ళు చాలామంది గులాబీలు, మల్లెపూలు అంటే యిష్టపడటం చూచాను. కాని విజయకు సన్నజాజులంటే ప్రాణం.

## యద్దనపూడి సులోచనారాణి

ఈ రోజు అనుకున్న దానికంటె యెక్కువ పూలున్నాయి. పూలు చూచినప్పుడు సంతోషంలోని జయ మొహంలో ఆనందరేఖలు యెలా వెల్లివిరుస్తాయో వూహించుకుంటూ ఇంటి గుమ్మం యెక్కాను. అంతవరకూ తీయనితలపు లూరించుకుంటున్న నా మనసు తాళంపెట్టిన ఖాళీగుమ్మం స్వాగతం చెప్పేసరికి ఒక్కసారి ముడుచుకుపోయింది. మనసులో అంతకు ముందున్న ఆనందం, అనురాగం పోయి వాటి స్థానాన్ని, విసుగు, అలసటవచ్చి నిలబడ్డాయి.

నన్ను చూచి కాబోలు యింటివారమ్మాయి సుగుణ పరుగెత్తుకుంటూ వచ్చి తాళం చెవి యిచ్చింది.

"మీ అక్క యెక్కడకు పోయింది? నీకు తెలుసా?" అన్నాను తాళంచెవి తీసుకుంటూ. "ఊహు నాకు తెలియదు. అమ్మకిచ్చి వెళ్ళింది" అంటూ సుగుణ వెనక్కు తిరిగి బాణంలా పరుగెత్తుకుంటూ పోయింది. తాళంతీసి లోపలకు వెళ్ళి చేతిలో పూల పొట్లాం డ్రాయరుమీదకు విసిరి స్టాండ్ మీద తువాలు తీసుకుని దొడ్లోకి వెళ్ళాను. కాళ్ళూ, చేతులు, మొహం తుడుచుకుని వచ్చి హాల్లో ఫ్లాస్కు కోసం వెతికాను. ఆఫీసునుంచి యింటికి రాగానే కాఫీ తాగటం అలవాటు. ఒకవేళ విజయ అవసరమొచ్చి యెక్కడికైనా వెళ్ళవలసి వస్తే కాఫీ కాచి ఫ్లాస్కులో పెట్టి నా అవసరాలన్నిటిని సిద్ధపరచి వెళ్ళటం పరిపాటి. కాని ఈ రోజున దానికి వ్యతిరేకంగా జరిగింది. విజయమీది విసుగు కోపంగా మారింది. వంట ఇంట్లోకి వెళ్ళి చూచాను. అలమరలో ఖాళీ ఫ్లాస్కు నన్ను చూచి నీరసంగా నవ్వింది. కాఫీకూడ కాచకుండా వెళ్ళవలసినంత అర్జంట్ పని యేమొచ్చిందో? ఏముంది యే నీరజో వచ్చి రమ్మనివుంటుంది. వెళ్ళిందిగాబోలు! స్నేహితురాలి మోజులో భర్తనిగూడా మర్చిపోయే మనుషుల్ని యేమనాలి? సగం విసుగుతోనూ, సగం కోపంతోనూ వచ్చి హాల్లో కుర్చీలో కూలబడ్డాను. సాంధ్యచీకట్లు దట్టంగా అలుముకున్నాయి. ఇల్లంతా చీకటిగావుంది. లేచి లైటు వేశాను. మళ్ళా కుర్చీలో కూర్చోబోతుండగా యెదురుగుండా టేబిల్ మీద యేదో కవరు కన్పించింది. చెయ్యి చాచి తీసుకొని పై అడ్రస్ చూచాను. అది నాదే. వ్రాతగూడా చిరపరిచితమే. నా బాల్యమిత్రుడు జయపాల్ వ్రాతలాగుంది. వాడి దగ్గరనుంచి వుత్తరంవచ్చి చాలా రోజులయింది. వాళ్ళావిడకు వంట్లో బాగుండక పోవటంవల్ల పెళ్ళికికూడా రాలేదు. యేం వ్రాశాడో అనుకుంటూ కవరు చూశాను. చించేవుంది. చదివిందిగాబోలు. అనుకుంటూ లోపల కాగితాన్ని తీసి చదవటం మొదలుపెట్టాను. ఉత్తరంచదువుతుంటే నాలోవున్న విసుగు అలసట ఒక్కసారి మాయమయినాయి. ఆఉత్తరంవ్రాసిన పద్ధతిచూస్తే నాకు నవ్వాగిందికాదు. వాడేవో బాగా పైత్యంలో వుండి వ్రాశాడని అనుకుంటూ వచ్చేనవ్వు పైమీద తువాలుతో ఆపుకుంటూ వుత్తరం మరోసారి చదివాను. అందులో ఇలావుంది :



మహారాజశ్రీ

రాజశేఖరరావుగారికి వినయ పూర్వక నమస్కారములు. మీరు నాకుచేసిన వాగ్దానాలలో ఒక్కటి గూడా నిలబెట్టకోలేదు' ఈ వూరునుంచి వెళ్ళిపోయిన తర్వాత మీరు ఒక్క వుత్తరం గూడా వ్రాయలేదు. కారణం నాకు తెలియదు. నాకుచాలా గాభరాగా వుంది. మీరు నన్ను మర్చిపోలేదని పనుల తొందరలో వున్నారనే నమ్మకంతో వున్నాను నాకెప్పుడూ మీరే గుర్తొస్తారు. మీతోటి స్నేహం, ఆటలు...మరువలేనివి. ఈమధ్య యెవరో మీకు వివాహమైందని అన్నారు. ఆవార్త విన్నప్పటినుంచి నా గుండెల్లో ఆటంబాంబులు పేలుతున్నాయి. మీరు నాకు యిన్నాళ్ళనుంచి ఒక్క వుత్తరంగూడా వ్రాయకపోవటానికి కారణం యిదేనా అనిపిస్తోంది. అయినా నమ్మలేకుండా వున్నాను. మీరునాకు అన్యాయం చెయ్యరని నన్నుమీరు మర్చిపోలేదని నా అంతరాత్మ పదేపదే చెబ్తోంది. ఆధైర్యంతోనే యీ వుత్తరం వ్రాయటానికి సాహసిస్తున్నాను. మన ప్రేమసంగతి మానాన్న అమ్మలతో చెప్పాను. మీరేనా జీవితం అని అన్నాను. వారు మొదట్లో దిగ్భ్రిమచెందినా తర్వాత మన్నించి మీకు వుత్తరం వ్రాయటానికి అనుమతి యిచ్చారు. ఈ వుత్తరం చూచిన వెంటనే మీరు బయలుదేరిరండి, లేకపోతే అమ్మా, నాన్నా నేను చెప్పింది అబద్ధమను కుంటారు. మీరు నిజంగా పెళ్ళిచేసుకో లేదని, నన్ను మోసంచెయ్యరనే గట్టినమ్మకంతో వున్నాను. నా ఆశలన్నీ మీమీదనే వుంచుకున్నాను. ఒకవేళ మీరుగనక నిజంగా పెళ్ళిచేసుకునేవుంటే?!...యేం చెయ్యాలో నాకు తోచదు. అప్పుడు నాకు మరణమే ఆశ్రయదాత అవుతుంది. ఆడపిల్లని ఇంతకంటె యేంచెప్పగలను. నా మనసులో బాధ అర్థంచేసుకోండి. మీ రాకకోసం నేనేగాదు నా తలితండ్రులుగూడ యెదురు చూస్తున్నారు. అమ్మా నాన్నముందు నన్ను అసత్యవాదినిగా నిలబెట్టకండి. నేనా అవమానాన్ని సహించలేను. ఈదీనురాలిమీద దయ యుంచండి. మీకు కవిత్వభాషలో వుత్తరం వ్రాయటానికి నాకు బాగా చదువురాదన్న విషయం మీకు తెలుసుగదా! యెంతో శ్రమపడి యీ వుత్తరం వ్రాస్తున్నాను. తప్పులుంటే క్షమించండి.

ఇట్లు,
మీరాకకోసం, హృదయమంతా,
కళ్లుచేసుకుని యెదురుచూచే అభాగిని

జయప్రావాలు.

వచ్చే నవ్వుని అతికష్టంమీద ఆపుకోవాల్సి వచ్చింది. వీడెప్పుడూ యింతే. బి. ఎ. చదువుతుండగా ఒకసారి వేసంగిలో శెలవులకు యింటికి వెళ్తే అచ్చు ఆడపిల్ల వ్రాసినట్లు చక్కటి ప్రేమలేఖ సృష్టించి వ్రాశాడు. అది అమ్మచూచి ఒకటే గొడవ. చెప్పేది వినిపించుకోదు. ఒకటే యేడుపు; ఉపవాసాలూను. అగ్నిహోత్రంలాంటి పవిత్రమైన మీ నాన్నగారి పేరుకు కళంకం తెస్తున్నానా అని యేడ్చింది. చివరికి ఆ వుత్తర్రం వీడు రాసిందేనని నమ్మించేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. ఫలితంగా వెంటనే విజయతో పెళ్లి అయిపోయింది. పెళ్ళయిన తర్వాత జయపాల్‌ని అభినందిస్తూ వుత్తరం వ్రాశాను. సరిగ్గా ఆ సమయంలోనే వాడి భార్య మణికి పెద్ద జబ్బు చెయ్యటం మూలాన పెళ్ళికి రాలేకపోయాడు. నిజంగా యీ వుత్తరం చూస్తే యెంతటి వాళ్లకైనా అనుమానమేస్తుంది. ఇంతకీ విజయ యీ వుత్తరంచూసి యేమనుకుందో? ఈ ఆలోచన వచ్చేసరికి నాలో ఉన్న ఆనందమంతా గాలిలో దూది పింజ లాగ ఒక్కసారి యెగిరి చక్కాపోయింది. నా నవ్వు మీటనొక్కినట్లు ఆగిపోయింది. ఇలాటి వాటిల్లో ఒక దెబ్బతిని వున్నాను. చిన్నప్పటినుంచి తన చేతుల మీద పెంచి నా స్వభావాన్ని అర్థం చేసుకున్న అమ్మే పొరపాటుపడింది. కొంపదీసి విజయగూడా అలాటి అనుమానం పొందలేదు గదా! యేమో ఖర్మ. విజయ వెళ్లిపోవటానికి కారణం ఇదేఅయితే చచ్చానన్నమాటే. ఇది అబద్ధమని నిరూపించుకునేందుకు నా వద్ద



# అర్ధాంగి అలుక



మరో నిదర్శనంగూడా లేదు యిప్పుడు. నామనసు కొంచంగా చెదిరింది. ఆవేశంలో విజయ వుచితానుచితాలు తెలుసుకోదు. ముక్కుకు సూటిగాపోయి యేదితోస్తే అది చేసెయ్యటమే. అనుకోకుండా పెండ్లినాడు మామగారు చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి. "నాయినా! భగవంతుడు జయలో ఆవేశం ఒక వీసంపాలు యెక్కువగా కలిపాడు. దానికి చాలా ఒడిదుకుల స్వభావం. కోపం వచ్చిందంటే తను వెళ్ళే మార్గంలో యేముందో గూడా చూచుకోదు. దాన్ని అర్థం జేసుకోగలిగి దాని నడతను విపులంగా చూచినటయితే నిన్ను మించిన అదృష్టవంతుడు ప్రపంచంలో మరోడు వుండడు. జాగ్రత్త నాయినా. జ్ఞాపకముంచుకో!" బాగా రాత్రి అయింది. ఇప్పుడెప్పుడు వస్తుంది? యెప్పుడు వంటచేసి నాకు భోజనం పెట్టుంది? అనుకుంటూ చేతినున్న వాచీ తీసి డ్రాయరుమీద పెట్టటానికి లేచి డ్రాయరుకు దగ్గరగా వెళ్ళాను. మామూలుగా నా వాచీ పెట్టేచోటులో విజయ నోట్ బుక్‌లోని బ్లాటింగ్‌పేపరు యెత్తు పెట్టబడి వుంది. మనసు అపశకునాన్ని శంకిస్తుండగా చేత్తో కాగితం తీసుకుని చూచాను. నా కళ్ళు నేనే నమ్మలేకపోయాను. లైటు ముందుకొచ్చి వెడల్పయిన కళ్ళతో వుత్తరం మరో సారి చదువుకున్నాను. అందులో సంబోధనా గింబోధనా ఏమీ లేదు. వ్రాతగూడా యేమంత బాగా లేదు. ఇలా వుంది.

"అదృష్టవశాత్తు వుత్తరం నేనేముందు చూడటం తటస్థించింది. మీరు నన్ను చూచి నప్పుడు ఆరోజున నాన్నగారితో విజయ అన్న పేరు నన్ను బాగా ఆకర్షించింది అని యెందుకు చెప్పారో యిప్పుడు బాగా అర్థమావుతోంది. పాపం! అమాయకురాలు జయ మీకింకా పెళ్ళికాలేదని అనుకుంటోందిగాబోలు. తన ప్రాణసమానంగా ప్రేమించి తను యెదురుచూస్తున్న వ్యక్తి మరోవ్యక్తిని వివాహమాడి సర్వసుఖాలు అనుభవిస్తున్నాడంటే యేఆడపిల్ల హృదయం దహించుకుపోదూ? ఒకరోజున ఆ పిచ్చి పిల్లతో గూడా జయఅన్న పేరు నన్ను బాగా ముగ్ధుర్ని చేసిందని చెప్పే వుంటారు. అందులో సందేహం లేదు. భగవంతుడు ఆడవాళ్ళకెన్ని తెలివితేటలిచ్చినా సులభంగా మగవాళ్ళ వలలో పడేటట్లు శాపం పెట్టాడుగాబోలు. నేను చదువుకున్నదాన్ని. నన్ను నేను జీవితాంతం పోషించుకోగల సమర్థత నాలోవుంది. ఆసమర్థత లేని జయ మీ దయాధర్మంకోసం పాకులాడుతోంది. అందువలనే నేను మిమ్మల్ని ఆ నిర్భాగ్యురాలికి వదిలేసి వెళ్ళిపోతున్నాను. మీరు యింకనైనా బుద్ధితెచ్చుకుని ఈరాత్రి రైలుకువెళ్ళిపోయి ఆ అమ్మాయిని క్షమార్పణకోరుకోండి. నిజంగా ఈ వుత్తరం నా చేతిలో పడటం ఆమెకు క్షేమకరమే అయింది. లేకపోతే నాకు తెలియకుండానే నేను ఒక అమాయకపు జీవికి తీరని అన్యాయం చేస్తూ వుండేదాన్నేమో! పాపం! ఎక్కువ చదువు గూడా చదువుకోలేదుట. మీరు తప్ప ప్రపంచంలో మరో ఆధారం వుండివుండదు. మీరు వెళ్ళలేకపోతే తన నిండుప్రాణాల్ని...... తర్వాత యేం జరుగుతుందో నేను వ్రాయలేను. మీరు ఊహించలేనంతటి మూర్ఖులు కారు. అది తలచుకుంటే నా కలం కంపిస్తోంది. చెయ్యి ముందుకు సాగటం లేదు. ఇంతకంటే వ్రాయలేను. మరో విషయంలో అయితే మీకోసం ఎంతో ఏడ్చేదాన్ని. దాన్నుండి రక్షించుకుని మిమ్మల్ని నా గుండెలు చీల్చుకుని అందులో భద్రముగా యెవరూ చూడకుండా దాచేసుకునేదాన్ని. కాని ఈ విషయంలో అలా చెయ్యలేను. పట్టపగలు పదిమందిని ఖూనీచేసి వచ్చినా మిమ్మల్ని క్షమించగలిగేదాన్ని. ఈ విషయంలో చెయ్యలేను. తను మనసారా ప్రేమించి తన సర్వస్వం అని నమ్మకున్న మగవాడు వుత్త మోసగాడయితే స్త్రీ ఎంత బాధ పడుతుందో నా యీ యిప్పటిబాధ తెలుస్తోంది. అందుకనే నేను జయ వుత్తరం చూడగానే జయమీద మండి పడలేకపోయాను. ఆమెబాధ నర్థంచేసుకునే నేను వెళ్ళిపోతున్నాను. మీరింక నా ఛాయలు చూడటానికిగూడా ప్రయత్నించవద్దు. ఇది నాఆజ్ఞ. నా మీద యే కొంత మమకారంవున్నా ఇది పాలించండి. ఒక గోముఖ వ్యాఘ్రానికి నా జీవితం అర్పించుకున్నానన్న బాధ తప్ప ప్రస్తుతం నాలో యేమీ లేదు. మీరు వెంటనే వెళ్ళండి. ఆలస్యం చేసి మరో ప్రాణిలోవున్న విశ్వాసం పోగొట్టుకోకండి. నాయీ అవస్థ ప్రపంచంలో మరే యువతికి కల్లోగూడా కల్గించవద్దనిభగవంతుని ప్రార్థిస్తూ ముగిస్తున్నాను.

ఇట్లు,
విజయ.

మరో సమయంలో అయినట్లయితే ఆ వ్రాతకి మనసారా విరగబడి నవ్వుకునేవాడిని, కాని ఇప్పుడలా నవ్వలేకపోగా నరాలు పిండుతున్నట్లుగా విపరీతమైన బాధతో ఒక చిన్న మూలుగు నా హృదయాన్ని చీల్చుకుంటూ బయటకు వచ్చింది.

విజయ కోపగించుకుని వాళ్ళక్క గారింటికి వెళ్ళిపోయిందనటంలో యేమాత్రం సందేహం లేదు. ఈ వేళ లేచి యెవరి మొహం చూశానురా భగవంతుడా అనుకున్నాను. ఇంక యిప్పుడు అక్కడికి వెళ్లి చేసేది గూడా లేదు. తెల్లవారితే విజయలోవున్న వుద్రేకం గూడా తగ్గుతుంది. అప్పుడు అసలు విషయాన్ని విశదంగా చెప్పవచ్చు అనుకుని వూరుకున్నా. లేచి వుత్తరం డ్రాయరుమీద పడేసి వెనక్కు తిరిగా. ఒక్కసారి సన్నజాజుల పరిమళం గుప్పుమని గదంతా చుట్టేసింది. విజయ వచ్చిందా అనిపించింది. నా పిచ్చిగాని విజయ యెందుకు వస్తుంది.? డ్రాయరుమీద పొట్లాంలో వున్న పూలు విచ్చి తమ సౌరభాన్ని దాచుకోలేక గదంతా విరజిమ్ముతున్నాయి. క్షణంసేపు వాటివంక చూచాను. అవి తన్ను వెక్కిరిస్తున్నట్లుగా కన్పించింది. మరుక్షణంలో పొట్లం ఆవిధంగానే రెండు చేతులతోనూ నలిపేసి వీధిలోకి గిరాటుకొట్టి గబగబా తలుపులువేసి హోటల్ వైపు నడక సాగించాను.

మర్నాడు వుదయం మా వదినగారింటికి వెళ్ళాను. బయట ఎనిమిదేళ్ళ రఘు ఆడుకుంటూ కన్పించాడు. నన్ను చూడగానే 'బాబాయ్' అంటూ పరుగెత్తుకొచ్చాడు. ఎత్తుకుని ముద్దుపెట్టుకుంటూ "పిన్ని వచ్చిందా?" అన్నాను. వాడు వచ్చిందని తలూగిస్తూ "బాబాయ్! మరె నా పిల్లిపిల్లని రోజాకుక్క చంపేసింది." అన్నాడు యెంతో దుఃఖపడ్తూ. వాడిని ఓదారుస్తూ మెట్లెక్కి లోపలకువచ్చి హాలులో కూర్చున్నాను. లోపలనుంచి విజయకంఠం విన్పిస్తుందేమోనని ఆశించాను. కాని నాకు ఆశాభంగమైంది. కాసేపు రఘుతో ఖబుర్లుచెప్పి వాడిని "లోపలకువెళ్ళి మీ పిన్నిని ఒకసారి పిల్చుకురా" అన్నాను.

"నువ్వు వచ్చావని చెప్పనా?"

వద్దన్నట్లు సూచించాను. వాడు తూనీగలాగ లోపలకు తుర్రుమన్నాడు. రాబోయే విజయకు ఎలా శాంతిస్వరంతో నచ్చచెప్పాలో ఆలోచించుకుంటున్నాను. ఇంతలో రఘు విజయ చెయి పుచ్చుకుని లాక్కొచ్చి తప్పట్లు కొడూ నవ్వాడు. మొదట నేననుకోలేదు గాబోలు విజయ క్షణంసేపు తెల్లబోయి వెంటనే వంగి రఘు వీపుమీద ఒక్కటి చరిచింది. దెబ్బచురుకుగా తగలటంవల్ల వాడు బిక్కమొహం వేసి నావైపు చూస్తూ ఏడుపు సాగించాడు.

"పొరపాటు పడ్డావని చెప్పటానికి వచ్చాను" లేచివచ్చి రఘును ఎత్తుకుని సముదాయిస్తూ అన్నాను. విజయ కళ్లు నిప్పులు కక్కుతున్నాయి.

"నేనేం పొరపాటు పడలేదు. నాకంతా



మాణిక్యాంబ సమేత భీమేశ్వరస్వామి[ద్రాక్షారామ]

—ఫొటో: వి.ఆర్. శ్రీపతి.

బాగా తెలుసు. మీ నాటకం ఇంకా ఆడదామని చూడకండి" నా చేతుల్లోంచి రఘుని ఒక్కగుంజుతో లాక్కుంది.

"విజయా!"

నామాట విన్పించుకోకుండానే రఘు వీపుమీద మరోటి అంటిస్తూ "వెధవా! ఇప్పటినుంచి అబద్దాలాడటం నేర్చుకుంటే గాని రేపు పెద్దపెద్దవాళ్ళ గొంతులు కొయ్యలేవు." అంటూ లోపలకు వెళ్లిపోయింది.

"విజయా!" ఆవేశంలో బిగ్గరగా అన్నాను. ఎవరినుద్దేశించి ఆవిధంగా వ్యంగ్యంగా మాట్లాడిందో అర్థంచేసుకున్న నేను ఇంక అక్కడ నిలబడలేక వెనక్కు తిరిగి వచ్చేశాను. ఆదివారం కావటం ఈరోజు ఆఫీసు కూడ లేదు.

ఇంటికొచ్చి మౌనంగా కుర్చీలో కూర్చుని జరిగినదంతా ఒక్కసారి విమర్శించుకున్నాను. ఇందులో నేను చేసిందేముంది? నాపాత్ర నిమిత్తమాత్రంగా నిలబడింది. ఆసమయంలో జయపాల్ కన్పిస్తేనా ఏం చేసేవాడినో అనిపించింది. ఇల్లంతా బావురుమంటోంది. ఎక్కడి వస్తువులు అక్కడ లేక చిందరవందరగా పడివున్నాయి. రాత్రి కోపంతో నలిపి పారేసిన పూలు ఒకటి రెండు వాడిపోయి ఎండిపోయి క్రిందపడి వున్నాయి. డ్రాయరు ముందు కుర్చీలో కూర్చుని జయపాల్‌కి ఈ విధంగా వుత్తరం వ్రాయటం మొదలు పెట్టాను:

జయపాల్,

హాస్యపూరితంగా నువ్వు వ్రాసిన వుత్తరం అందింది. కాని అది మొదట నాకు అందలేదు. ఎవరికందాలో వారికే అందింది. ఆవిధంగా అందటంవల్ల కలిగిన ఫలితం వింటే నువ్వు బహుశా నిద్రాహారాలు గూడా మర్చిపోతావు. ఒకనాడు నీమూలంగానే-అంటే నీ వుత్తరం మూలంగా-నేను విజయను పెళ్ళాడటం జరిగింది. ఆనాడు నేను అమ్మదగ్గర వుండగా నువ్వావిధంగా ప్రేమలేఖ వ్రాయకపోయినట్లయితే నేను విజయను వివాహమాడటం సంభవించేదిగాదు. కాని మళ్లా నీ వుత్తరం మూలంగానే విజయ నానుండి దూరమైపోవటం వింతగా లేదూ! ఎరుగని వాళ్ళు నీ వుత్తరం చూస్తే ఏ ఫలితాలు కలుగుతాయో అవే కలిగాయి! విజయకు నువ్వు తెలియవు. నన్ను పార్థంచేసుకుని కోపగించి నామీద అలుకతో వాళ్లక్క గారింటికి వెళ్ళిపోయింది ఇప్పట్లో విజయదగ్గరకు నేనువెళ్ళినా ప్రయోజనం లేదు. జయపాల్! నామీద విజయకెంత అసహ్యం పుట్టిందంటే చివరికి నా మొహం చూడటానికి గూడా యేవగించుకుంటోంది. ఆమెయిహ నా దగ్గరగా రావటం దుర్లభమనే తలుస్తున్నాను. ఎందుకంటావా విజయ నన్ను దోషిగా నిర్ణయించుకుని వెళ్ళిపోయింది. నేను నిర్దోషినని నిరూపించుకునే ఆధారాలు నా దగర లేవు. తమాషాగా వ్రాసిన వుత్తరం ఇంత దారుణఫలితాల నిస్తుందని నువ్వనుకుని వుండవుగదూ! కాని యేం చేదాం. ప్రతిది



# అర్ధాంగి అలుక



మన మంచికోరకే అనుకుని వూరుకున్నా.

ఇట్లు, యేం చెయ్యాలో తోచని,
నీ, రాజు.

ఆరోజంతా అటూ యిటూ కాలు కాలిన పిల్లిలాగ తిరుగుతూ గడిపాను. ఆ రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు. ఇంత చిన్న విషయానికే విజయ నన్ను అనుమానించిందంటే నన్నసలు అర్థం చేసుకోలేదన్న మాట. నాయెదుట నిలబడి వుత్తరంలోని మాటలు నా మొహం మీద అంటే యెంతో సంతోషించేవాడిని. వాళ్ళక్కతో యేమని చెప్పిందో. భార్యాభర్తల మధ్య యేవైనా మనస్పర్థలు కలిగినా యిద్దరూ ముఖాముఖిని తేల్చుకోవాలిగాని యీ విధంగా చేస్తే కలిగే ప్రయోజనమేమిటి? పైగా అందరూ చూసి నవ్వడం తప్ప. ఇందులో నా తప్పేం లేదు. మొదట విజయే దూరంగా వెళ్ళిపోయింది కాబట్టి యే నాటికైనా తనంతటతనే తిరిగి క్షమించమని నా దగ్గరకు రావాలి. ఒక నిశ్చయానికి వచ్చిన తర్వాత నా మనసు తేలికపడింది. యే పొరపాటు చెయ్యని నేను వెళ్ళి క్షమించమని అడగవలసిన అవసరం నాకేమాత్రం లేదనిపించింది.

ప్రళయకాలంలో ముప్పటగా మూడు రోజులు గడిచిపోయాయి. నాలుగోరోజున సూర్యోదయమైంది. ఈ రెండు మూడు రోజుల్లో నేను విజయను చూడటం గాని కనీసం ఆమెను గురించి వినటానికి గాని ప్రయత్నం చెయ్యలేదు.

పదిగంటలు దాటింది. ఆఫీసుకు వెళ్ళే ప్రయత్నంలో వున్నాను. ఇంటి ముందు జట్కా ఆగింది. ఒకసారి నా గుండెలు సంతోషంతో వువ్వెత్తున లేచాయి. బండిలోంచి దిగబోతున్న విజయను నేను గమనించనట్లుగా వుండాలని వీపు వీధివైపు పెట్టి నిలబడ్డాను.

"రాజా!" ఆశించిన ఆశలు ఒక్కసారి కూలిపోగా వులిక్కిపడి వెనక్కి తిరిగి చూచాను. యెదురుగుండా గుమ్మంలో జయపాల్, అతని భార్యామణి నిలబడి వున్నారు. క్షణంసేపు నేను, జయపాల్ ఒకరి కళ్ళలోకి ఒకళ్ళం చూచుకున్నాం. అక్కడ మణి వున్న సంగతి కూడా మర్చిపోయి ఇద్దరం ఒకళ్ళనొకళ్ళు గట్టిగా కౌగిలించుకున్నాము.

"నేను తమాషాకోసం చేసినపని యింత దారుణ ఫలితం కలగచేస్తుందనుకోలేదురా రాజా" అన్నాడు గద్గదిక కంఠంతో. మూడురోజుల క్రితం గనక జయపాల్ నాకు కనిపిస్తే యేం చేసేవాడినో నాకే తెలియదు. కాని యిప్పుడా సమయం దాటిపోయింది.

"రండి లోపలికి" అన్నా గుమ్మంలో నిలబడిన మణిని చూస్తూ.

"అసలు జరిగినదేమిటో సరిగా విశదంగా చెప్పు" అన్నాడు జయపాల్ లోపలకు వచ్చికూర్చుంటూ. నేను జరిగినదంతా విపులీకరించాను.

"నేను వుత్తరం రెండోవైపున గ్రీన్ ఇంక్‌తో వ్రాశాను చూడలేదూ?" అన్నాడు జయపాల్ అంతా విన్న తర్వాత.

"ఉహూ యేమని వ్రాశావు?" అన్నాను ఆశ్చర్యంగా,

"నేను వ్రాసిన పేపరు ఆకుపచ్చగా వుంది గదా. దానికి వెనకవైపున క్రిందుగా వుత్తరం చదివిన తర్వాత కలిగిన అనుభవం వ్రాయి అని పూర్తి సంతకం చేశాను." అన్నాడు.

"నేను చూడలేదు. విజయగూడ చూసి వుండదు." అన్నాను.

"సరేమరి యీ గ్రంథమంతా ఎందుకు జరుగుతుంది, నీ వుత్తరం అందింది. మొదట నువ్వుకూడా తమాషాగా వ్రాశావేమో అనుకున్నాను. కాని వివరంగా చూస్తే అందులో తమాషా వున్నట్లు కల్పించలేదు. వుత్తరం చూచినప్పటి నుంచి మణి నన్ను ఒకటే సాధింపు, ఇక వెంటనే బయలుదేరి వచ్చాం. మా పినతండ్రికూతురు నీరజ యిక్కడేవుంది. అక్కడే దిగాము. సరాసరి యిక్కడికొద్దామంటే పరిస్థితులు తెలియవు గదా!"

(౬౫-వ పేజీ చూడండి)

# పెళ్లి ప్రయాణం

ఇక్కడేం చేస్తున్నావు జయం, ఎల్లుండి ప్రయాణం పెట్టుకొని తీరుబాటుగా ఏమిటా బాతాఖానీ"—పెళ్లి పనులతో సతమతమవుతూ మధ్యనొక్కసారి ఇంట్లో అందర్నీ జాడిస్తూ ఉంది తల్లి. అమ్మ సణుగుడు అలవాటుగానూ, చీవాట్లు పరిపాటిగానూ భావించి జయం ఇంకా బాతాఖానీ మానలేదు.

లక్ష్మితో మాట్లాడుతూ కూర్చుంటే గంటలూ రోజులూ సంవత్సరాలూ, నిమిషాల్లా గడిపేయవచ్చు. ఆ అభ్యాసన్నపు అడివిలో లక్ష్మి లేకపోతే తనకేంతోస్తుంది. జయం ఆపూరువచ్చిన దగ్గర్నుంచీ ఇద్దరికీ బాగా నేవుంది.

ఆ ఊళ్ళో రైతులూ కార్మికులూ కాక బుగతలకుటుంబాలు అయిదారు కొంపలున్నాయి. తాతలనాటినుంచీ-వేరైపోయినా వారంతా అన్నదమ్ములే. ఒకసోదరుడు ఉద్యోగంమీద దేశమంతా తిరిగితిరిగి మళ్లా స్వగ్రామం చేరుకున్నాడు. అంతకుముందుకూడా ఏడాదికొకసారైనా కుటుంబంతో వచ్చేవాడాయన. ఆయన కుమార్తె జయం. ఊళ్లోనే పుట్టుపడిన మరొక సోదరుడి కుమార్తె లక్ష్మి.

## కన్నసామి

ఆ యిద్దరి స్నేహం ఇదివరకు ఏడాదికొకసారి చిగురిస్తూ ఉండేది. జయం తండ్రిగారు గ్రామంలో స్థిరనివాసం ఏర్పరచుకోవడంతో స్నేహంకూడా స్థిరమైంది. ఒకరిని ఒకరు ఒకగంటయినా విడిచిఉండలేరు.

ప్రస్తుతం ఎడబాయని ఎలప్రాయపు ఆ జంటకు ఒక తక్షణ సమస్య చర్చనీయమై కూర్చుంది. ఆ సమస్యను పరిష్కరించకపోతే వారంరోజులు ఎడబాటు తప్పదు. దుర్భరం!

జయం అన్నయ్యకు ఒక దూరపు సంబంధం చేస్తున్నారు. ఎల్లుండి అంతా తరలి వెళ్తున్నారు. ఊళ్లో ఒకొక్క అన్నదమ్ముడి ఇంట్లో ఇద్దరేసి మెంబర్లయినా కదలి రావాలని తీర్మానించబడింది. ఈ సందర్భంలో లక్ష్మిని ఎలాగైనా ఆ దూరదేశం తీసుకువెళ్ళడానికి జయం నిశ్చయించుకొంది. పెళ్లిపెద్దలలో ఒకడుగా లక్ష్మి అన్నయ్య వస్తాడు. అయితే ఈ గాథకి ఆనకట్టఅయి కూర్చున్నారు తండ్రిగారు. ఆయన స్వయంగా ఎలాగా ఎక్కడికీ కదలరు. లక్ష్మిని తీసుకువెళ్తామని జయం చెబితే ఆయన ససేమిరా వల్లకాదన్నారు: జయం వాళ్ళ



శివుడు: పార్వతి —ఫొటో: కమ్రుద్దీన్ ఖాన్]



# పెళ్లి ప్రయాణం



నాన్నగారితో ప్రత్యేకంగా చెప్పమని చెప్పింది. ఆయనకూడా ప్రతం చెడ్డారు కాని ఫలందక్క లేదు. చెప్పవలసిన తక్కిన వాళ్ళుకూడా సందర్భంవచ్చినప్పుడు నొక్కి వక్కాణిస్తూనే వున్నారు. ఆ ముసలాయన పట్టు విడువలేదు. "ఈడొచ్చిన పిల్లని ఎక్కడికి పంపుతామయ్యా" ఇదేవరస!

పెళ్లివారు ఒక్కొక్కరే బండి ఎక్కుతున్నారు. జయం ముఖం ముడుచుకుని కూర్చుంది. దిగులుగా వెనక్కు చూస్తూనే బండి ఎక్కింది. కిలకిలా నవ్వుకుంటూ తనూ లక్ష్మి ప్రయాణమౌతామని మొదట ఎంతగానో మురిసిపోయింది. ఆ అయిదు మైళ్ళ రెండుగంటల కుదుపు ప్రయాణాన్ని రెండు నిమిషాల్లా గడపగలమని మురిసిపోయింది.

కిటికీలోంచి అందరి ప్రయాణాన్ని చూచి లక్ష్మికి దుఃఖం పొంగివచ్చి ఇంట్లోకి వెళ్లిపోయింది. అన్నయ్యకి-లక్ష్మికి జయానికీ ఉండే అవినాభావమైన స్నేహం తెలుసు. కాని...పెళ్ళివారు ఊరు విడిచి పొలిమేర దాటేవఱకూ ముసలాయన పట్టు విడువలేదు. అలాగే ఆ పట్టు పెళ్ళివారు పొలిమేర దాటిపోయినా లక్ష్మి విడువలేదు.

"లక్ష్మి మాత్రం ఏమంత అసందర్భమైన కోరిక కోరింది నాన్నా? మేమిందరం అన్నలం, అక్కచెల్లెళ్లూ ఉండగా మీ కెందుకొ బెంగ?"—అన్నయ్య ఈ మాత్రం మాట సహాయం చేస్తాడనుకోలేదు. ముసలాయన సమాధానం కూడా లేదు. అన్నయ్యాకేదో ఆలోచన తట్టినట్టు ఉంది. తండ్రికి [illegible] దనగా చెవిలో మెల్లగా చెప్పాడు.

లక్ష్మి చూస్తుండగానే నాన్నగారు ఇట్టే మారిపోయారు. "సరే! అయితే తీసుకు వెళ్లు" అన్నారు. లక్ష్మి మొదట కొంచం ఆశ్చర్యపడిపోయి, అన్నయ్యలో ఏమీ ఆశ్చర్యం కనిపించనందుకు తరవాత మరికొంచెం ఆశ్చర్యపడి పోయింది. అప్పుడేమీ ప్రశ్నలు వెయ్యకుండా బుద్ధిగా బయలుదేరింది. "వాళ్ళు ముందు వెళ్ళిపోయారు కదూ?" అని మాత్రం అన్నది. "ఏముందమ్మా! వాళ్ళు ఈ నాటుబళ్ళమీద స్టేషనుకి చేరేటప్పటికి మనమే ముందుంటాం" అన్నాడన్నయ్య.

* * *

"జయం మనదేనే జయం!" అన్నది రైలెక్కుతూనే లక్ష్మి. లక్ష్మిని కౌగలించుకొని జయం ప్రశ్నలవర్షం కురిపించింది. 'అసలు నాన్నగారెలా ఒప్పుకున్నారు'-ముఖ్యమైన ప్రశ్న. జరిగినదంతా చెప్పింది లక్ష్మి. అన్నయ్య ఎంతచెప్పినా ఒప్పుకోలేదు. చివరికి..' అంతవఱకూ చెప్పాక అన్నయ్య వైపు తిరిగి నాన్న చెవిలో ఏమిటి చెప్పావు అన్నయ్యా అంటూ మళ్ళీ జయంతో "ఆ ఒక్క మాటతో నాన్న సరేమని ఒప్పుకున్నాడు జయం" అన్నది. జయంకూడా వినాలని ఆతృత చూపించింది. అన్నయ్య "ఎందుకులే చెప్పడం" అన్నాడు.

ఇద్దరూ చెప్పమని వేధించడం ఆరంభించారు అన్నయ్య జయాన్ని చూస్తూ "నువ్వెందుకు బయలుదేరావు జయం" అన్నాడు. "అదేంటన్నయ్యా! నా స్వంత అన్నయ్య పెళ్ళికి వస్తున్నాను." అన్నది జయం. అన్నయ్య నవ్వుతూ జయం మొహంలోకి పరీక్షగా చూసి "అది తెలుసులే! పట్టి అంతేనా...అని" అన్నాడు. జయం బుగ్గలు ఎఱ్ఱపడ్డాయి. లక్ష్మికి అర్థమై "ఓహో" అంది.

"నీ రిజర్వుడు బావని-ఎన్నాళ్ళయిందో ఓసారి చూదామని! అలాటి పనే మన లక్ష్మిదిని" జయం ఏమిటి అన్నట్టు తల ఎత్తింది. లక్ష్మి ఏమిటో అన్నట్టు బెదురుతూ చూసింది.

"ఈ ప్రయాణ సందర్భంగానే ఈమధ్యను అనుకున్న ఒక సంబంధాన్ని సెటిల్ చేదామని, పిల్లను చూడడమే తరువాయి. అన్నీ ఇంతకుముందే అనుకున్నాం. ఆ మాటే, లక్ష్మీ! నాన్నతో అన్నాను" అన్నాడు అన్నయ్య.

జయం, లక్ష్మి ముఖాలు చూసుకొని ఫక్కున నవ్వుకున్నారు.

"ఇద్దరం ఒక్కటే" అన్నది జయం. ★



"దుర్గ పూజ"

—చిత్రం: శ్యామసుందరీ దేవి.



# జయ విజయీభ



శ్రీరస్తు విజయోస్తు దిగ్విజయ మస్తు
ధనకనక వస్తువాహనసిద్ధిరస్తు
ఆశ్వయుజశుద్ధ మహర్నవమినాడు
శాశ్వతాశీర్వాద సత్యవాక్యములు
బాలురదీవనలు బ్రహ్మదీవనలు
బాగుగా మీ కిపుడు బ్రహ్మాయురస్తు
జయాభి జయభవ దిగ్విజయభవ!

అంటూ ఆశ్వయుజ శుద్ధ విదియ (నెల పొడుపు)నుండి విజయదశమివరకు బడి పంతుళ్ళవెంట విల్లంబులు పట్టుకు కొత్త బట్టలతో ముస్తాబై వానరసేనలా ఇంటింటిపై దండువెడలి, పెద్దల నాశీర్వదించే బాల బ్రహ్మలసరదాలను జూచి ముసలివారు మురిసి పోవడం దసరాపండుగ ప్రత్యేకత. దసరాను 'దశరా(త్)' (అంటే పది రాత్రులు) అంటారు. దేవి అసురునితో పోరిన తొమ్మిది రాత్రులను, విజయం పొందిన పదవ రోజును కూడా ఈ పేరు స్మరింపజేస్తుంది. దసరాను 'దశహారా' లేక 'దశపాపహరా' అనిగూడా అంటారు. పది పాపాలను పరిహరించి తరింప చేసేదిపండుగ.

దీనిని 'విజయదశమి' అనిగూడా అంటారు. శత్రుసంహారార్థమై విజయయాత్రలు చేసిన వీరాధివీరులనుండి స్ఫూర్తిని గ్రహించే పర్వం విజయదశమి. అసత్ పై సత్ గావించిన విజయాని కీపండుగ ప్రతీకం.

మంచికి చెడుమీద లభించిన విజయాన్ని స్మరించడం ద్వారా ప్రజాజీవితంలో నూతనోత్సాహాన్ని, నవశక్తినీ రేకెత్తించడం దసరా ధ్యేయం. సురలు నిత్యతృప్తులు; అసురులు నిత్య అసంతృప్తులు గనుక, పరపీడన పరాయణత్వం వారి చరిత్ర సారాంశం. మానవప్రవృత్తిలోగూడా ఈ దేవదానవ ప్రకృతులు కనబడతాయి. ఈ దుష్టదానవ శక్తులపై విజయం సాధించినట్లే, లేదా విజయయాత్రకు బయలుదేరినట్లే రోజులు ఈ పర్వంతో పెనవేసుకునుంటాయి.

ఈ పండుగలో దేవీపూజ, ఆయుధపూజ, సీమోల్లంఘనం పారువేట, జమ్మికొట్టులు అనే ఐదు ముఖ్య సాంప్రదాయకాచారాలున్నాయి.

## ఆయుధపూజ

దేవీపూజ విషయం అటుంచి ఆయుధపూజ విషయం మాట్లాడితే యిది ఈ నాటికీ పలు రూపాల్లో ఆచరింపబడటం చూస్తాం. దశమి నాడు కొందరు, ఆశ్వయుజ శుద్ధ అష్టమి ([illegible] నాటినుండి ఆయుధాలను తీసి, పూజించి, ఉత్తరగోగ్రహణసందర్భంలో విజయయాత్ర కుపక్రమించినవిధం) నాడు కొందరు తిరిగి వృత్తి పనిముట్లను శుభ్రపరచి పసుపు, కుంకుమ, గంధం మొదలగువాటితో

అలంకరించి ధూపదీప
స్తారు. పూర్వంరాజ
లకు ఆయుధపూజ
లకు ఉరుకులెత్తే
చిన ఆయుధపూజ
మాన జరిగేసంబరం

శ్రీ
ధం సింహాసనమై న
తిద్దైవతల
సిరి భార్యామణివై
శ్రీ గంగ సత
పరమాత్మాయమ
బ్రహ్మ
పదాన నీ ఘనరా
నిజమై వర్ధిల్ల

అంటూ బమ్మెరపోత
యాంతికంలోని పద్యా
ముందు కొందరు చెబు
"జయా," "జయ" నినా
ల్లో తమకు నేర్ప
పంతులుదిరి నడిపింద
నన్నా; బాలబాలికలు
పరంపరాలకు చిహ్నంగా





# వ! దిగ్విజయీభవ!!

నైవేద్యాలతో పూజ
లు యుద్ధోపకరణా
నరించి విజయయాత్ర
. ఇప్పటికీ "క్షీణిం
పేరుతో గ్రామగ్రా
ంతా అంతా కాదు.

## ...జ"

ధంబు గోడుగై
ప్రత్యులై
విరించి కొడుకై
ప్రతియై
వందిగణమై
కారమై
సంబు
నారాయణా॥

జా వ్రాసిన నారా
న్ని పేరుపులతో
ఉండగా మిగతావారు
దాలు చేస్తూ, పాతకా
డిన క్రమశిక్షణను
రాగూడా వ్యక్తం
పూర్వకాలపు యుద్ధో
విల్లంబులు ధరించి

బుక్కాయిపువ్వులు సంచుల్లో నింపుకుని, రావణసంహారంలో శ్రీరామునికి తోడ్పడ్డ కపిసైన్యానికి చిహ్నంగా కోతిబొమ్మలుగల గిలకలను పట్టుకుని "జయాభిజయభవ", "దిగ్విజయభవ" అంటూ వీరోల్లాసంతో వీధులంట ఊరేగడాన్నే "క్షీణించిన ఆయుధపూజ" అంటారు. వాడవాడనా, ఇంటింటనూ తమ విజ్ఞానాన్ని ప్రదర్శించి, వినోదాన్ని కల్గించి, ఘూరివిరాళాలు వసూలుచేసి జీతం బత్తెం లేకుండా విద్యాదానం చేస్తున్న తమ గురువుగారికి "గురుదేవోభవ" అంటూ గురుదక్షిణ సమర్పిస్తారు.

అయ్యవారికి చాలు ఐదువరహాలు
చిన్నవారికి చాలు సిరిసెనగపప్పు
పిల్లవాండ్రకు చాలు పప్పుబెల్లాలు
జయాభిజయీభవ దిగ్విజయీభవ.

అంటూ హోరూరా బయలుదేరే ఈ బాల బాలికలదండు:

చెలువైన జవకళ్లు చంద్రహారాలు
మురిడీలు గొలుసులు ముద్దుటుంగరాలు
పచ్చలపోగులు హొచ్చుతాళీలు
బొమ్మంచుపంచెలు బొంగరాలసాగ.
జలతారు వోణీలు జాలరుమాళ్ళు
అంగీలు నడికట్లు అమరగానగలు
తొడిగిన ముత్యాలతోడి గిలకలను

అంటూ తమ ముత్యాలను గిలకలను వర్ణిం చుకుంటూ (ఈ వర్ణన మన పూర్వుల వస్త్రధారణ యెలా వుండేదో తెల్పుతుంది) వచ్చి తమ బ్రహ్మ దీవనలు కురిపిస్తారు.

వలజయంతులవంటి నందనుల కల్గి
తెలిసి చక్కని చాల కూతుళ్ళను కల్గి
అలమన్మథులవంటి యల్లుండ్ల కల్గి
బలవంతులైనట్టి బంధువుల కల్గి
పుడమిలో వెనలేని భోగముల్ కల్గి
పొందుగా నవరత్న భూషలు కల్గి
ధన ధాన్యములు కల్గి ధర్మములుచేసి
పుడమివర్ధిల్లుడీ పూజ్యులై యెపుడు
జయాభిజయభవ దిగ్విజయభవ

అని ఆశీర్వదించే ఈ బాల బ్రహ్మల ఆశీర్వాదాలను పొందడానికి ప్రతివారూ తహతహపడతారు. ఏయింటనైనా అనవసరంగా ఆలస్యం జరిగితే.

కటకటా మీకెంత కరుణ లేదయ్య
ఇటువచ్చి యడుగ మాకిది పద్ధతయ్య
ఇంతసేపుంచుట యిది మీకు తగునా!
ఉత్తమా జనులార చిత్తగించండి
ఆలస్యముందకం గాకలపుతుంది
అక్కచేత మీ వాకిళ్ళలోను
ఉంచుట మీకది మంచిపని గాదు
శీఘ్రమే పంపుడీ శ్రీమంతులార
జయాభిజయభవ దిగ్విజయభవ

అంటూ ప్రాధేయపు పదాలద్వారానే మృదువుగా మందలిస్తారు! కాన్తా కూన్తా విదిలించి విసిరి వదిలించుకుందామని చూసే





వారికి.

పావలా బేడైతే పట్టేది లేదు
అర్ధరూపాయిస్తె అంటేది లేదు
ముప్పావలాయిస్తె ముట్టేది లేదు
రూపాయి యిస్తేను ప్రాపకము
లేదు.
హెచ్చు వరహాయిస్తె
పుచ్చుకుంటాము
పై పావలాకు పప్పుబెల్లాలు
తెప్పించి కట్నంబు లిప్పించ
రయ్యా
జయాభిజయభవ దిగ్విజయభవ

అంటూ నీటుగా నేతమ సంభావనల స్వరూపాన్ని తెలియ బరుస్తారు.

ఆశీర్వాదాలకు లొంగని వారి నైజాన్ని గ్రహించినట్లుగా వారిని మెప్పించడానికి :

బంగారు జలతారు రంగయిన
పాగ
ముత్యాలప్రోవులు ముద్దు
టుంగ్రాలు
చేతికంకణ బిరుదు చంద్ర
హారాలు
విలువుటంగీలును నీలాపు
మణులు
గోమేధికావుష్య గొలుసు
రత్నాలు
మాణిక్య కిరీట మహిత ప్రతాప
నీటుగనుశాల్జోడు నేడివ్వరయ్యా
సాటెవరు మీలోను సరసముగదయ్యా
మా పప్పు బెల్లాలు మాకుదయచేసి
తెప్పించి కట్నంబు లిప్పించరయ్యా
జయాభిజయ భవ దిగ్విజయ భవ

అంటూ ధనంతప్ప వేరే గొప్పదనం లేని వారిని ఉబ్బవేసి నేర్పుతో గురువుగారికి మరొక కాల్తీకూడా ముట్టేటట్లు చూస్తారు. వాళ్లి పప్పు బెల్లాల సంగతి మరచిపోరని వేరే చెప్పనక్కర్లేదు. అయితే గుణఘనం గలవారే కనబడితే పప్పుబెల్లాల సంగతికూడా ప్రస్తావించకుండా :

మాటాడి తప్పవు మన్మధాకార
సాటి వేరెవ్వరు సద్గుణాకార
సరసనీ వచనములు జాజిపూదోట
వరుస నీతోమాట వరహాలమాట. జయ॥

అంటూ గుణఘనులతోడి సాంగత్యాన్నే వరహాలమాటగా భావిస్తారు. ఇంటిపేరు, తల్లిపేరు, ఆసామిపేరు పెట్టి :

అసమాన గుణధీర అంగజాకార
వసుధలో గోవిందరాజు వంశవిస్తార
గరిమరాజ్యలక్ష్మి గర్భసుకుమార
భళి భళీ నరసింహ భాగ్యదేవేంద్ర. జయ॥

అంటూ పొగడ్త పాటలతో స్తుతి, స్తోత్రాలు



కాశినుంచి తెచ్చి రాజమహేంద్ర
వరంలో ప్రతిష్ఠాపన చేసిన
బాలా త్రిపురసుందరి
—చిత్రకారుడు : శ్రీపతి.

అల్లారు ముద్దులు కురిపిస్తూ ఆరంభిస్తే నేనే కాదు, యెలాటి వారయినా ఈ బుడతల సైన్యానికి లొంగక తప్పదు. ప్రతి యింటిలోని వ్యక్తులను గూర్చి వీరికి తెలియడమంటే ఆ యా కుటుంబాలతో వీరికి పూర్తి పరిచయం యేర్పడడ మన్నమాట. ప్రతి కుటుంబ పరివారం వీరికి తెలిసి వుండేదంటే ఆ కుటుంబాల మధ్య యెంతో సయోధ్య వుండి కలసి కట్టుగా జీవించడం జరిగేదన్న మాట. ఈ సంప్రదాయాలు కుటుంబాల్లో ఆత్మీయభావాన్ని కల్గించేవి. ఈ ఆత్మీయభావాభివృద్ధి సంఘీభావానికి దారి తీసేదంటే అతిశయోక్తి కాదు.

ఉంటాడయా ఊరికొకడు అన్నట్లు, వీరి స్తుతిపాఠాలకు, బ్రహ్మదీవనలకుగూడా లొంగని లోభులు కొందరుంటారు. అలాటి వారి లోభగుణాన్ని నిరసిస్తూ, వేదాంతాన్నీ భారతీయ సంస్కృతికి మూల ప్రాతిపదికయగు త్యాగాన్నీ బోధిస్తూ,

ఇవ్వనట్టి లోభులయిళ్లకు రాబోము
మటుమాయవాదులను మరియడుగబోము
మూటగట్టుటయే మోక్షముగాదయ్యా
వెళ్ళిపోయేనాడు వెంటేమిరాదయ్యా
చేసిన త్యాగమే చేదోడువాదోడు
జయాభిజయ భవ దిగ్విజయ భవ.

అంటూ లుబ్ధనిరసనపదాలు పాడుతారు. ఈ లుబ్ధ నిరసనపదాల శ్రేణిలో 'మూకపద్యం' అనేది చాలా ప్రసిద్ధికెక్కింది. విద్వత్తు లేకుండా కేవలం సంభావనలకే వచ్చారనుకుని భ్రమపడి మీ విజ్ఞానాన్ని ప్రదర్శించమని యెవరన్నా అడగాలేగాని :

మరుజనక మమ్మేలు మత్స్యావతార
గురుతుగా కృపనేలు కూర్మావతార
వరదుడవుగదయ్యా వరహావతార
సిరులుగురియించు నరసింహావతార
వటువుగ బ్రోచిన వామనావతార
రక్షించు మము పరశురామావతార
రాక్షసాంతక రఘురామావతార
(పాలించవే బలభద్రావతార)
కాపాడుచుండేటికృష్ణావతార
భావజాకార శ్రీ బౌద్ధావతార
కావవే మమ్మెప్డు కలికావతార ॥జయ॥

అంటూ మీరు కోరిన దశావతార ఘట్టాలనుగాని:

అంజనీగర్భమందమరజన్మించి
రంజిల్ల కాకుత్స్థ రాము భజియించి
లంకలోపలజొచ్చి లంఖిణిని ద్రుంచి
జంకకను రాక్షసుల బింకమణగించి
పంకజాక్షివార్త పతికి నెరిగించి
సంకటము బాపిన స్వామిహనుమంత
జయాభిజయ భవ దిగ్విజయ భవ

అంటూ రామాయణ ఘట్టాలనుగాని వినిపిస్తారు.

"రేపల్లెవాడలో గోపెమ్మ మేము
కాపురములు చేసి కడతేరలేము"

అంటూ శ్రీకృష్ణుని దుండగాలను గోపికలు యశోదాదేవికి ఫిర్యాదుచేయడం :

# క్షేత్రమాలిక




"గణపతి ముని"

కావ్యకంఠ, శ్రీ వాశిష్ఠ గణపతిముని భారతదేశంలో సుప్రసిద్ధములైన దివ్యక్షేత్రాలు దర్శించి తపస్సు చేసిన పునీతమూర్తి. ఆయాక్షేత్రాలలో దేవి ఏ పేరుతో ఉన్నదీ ఈ క్షేత్రవర్ణనలో తెలిపారు. ఇంకో రహస్యం. ఏ క్షేత్రంలో దేవిని ఏ విధానంగా సేవించాలో అదికూడా సూచించారు.

కాశీ మున్నగు క్షేత్రాలలో శక్తి గుప్తంగా ఉందనీ తాను బయటపెట్టుతున్నాననీ సారాంశం.

రామేశ్వరంలో పర్వతవర్థని పేరుతో ఉన్న విగ్రహం అంతా శక్తిస్వరూపం కాదు. అక్కడ శక్తి పాదాలలో ఉంది.

మధురలో మీనాక్షీ దేవి నేత్రాలలో తేజస్సు ఉంది; ఇలా గ్రహించాలి శక్తిస్వరూపాన్ని.

ఈ విషయం అంతా గణపతిముని చెప్పిన ఉమాసహస్రమనే స్తోత్రప్రబంధంలో క్షేత్రవర్ణన స్తబకంలో ఉంది. ఆ శ్లోకాలకు యథాతథంగా కాకపోయినా ఇంచుమించుగా అనువాదం ఈ క్రింది వాక్యాలు.

## "యామిజాల"

మాయారూపిణీ, మంగళదాయినీ, వేల్పులకు, మానవులకూ పూజనీయురాలు అయిన కన్యాకుమారి చిరునవ్వులవిలాసాలు భారతభూమికి శుభ శోభనాలు కలిగించుగాక.

ప్రియమిత్రుడా!

అరపవ్వగాన్ని అరికట్టి మాధుకర వృత్తితో ఆకలి అణచుకొంటూ మోక్షం కోరుకొనేవాడవైతే రామేశ్వర క్షేత్రంలో వేంచేసి ఉన్న పర్వతవర్ధనిదేవి పాదాలను దర్శించి తరించు.

సుందరేశ్వరులకు అర్ధాంగి అయి మధురానగరంలో అవతరించిన మీనాక్షీ దేవిని చూచావంటే నీ సంసారతాపం అంతా పటాపంచలవుతుంది.

జంబుకేశ్వరుని ఆత్మశక్తియై యున్న పరాంబను ఆశ్రయించే భక్తునికి అజ్ఞానతిమిరం తొలగి జ్ఞానోదయం అవుతుంది. (దక్షిణదేశంలో ప్రసిద్ధములైన పంచభూతక్షేత్రాలలో జంబుకేశ్వర క్షేత్రం ప్రసిద్ధిమైనది.)

తిరువారూరులో అవతరించివున్న త్రిపురసుందరీదేవి మహిమను వెయ్యి నోళ్లున్న శేషుడుకూడా వర్ణించలేడు. భక్తుల పురుషార్థాలన్నీ ఆ దేవి ఫలింపచేస్తుంది. ఆ క్షేత్రంలో పుట్టిన యేజంతువైనా అవలీలగా ముక్తిని పొందుతుంది.

దర్శించవయ్యా! చిదంబర క్షేత్రం దర్శించు. అది ఆకాశలింగం అవతరించిన పుణ్యభూమి. నటరాజు నాట్య విలాసాలకు చేయూత ఇచ్చిన శివకామసుందరి వెలిసిన క్షేత్రం అది. నీ కోరికలు ఫలించాలంటే ఆ అమ్మ పాదాలు పట్టుకో!

తేజోలింగరూపి అయిన అరుణాచలేశ్వరుని గృహలక్ష్మి అపీతకుచాంబ ఆ దివ్యజనని నివాసం అరుణాచల క్షేత్రం. దానినే తిరువణ్ణామలై అని ద్రావిడ భాషలో పేర్కొంటారు. (ఇక్కడ దేవి ఆలయానికి పశ్చిమంగా ఉన్న కొండలో శ్రీచక్రం ఉందని గణపతిమునులు విశదీకరించారు.) ఆ అపీతకుచాంబను సేవించిన వారికి సర్వకార్యసిద్ధి అవుతుంది.

కుంపేలీపటణం (పడైవీడు) ఛిన్నమస్త అయిన రేణుకాదేవికి ఆవాసభూమి. ఆనందము అంటే యేమిటో కలలోనైనా తెలియక బాధపడే సంసారి యీ రేణుకా క్షేత్రాన్ని ఆశ్రయిస్తే ముక్తసంగుడౌతాడు.

ఆదిపురి క్షేత్రం (తిరువత్తియూరు) లో నెలకొనివున్న దేవి త్రిపురసుందరి. ఆ తల్లిని దర్శించి సేవించిన వానికి బాహ్యాభ్యంతర శుద్ధి కలుగుతుంది. అసూయవంటి గుర్గుణాలు తుడుచుకొని పోతాయి. మరుదటి జన్మలో తప్పక ముక్తి పొందుతాడు.

పసిడిగజ్జెల ఒడ్డాణంతో కలకల లాడుతూన్న కామాక్షీదేవి కాంచీ పట్టణంలో ఆవిర్భవించి ఉన్నది. ఆదేవి నామాక్షరాలు ఆనందతరంగాలై వినవస్తూ ఉంటాయి. ఆమె నామం జపించు, ఆనందించు. (కంచి పృథివీ క్షేత్రం అని పెద్దలు చెబుతున్నారు.)

జ్ఞానాంబిక అనే పేరుతో జగదంబ కాళహస్తి క్షేత్రంలో అవతరించింది. ఆమెను దర్శించిన వారికి కైలాసప్రాప్తి అవుతుంది. అని ప్రాజ్ఞులంటున్నారు. ఆదేవి పాదాలు నమ్ముకొన్న భక్తులకు జ్ఞానోదయం తప్పక అవుతుంది. (కాళహస్తి వాయుక్షేత్రం అని ప్రసిద్ధి.)

భ్రమరాంబిక విజయం చేసి ఉన్న క్షేత్రం శ్రీశైలం. భ్రమరాంబికను సేవించి, శ్రీశైల శృంగాన్ని చూచివచ్చిన పుణ్యాత్మునకు మరిజన్మ లేదు.

పశ్చిమ సముద్రతీరాన ఉన్న పుణ్యక్షేత్రం గోకర్ణం. క్షేత్ర దేవత పేరు భద్రకర్ణి, పవిత్రమైనబుద్ధి, సర్వమనోరథసిద్ధి కోరుకొనేవారు భద్రకర్ణదేవిని దర్శించుకుంటే తప్పక కలుగుతాయి.

మహారాష్ట్ర దేశంలో కరవీర క్షేత్రమని ఒక ప్రసిద్ధక్షేత్రం ఉంది. అక్కడి దేవత పుణ్యఅనే పేరుతో ఉన్న జగన్మాత. ఆ దేవతను ఆరాధిస్తే మోక్షలక్ష్మి



## కంచి ఏకామ్రేశ్వర ఆలయ శిల్పం

—ఫోటో : పి. గురుమూర్తి]

స్వయంగావచ్చి వరిస్తుంది.

భవబంధాలు త్రెంచుకొని ఆత్మజ్ఞానం పొందాలంటే తులజాపురీ క్షేత్రంలో ఉన్న జగదంబను ఆశ్రయించాలి. అంతేకాని అక్కడా ఇక్కడా తిరిగి ఏదో సాధిస్తాము అనుకోడం కాలక్షేపమే అవుతుంది గాని లాభంలేదు.

ఉత్కళ దేశంలో భువనేశ్వర క్షేత్రం పరమపవిత్రమైనది. ఆ క్షేత్రంలో పరాంబిక గోపికావేషంతో ఆవిర్భవించి ఉన్నది. ఆమెను సేవిస్తే ఇష్టఫలసిద్ధి కలుగుతుంది. సంసారానికి సంబంధించిన కష్టాలు సమూలంగా తొలిపోతాయి.

వైతరణి అనే నదిఒడ్డున విరజాదేవి అనే పేరుతో జగజ్జనని వెలిసిఉన్నది. ఆమెను ఆరాధిస్తే పుణ్యకర్మలన్నీ చేసినట్టే అవుతుందని ప్రాజ్ఞులు అభివర్ణించారు.

కిలకతా(ప్రా)నదీపాన దక్షిణేశ్వరంలో ఉన్న కాళికాదేవిని దర్శించి సేవించినవానికి యముని వల్ల ఏ బాధలూ కలగవు. ఇది ముమ్మాటికీ నిజం.

కామరూపదేశంలో నీలాచలం అనే క్షేత్రం ఉంది. అక్కడ కామేశ్వరి అనే పేరుతో గుహ్యముద్రయై పరాంబిక నెలకొని ఉన్నది. సమస్త ప్రాణుల జన్మకారణమైన ఆ దేవిని కొలుచుకొనేవారు సర్వకామములనూ అనుభవిస్తారు.

మగధదేశంలో మంగళగౌరి అనే పేరుతో జగదంబిక ఉంటూన్న క్షేత్రం పరమపవిత్రం. ఆ క్షేత్రాన్ని దర్శించిన వారు సర్వమంగళములనూపొంది పునీతులౌతారు. చివరకు ఎవరూ పొందలేని ఉత్తమగతిని పొందుతారు.

వారాణసీక్షేత్రం మూడులోకాలలోనూ సాటిలేని పవిత్రక్షేత్రం. గౌరీదేవి విశాలాక్షి పేరుతో ఇక్కడ భిక్షులకు అన్నదానం చేస్తూ అన్నపూర్ణ అని ప్రసిద్ధి పొందింది.

వింధ్య పర్వతవాసిని అయిన దేవి పేరు నందాదేవి. నందాదేవిని సేవించినవాడు ఎప్పుడూ సంసార భయానికి లొంగడు.

అవంతీపుర దేవతయై శివదూతిక అనే ప్రసిద్ధ నామంగల మహాకాళశక్తిని ఆరాధించినవానిని ముక్తికాంత స్వయంగా వరిస్తుంది. ఇంక చెప్పవలసేది ఒక్కటే మిగిలింది. క్రౌంచగిరిని భేదించిన సుబ్రహ్మణ్యునితో కలిసి గణపతి ఆడుకొన్న పూదోటలు కల కైలాసం.. అది పార్వతి సౌభాగ్యాలకు నట్టిల్లు. దానిని స్మరిస్తే సకల పాపాలూ నశిస్తాయి. కుమారగణనాథులతో, శుభంకరుడైన భవునితో మహాకైలాస నిలయయై ఉన్న పరదేవత మమ్ము రక్షించుగాక! ★

## రక్షకులు

(16-వ పేజీ తరువాయి)

చిస్తున్నాడు. ఆమెని చూదామని తహతహలాడుతున్నాడు. "వియోగంవల్ల" అతగాడికి అసలే ఎక్కువగా ఉంది ఉద్రేకం. ఆమెనా సమయంలో అక్కడ చూసేసరికి మరీ ఎక్కువయింది. ఆమె పడిపోవడం కాదుకాని ఆమె నతడు పట్టుకోవలసివచ్చింది. ఆమె ఆవిధంగా తాకేసరికి అతను ఒళ్ళు మర్చిపోయేడు. అతనికి మతి పూర్తిగాపోయింది. ఆ మతిపోవడంలో ఆమెని దగ్గరగా తీసుకొని ఏమేమో అనడం మొదలుపెట్టేడు.

సరళకి మతేంపోలేదు.

"ఒగులు. ఒదుల్తావా ఒదలవా?" అని కేకలు వేసింది. వేసి విడిపించుకుంది. విడిచేవరకూ పిడికిళ్ళతో గుద్దింది. విడిచేక చెంపపెట్టు వేసింది.

ఆడపిల్లచేత లెంపకాయ తిన్న పిమ్మట ఏంచెయ్యడమో తెలియక వెర్రినవ్వునవ్వబోయి నవ్వలేక నిల్చున్నాడు జాన్ లూయీరావు.

ఇంతలో ఆడపిల్లని ఆపదనుంచి రక్షించేదామని, ఎక్కణ్నుంచి వచ్చేడోకాని, మిలిటరీ దుస్తుల్లో ఉన్న వ్యక్తి ఒకతను అక్కడికి వచ్చేడు. వస్తూనే జాన లూయీరావుకి రెండు తగలనిచ్చేడు. తోడనె సరళ నుద్దేశించి అడిగేడు. "ఎవడు వీడు? ఏం చేస్తున్నాడు మిమ్మల్ని? ప్రమాదలేం జరగలేదుకద? హాయ్! మీరు సరళాదేవికదూ?"

ఈవిధంగా సరళని రక్షించి పారేయడానికి వచ్చిన ఇతగాడెవరు? సెలవుమీద ఇంటికొచ్చిన రత్తమ్మ కొడుకా? ఎవరు? ఎవడో ఒకడు. 'అయినా ఎవడో చెప్ప కూడదూ?"

రత్తమ్మ పుత్రుడో, రాజన్ చంద్రుడో, రహ్మన్ ఖానుడో, రాన్సన్ 'రొనాల్డో'! ఎవడైనా సరే.

"మీ సాయం నాకక్కర్లే"దని విసవిస నడచి వెళ్ళింది సరళాదేవి. ★

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

(19 వ పేజీ తరువాయి)

పనులేనా సాధించవచ్చు. వెయ్యిమందిచేత ఒక్కసారి రిహార్సలు, ఒక టేకుకూడా వేస్టు కాకుండా పెద్ద డాన్సు తీయ్యొచ్చు. బాక్సాఫీసు రైటరుచేత కావలసిన వేళకి డైలాగులు రాయించేసుకోవచ్చు. పాటలు రాసేవాడికీ, మ్యూజిక్ డైరెక్టరుకీ పోట్లాట రాకుండా ఒక పూరి పాట తయారు చేయించవచ్చు. కొత్త నటులచేత ఓవరాక్షన్ మానిపించవచ్చు. శివాజీ గణేశన్ చేత చిన్న చిన్న డైలాగులే అనిపించవచ్చు. ఇంకా ఎన్నైనా సాధించవచ్చు. వాడెవడో చెప్పినట్టు తివిరి కుందేటి కొమ్మున తైలంబు తీయవచ్చు. వాడి దుంప తెగ! చిన్న డైలాగులో మూడుసార్లు 'తి' పెట్టి రాశాడు. ఎడ్రసు తెలిస్తే నా పిక్చరుకి బుక్ చేస్తాను—ఏం? ఎన్నైనా చెయ్యొచ్చుగాని ఇద్దరు బాక్సాఫీస్ స్టార్లని ఒక్కసారిగా ఒక సెట్ మీదకు తీసుకురావడం మాత్రం ఆపాటి ఈపాటివాళ్ళు ఓపట్టాన సాధించలేరు. సాధించినవాళ్ళు ఆనందం పట్టలేరు. అందుకే ఆయన అలా డాన్సుచేశాడు. విచ్చింగానీ మిషరీ? అన్నాడు బాబు.

ఆహా జ్ఞాననేత్రం ఒకటి ఓపెన్అయింది సార్. ఇంకోఆయన—మీదగ్గర ఆఖరి బీడీ లాక్కున్నాయన ఎవరోకూడా తెలిపి, రెండోజ్ఞాన కన్నునికూడా తెరవరా అన్నాడు రాజు.

* * *

## 'యద్రివృగ్జరసమువశ్చ్రుఖన్నం'

బాబు కథ సాగించాడు:

ఆయనా. ఆఅవస్థ శత్రువుక్కూడా వద్దు. మూడ్రోజుల్నించి జరుగుతోంది ఆ కథ. రెండ్రోలు ఆయన నన్ను ఖాతరు చెయ్యలేదు. వట్టె సూపర్ స్టిషన్ అని కొట్టిపారేశాడుట ...చివరికి ఏపనీ తెమలక ఖర్చుతడిసి మోపెడయేసరికి, తోటివాళ్ళు ఆయనకి సలహా ఇచ్చారు. "కలియుగ కుబేరుడు చాలా సత్యమైన దేముడు. తక్షణం వెళ్ళి ఒక్క బీడీ వేడి పుచ్చుకో" అని. ఆయన మూడ్రోలు నించి ఒక్క సెట్ మీద తిప్పలుపడుతున్నాడు. అందులో హీరోకి ఓ డైలాగు అనడం బాగా కుదరటంలేదు. అందులో ఓమాట మార్చాలి. దానికి డైలాగు రైటరు రావాలి. ఆయన అండర్ గ్రౌండులో వుంటూ, ఇపుడు ఇంకో కంపెనీకి రాస్తున్నాడు. అంటే ఏదాస ప్రకాశ్ హోటలులో, వుడ్ లాండ్సో, కన్నెమెరానో అన్నమాట. ఆ రైటరుకి ఓ ప్రొడ్యూసరు టైముకి డబ్బివ్వలేదట. ఆకోపంకొద్దీ ఆ ప్రొడ్యూసరు శత్రువు పిక్చరుకిఅడ్వాన్సైనా అడక్కుండా సొంతఖర్చుమీద ఆ హోరాత్రాలు చెడరాసేస్తున్నాడు ఆ కవి. మధ్యని ఈ నిర్మాత అవస్థపడుతున్నాడు.

"ఆడైలాగేదో ఈ ప్రొడ్యూసరో డైరెక్టరో యాక్టరో డిస్ట్రిబ్యూటరో మార్చిపారెయ్యొచ్చుగా. అది మామూలేగా" అన్నాడు రాజు.

మామూలే అనుకో, ఈసారి ఆమాట ఎవ్వరికీ కొరకుడుపడటంలేదుట అన్నాడు బాబు.

"సందర్భాన్నిబట్టి ఇంకో డైలాగు రాసేస్తే?"

వెర్రినాయనా ఏమాత్రం వీలైనా వీళ్ళు సందేహిస్తారా? సందర్భం తెలియడం అనేది కథమీద ఆధారపడి వుంటుంది. కథ డిస్ట్రిబ్యూటరులమీద, హీరోయిన్ల గార్డియన్ల మీదా ఆధారపడి వుంటుంది. ఇంతకీ పిక్చరు సగమవ్వాకాకుండా కథ ఏమిటో ఎవరు మాత్రం చెప్పగలరు?

సినిమా కథలు వారఫలాలవంటివి. గ్రహబలాలను బట్టి మారుతాయి: చెప్పొచ్చింది. ఆసందర్భం సంగతికదూ. అది లాసీనుట. హీరో ప్రియురాలి జుట్టు నిమురుతూ "ప్రియా ఈ యద్రివృగ్జ రసమువశ్చ్రుఖన్నానికి కారణమేమిటి?" అని అడుగుతాడుట

"అది చెప్పడం కొంచెం ఇబ్బందేకదా. వాటీజ్ దిస్ నాన్సెన్స్ అన్నాడట హీరో.

"వాటీజ్ ది ఇంగ్లీష్ మీనింగ్ సార్" అని అడిగాడట దాన్ని తమిళంలోకి తర్జుమా చేసేకవి

సెట్ మీద అందరూ తర్జన భర్జనలు జరిపారు.

కొందరు అర్థం గంభీరంగా ఉంది గాని మాట కొంచెం తేలగా ఉండాలన్నారు. తేలికగా రాసినమూలానే షేక్స్పియరు మహాకవి అయ్యాడని మరికొందరు ఇంగ్లీషులో అన్నారు. ఇంతకీ సంగతేవిటో తేలలేదు.

"కారణమేమిటి' అని డైలాగుచివర ఉంది కాబట్టి ఆ "యద్రివృగ్జ రసమువశ్చ్రుఖన్నం" అన్న మాటకి అర్థం ఉండాలి గదా. చెట్టో చేమో, జబ్బో జీబూతిమో, తల్లో పూలో పేలో ఏదో ఒకటి అఘోరించాలిగదా అదేదో తేలకుండా ఎలా మార్చడం?

"పోనీ హీరోయిన్ జవాబు డైలాగు రాసిఉంటుందిగా, దాని అర్థం బట్టి— అన్నాడు రాజు నానుస్తూ.

"హీరోయిన్ జవాబు ఏమిటో తెలుసా? కారణమేమిటి అంటాడుగదా వీడు? ఆవిడ ఏమో ఏమిటో అంటుంది. కాపోయినా హీరోయిన్ డైలాగులికి అర్థంఏమిటి."

"హరిణీ చిక్కు."

"మరి అముక్కే ఆవాళ్లంతా అనుకుని ఏం తోచక రైటరుకోసం వెతుకుతున్నారు. అందుకే ఇందాకటాయన ఇష్టం లేకపోయినా నన్ను బీడీ అడిగి పట్టికెళ్ళాడు తాయెత్తుగా. ఈపాటికి పని అయుండాలి మరి." అంటూ లేచాడు బాబు.

* * *

అంతలోకే ఒక ఆసామి అటువేపొచ్చి, బాబునిచూసి భక్తితో దండంపెట్టి, "గురూ నువ్వు నిజంగా కుబేరుడివే," అన్నాడు.

కుబేరుడి గుండె గుభేలుమంది. "ఈ సిగరెట్లు చచ్చినా ఇవ్వను ఇది వీరిచ్చారు. ఇది పనిచెయ్యదు" అన్నాడు చేతిలో సిగరెట్టు నోట కుక్కేసుకొని.

"వద్దులే ఆడైలాగు మిస్టరీ తెలిసిపోయింది తెలుసా! ఆరైటరు దొరికాడట. అర్థం చెప్పేశాడు. సాయంత్రం చిన్న టీ పార్టీ గ్రాండుంది. నిన్ను పిలవమన్నారు" అన్నాడాయన.

"ఏమిటిట అర్థం" అన్నాడు బాబు.

"ఆ ఏంలేదు ప్రేయసీ! ఈ పూవులు నవ్వడానికి కారణం ఏమిటి? అనిట, ఆవిడ 'ఏమిటో' అంటుంది. అంతే. వడ్డగింజలో అవగింజ ఇంతాచేసి" అన్నాడాయన.

"అయితే ఆ మాటకి నిజంగా అర్థం ఉందన్నమాట"

"ఏచ్చే వచ్చే అలాటిమాటే లేదుట ఆయన ఏదేదో రాయబోయి ఏదోరాస్తూ కొట్టేస్తూ, రాయబోయిన మాట మర్చిపోయాడు. తీరా దానికి సాపు రాసినాయన అదేదో గంభీరపు డైలాగు అని అనుమానపడి ఆ కొట్టివేతల అక్షరాలన్నీ పోగేసి ఒక మాటలా కట్టాడు. అది నానా గోడవా చేసింది. ఏమైతేనేం నీ బీడీ మూలాన రైటరు పట్టుబడ్డాడు. వాడి మూలాన సంగతి తెలిసి కథ కదిలింది వస్తా గురూ" అని వెళ్ళిపోయాడు ఆ పెద్దమనిషి.

"బ్రదర్. చూశావా అంతా చెత్త అని తెలిసినా నామహిమనుమాత్రం ఇంకా నమ్ముతున్నారు. ఇప్పుడు చెప్పు నేనెవర్ని?" అన్నాడు కుబేరుడు గర్వంగా.

"ఎవడివైనా సరేకాని కుబేరుడివి మటుకు కావు వతిసూపరిషన్. మూఢనమ్మకం. బాస్."

అంటూ టీబిల్లు చెల్లించుకున్నాడు రాజు.

"సెబాష్" అన్నాడు కుబేరుడు పకపక నవ్వి. "నేను ముందే అనుకున్నాను నువ్వు ఈఫీల్డుకి పనికిరావని. నాకథనీ నన్ను చెత్తకింద జమకట్టడంతో నే నీ అయోగ్యత ఋజువైంది."



(సశేషం)

# వనితాలోకం

## శివే సర్వార్థ సాధకే

బి. ఎస్. లక్ష్మి

మ॥ అమరన్ లోకహితార్థమంచు నభవుండౌగాక యంచాడెఁ బో
యమరుల్ భీతిని మ్రింగవే యనిరి పో యంభోజగర్భాదులుం
దముఁ గావన్ హర లెమ్ములెమ్మనిరి పోరు తా జూచి క్రీగంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగు మనె న య్యుగ్రానలజ్వాలలన్.

(పోతన).

త్రసు మారిన ధర్మము చెయ్యటమే స్వభావంగాగల పరమేశ్వరుడు ఒప్పుకుంటే ఒప్పుకోవచ్చు; ఆవిషానలముచే తామేమవుతామో, అనే భయము కొద్దీ అమరులు మ్రింగమనవచ్చు; తను కష్టపడి సృష్టించిన జీవకోటి అంతా క్షణంలో భస్మమవుతుందనే ఆతృత కొద్దీ కమల గర్భుడు 'అభవా లేలెమ్మ'నవచ్చు.

అంతేకాని ప్రాణేశ్వరుడు హాలహలము మ్రింగుతానంటే ఒక్కసారి కొనకంట చూసి అనుజ్ఞ ఎల్లా యిచ్చిందో సర్వమంగళ?

తన మాంగళ్యాన్ని పణముగా ఒడ్డి అన్ని కోట్ల దేవమానవ రాక్షసస్త్రీల మాంగళ్యాల్ని కాపాడేందుకు సంసిద్ధురాలైంది. కనుకనే మాంగళ్యాన్ని కాంక్షించే సుమంగళులంతా యీనాటికీ సర్వమంగళలను పూజిస్తారు—అంతేకాకుండా స్త్రీని, వట్టి ఆటవస్తువుగా భావించే ఆకాలంలో అబలకూడా సబలేనని నిరూపించి అమరుల నందర్ని రక్షించింది పార్వతి.

అతి ఘోరతపస్సుచేసిన మహిషాసురుడు దేవ మానవ రాక్షసుల్లో ఎవరివల్లా చావు లేకుండా వరమడిగి స్త్రీని మరిచిపోతాడా? బహుశా ఆడది నన్నేం చెయ్యగలదనే నిర్లక్ష్యమే కావచ్చు. చావుకూడా లేకుండా వరముపొంది గర్వించిన మహిషుడు లోకాలన్నింటిని బాధించటము మొదలుపెట్టాడు. వాడిబాధ పడలేని వేల్పులు పురుషుల్లో ఎవరి చేతా వాడికి చావులేదని తెలుసుకుని పరమేశ్వరనే శరణుపొందారు. అట్లా వేల్పుల చేత ప్రార్థితురాలై ప్రసన్నురాలైన ఆదేవి, వెయ్యిచేతులు వెయ్యిచేతుల్లోను ఆయుధాలు ధరించి సింహవాహనారూఢయై చెలికత్తెలు వెంటరాగా మహిష రాజధానికి దగ్గరగావుండే ఒకవనంలో విహారం మొదలుపెట్టింది. త్రిలోకాలను సమ్మోహింపచెయ్యగల ఆ త్రిపురసుందరిని చూసిన రాక్షసులు మహిషుడుదగ్గర ఆమె సౌందర్యాన్ని వర్ణించటము మొదలుపెట్టారు. ఇల్లా ఆమె సౌందర్యాన్ని విన్న మహిషుడికి ఆమెను తన రాణిగా చేసుకోవాలనిపించి రాయబారం పంపాడు. రాయబారం తెచ్చినవారిని చూసి కలకలానవ్వుతూ, "మీ మహారాజుని మించిన గొప్ప వాళ్లెవరూ నాకు లభ్యమవరు. కాని నాకో ప్రతిజ్ఞ వుంది. యుద్ధంలో నన్నెవరైతే గెలుస్తారో వారినే వివాహం చేసుకోవాలనుకున్నా. ఇన్నిలోకాల్ని జయించిన మీమహారాజుకు ఒక ఆడదాన్ని జయించటము లెక్కలోది కాదుకదా? కనుక సమరంలో నన్ను గెలిచి పాణిగ్రహణం చేసుకోమని చెప్పండి మీ మహారాజుకు" అంది త్రిపురసుందరి.

ఆమె వింత కోర్కె విన్న మహిషుడు, "యుద్ధమన్న చెండ్లాట అనుకుంది కాబోలా సుందరి. అది ఏదో చూపించి ఈ వేళే సమరంలో ఆమెను స్వీకరిస్తాను" అనుకుని యుద్ధసన్నాహం మొదలు పెట్టాడు. పాపం ఈ వార్త విన్న మహిషుని భార్య మటుకు భయకంపితురాలై త్రిపురసుందరి ఉన్న వనంలో కెళ్లి ఆమెనుతనకుమాంగల్య భిక్ష పెట్టమని అర్థించింది. వెంటనే ఆదేవి కూడా "నువు బ్రతికినంతకాలం నీ మాంగల్యానికిముప్పురాద"ని ఆశీర్వదించింది. ఈ విధంగా ఆ దేవి వల్ల అభయంపొందిన మహిషుని భార్య మహిషుని సమీపించి, ఆసుందరి సామాన్య స్త్రీ కాదనీ ఆమెను తను చూచి వచ్చాననీ, స్త్రీచేత మినహా ఎవరివల్ల చావు రాకుండా కోరినందువల్ల మహిషుని వంచించ అవతరించిన లోకమాతేనని, అందుచేత ఆమెను కోరటము కానీ ఆమెతో యుద్ధము చెయ్యటము కానీ మంచిది కాదని చెప్పింది. ఈ మాటలన్ని విన్న మహిషుడు కోపంతో తనకు అడ్డువచ్చిన భార్యను నరికేసి యుద్ధానికి బయలుదేరాడు.

మహాపతివ్రతయైనభార్యను సంహరించటముతో మహాదేవి యిచ్చిన అభయానికి భంగం లేకపోయింది. వాడి ఆయుస్సు కూడా క్షీణముకాగా సమరభూమిలో ఆశ్వయుజ శుద్ధ అష్టమి రోజు ఆదిశక్తి చేతుల్లో మరణించాడు మహిషుడు. (అదే దుర్గాష్టమి)

బ్రతికున్నంతవరకు స్త్రీ ఆట వస్తువనే భావిసూ వచ్చాడు మహిషుడు. కానీ చివరికి స్త్రీ చేతులోనే మరణించాడు. ఆవిధంగా లోకకంటకుడైన మహిషాసురుని వధించిన మహిషాసురమర్దనిని వేల్పులు ప్రజలు బహువిధాల శ్లాఘించారు. అది మొదలు ప్రతి సంవత్సరము ఆమె యుద్ధము మొదలు పెట్టిన శుద్ధపాడ్యమి మొదలు దశమివరకు దేవిప్రీత్యర్థం పూజలు చేస్తారు.

ఆ పదిరోజులు దేవికి దేవాలయాల్లో దశావతారాలు ధరింపజేస్తారు. ఇళ్ళల్లో

# పెట్టుకో సొమ్ములు, కట్టుకో చీర

దసరాపండుగ అనగానే దసరా బలేసరదా అని మా చిన్నప్పటిమాట గుర్తొస్తుంది. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు దశమి వరకు దశరా పండుగలు. దీనికే దేవీ నవరాత్రులని బతకమ్మ పండగలని గొంతెమ్మ పండుగలని ఎవరి పూర్వాచారప్రకారము వాళ్ళు అనుకుంటారు. మూలానక్షత్రము నాడు మార్వాడీలు ధనలక్ష్మీపూజ చేస్తారు. కొందరు ఆయుధపూజ, కొందరు సరస్వతీపూజ ఎవరి ఇష్టప్రకారము వారు చేస్తారు.

## బతకమ్మ కథ

బతకమ్మ నోమును ఎక్కువ తెలంగాణాలో ఆడపిల్లలు పట్టుతారు. తోబుట్టువులకు మేలుకలగాలని ఈనోము చేస్తారు. దీనికి చిత్రమైనకథ ఒకటి ఉంది.

ఆ సాయంత్రంపూట పాటలు పాడుతూ ఈ బతికమ్మ కథలు చెప్పుకుంటూ, గొబ్బి తట్టినట్టుగా చుట్టూతిరుగుతూ ఆడుకొంటారు.

కథ ఇది: అనగనగా ఒక బ్రాహ్మణుడు అతనికి ఒక కొడుకూ కూతురూ. కోడలు కాపురానికి వచ్చింది. కూతురు పన్నెండేళ్ళ పిల్ల. ఒకసారి కూతుర్నీ కొడుకూ కోడలికీ ఒప్పగించి కాశీ వెళ్ళారు ఆ బ్రాహ్మణ దంపతులు. ఇంతలో పండుగ వచ్చింది. ఇంటి ఆడపడుచు వదినగారి చీరతీసి కట్టుకుంది. అందుమీద గంధం ఒలికింది. వదినకు కోపం వచ్చింది అది చూసి, భర్త ఇంటికి వచ్చేసరికి తలకట్టుకు పడుకుంది అలిగి. భర్త ఏమీ అని అడిగాడు.

ఆడపడుచుని చంపి ఆ రక్తము రాస్తే తగ్గుతుందని ప్రోత్సహిస్తుంది. కాని కేవలం చెల్లిని చంపలేక భార్యమాట కాదురాడలేక అతగాడు ఆ పిల్లని అడవిలో దాచి, కోళ్ళ నెత్తురు, నక్క నెత్తురు తెస్తే, చివరికి సంగతి తెలిసికొని భార్య తిరిగీ నిర్బంధించింది. అడవిలో ఒక బావివద్ద మంచినీళ్ళు తాగుతుండగ చెల్లిని చంపి ఆ నెత్తురు తీసుకుని ఆపిల్లను అక్కడ పాతేశాడు అతడు. అక్కడ ఒక తంగేడు చెట్టు మొలుస్తుంది. ఆ రక్తం చిందటంచేతనే దాని పూలు పచ్చగా వుంటయ్యట. తరువాత వదిన ఆ నెత్తురు రాచుకునేసరకి తలనొప్పి పోకపోగా కళ్ళు రెండు పోతై. ఈలోగా తల్లిదండ్రులు కాశీనించి వస్తూ ఆ చెట్టుదగ్గరికి వచ్చేసరికి, "అమ్మా! నాన్న! నన్ను అన్న చంపేడే! వదిన చెప్పిందే" అని మాటలు వినపడతై. ఇంటికి వచ్చేసరికి సంగతి తెలుస్తుంది. అందరు ఆ చెట్టుదగ్గరికివచ్చి ఆపూలుకోసి బతకమ్మని పేర్చి పసుపుగౌరిని పెట్టి పూజలు చేసారు. ఇలాచేస్తే పుట్టింట అన్నవదిన బాధలు లేకుండగ వుంటైట. దీనికొకపాట కూడా వున్నది. అది అత్తవారింటి సుఖాన్ని కోరుతూ వుంటుంది.

"మాఅన్నలొచ్చారు మమ్మంపారండీ" అని ఒక కలవారికోడలు, అడుగుతుంది. అత్తవారింట్లోవున్న ఆప్తులందరినీ ఇదే రీతిగా. కాని అందరూ మాకు తెలియదంటె, మాకు తెలియదని తప్పించుకుంటారు. చివరికి భర్తను అడుగుతుంది.

"మీ అన్నలొస్తేనూ ఏమితెచ్చారు"
అని అంటాడు భర్త. అప్పుడామె.
"పాపకు పట్టంగ పాలుత్రాగుగిన్నె"
"అత్తకు పట్టుచీరా అద్దాల రవిక"
"నాకు నల్లచీర నెమిలడుగు రవిక".

ఈ విధముగా అందరికి తెచ్చిన ఆ యా వస్తువులూ వస్త్రాలు చెప్పగా.

"పెట్టుకో సొమ్ములూ కట్టుకో చీర"
"ఎత్తుకో పాపణ్ణి పల్లకీ ఎక్కు"

అని భర్త పంపిస్తాడు. సంతోషముతో ఆ పిల్ల అత్తవారింటినుంచి, పుట్టింటికి వెడుతుంది. ఇది ఈ నోమునోచిన ఫలితంగా అత్తవారింట్లో సుఖముఅని మన పెద్దలంటారు. అందుకని ప్రతి ఆడపిల్లలు అత్తింటి సుఖము పుట్టింటి సుఖమూ కోరుతారు గనుక ఈ నోము నోచుకుంటారు.

—ఎస్. కె. దుర్గ.

# శివే సర్వార్థ సాధకే

కలశంపెట్టి దేవిని ఆహ్వానంజేసి దేవీ నవరాత్రులు జరుపుతారు. అల్లా చెయ్యలేనివారు పుస్తకరూపిణియైన సరస్వతిని మూలానక్షత్రంనాడు, దుర్గాష్టమినాడు దుర్గను, మహర్నవమినాడు మహాలక్ష్మిని వుపవాసంతో యథాశక్తి పూజించి మరునాడు అంటె (దశమి) నాడు దేవీప్రీత్యర్థం ముత్తయిదువులను కన్యలను పూజించి భోజనము పెట్టి దక్షిణ తాంబూలాదులనిచ్చి సంతోషపెడతారు. దాన్నే త్రిరాత్రవ్రతమంటారు.

పూర్వము సావిత్రీదేవికూడా నారదమహాముని వుపదేశించిన దేవీ మంత్రము జపిస్తూ వుపవాసంతో పైమూడు రోజులు దేవిని పూజించిందని ఆదేవీ అనుగ్రహం వల్లనే యమధర్మరాజు దర్శనమయి తద్వారా భర్తను బ్రతికించుకోగలిందనీ చెప్తారు.

ఇల్లా సర్వవిధాలా సర్వమంగళ సామర్థ్యం తెలిసినవాడు కాబట్టె మహాదేవుడు వుమాదేవి కొనకంటితో హాలాహలముమ్రింగమని సౌంజ్ఞ చెయ్యగానే మ్రింగేశాడు. అట్లా ఆ దేవి అనుజ్ఞ ఇవ్వనినాడు హాలాహలము మ్రింగేవాడే కాదేమో! శంకరుడు.

ఈధర్మసూక్ష్మం తెలిసిన వాడు కాబట్టె శ్రీకృష్ణుడు రథంలో వున్న వింటిని తను తీసుకోకుండా సత్యాదేవి చేతిమీదుగా తీసుకుంటాడు. భార్యనోట విజయ సూచకంగా ఒక్కమాట వచ్చినా విజయంలభిస్తుందన్న వుద్దేశ్యంతోనె యుద్ధభూమిలో అడుగిడబోయేవారు భార్యచేతి విజయ తిలకం నొసట ధరించి ఆమె యిచ్చిన విజయ ఖడ్గం స్వీకరించేవారు. ఈకారణం చేతేకార్యోన్ముఖుడై వెడుతున్న భర్తను ఏ కారణం చేతేనా భార్య వారిస్తే ఆకార్యం సఫలం కాదంటారు.

కలకంఠి, కంట కన్నీరొలికిన సిరి యింట నుండదంటారు పెద్దలు. తనకు మాలిన ధర్మంతో ఇల్లాలికంట కన్నీరొలకగా అప్పులపాలయ్యాడు ఏడు కొండలవాడు. ఆ అప్పైనా మళ్ళీ భార్య అడుగుపెట్టాకే పుట్టింది. వివాహవేదిక దగ్గిర పెద్దల ఎదుట అగ్ని సాక్షిగా ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థం స్వీకరిస్తున్నాడంటాడు పురుషుడు. ఇల్లు అన్నాక ఇల్లాలికి తగ్గ గౌరవమిస్తేనే యిల్లు శోభిస్తుంది. అప్పుడే పురుషుడాశించిన చతుర్విధ పురుషార్థాలు సిద్ధిస్తాయి. ఆసత్యం తెలుసుకున్నవాడు కాబట్టె గౌరికి అర్థశరీరమిచ్చి గౌరవించాడు శంకరుడు. అందుకే ఎన్నడు విడివడని జంటగా పురాణ దంపతులు కాగలిగారా దంపతులు

శ్లో॥ సర్వమంగళ మాంగల్యే శివే
సర్వార్థసాధకే
శరణ్యే త్ర్యంబకే దేవినారాయణి
నమోస్తుతే. ★

# అలవాట్లు

సామాన్యంగా మనం కొందరిలో కొన్ని కొన్ని అలవాట్లను చూస్తుంటాము. మాకు కాఫీ అలవాటనో, ఓవల్టీను అలవాటనో చెప్పడం సబబేకాని, కొంతమంది వింత అలవాట్లు చేసుకొని మాకు అవి "అలవాటండీ" అంటూ ఉంటారు. వాళ్ళు చేసే వికిలిచేష్టలూ, మాట్లాడే తీరు చూస్తే, నవ్వూ అసహ్యమూ కూడా కలుగుతూ ఉంటాయి.

మాయింటికిఒకావిడ ఈమధ్యన వచ్చింది. వస్తూనే నా మెళ్ళో ఉన్న నెక్లెసు నన్ను అడగకుండానే అమాంతంగా తీసకొని తన మెళ్ళో పెట్టుకొని, "ఏమనుకోకు అమ్మాయీ! నాకు ఎవరికొత్తవస్తువు చూచినా పెట్టుకోకపోతే తోచదు. అదొక అలవాటు" అని కాస్సేపు పోయేక నావస్తువు నాకిచ్చేసిందిలెండి. పాపం ఆమె కూర్చున్నంతసేపు మా చెల్లెలు ఒకటేనవ్వు, ఆమెని చూస్తే ఇదేమి అలవాటా అని నాకు జాలివేసింది

ఇంకొకసారి మేము మాకు తెలిసిన వారింటికి వెళ్ళేము. వారి డ్రాయింగు రూములో అడుగుపెట్టేనో లేదో. ఒకనీటి బుడగవచ్చి నాచేతిమీద వాలి పేలిపోయింది. ఏమిటా అని చూస్తే ఆయింటాయన తీరికగా ఒక కుర్చీలో కూర్చుని, నోటిలోని ఉమ్మితో బుడగలు ఊదుతున్నాడు. ఇంతలో ఆయన భార్య మాకెదురుగా వచ్చి ఇంకనైనా ఆపండి బాబు ఆ బెలూనులు! అని మమ్మల్ని ఇంట్లోకి తీసుకొనివెళ్ళింది. ఆయనేమైనా చిన్నవాడా అంటే, 50 ఏళ్ళవాడు. 200 రూపాయల జీతగాడు. ఆయనకీ అలవాటేమిటి?

కొంతమంది అమ్మాయిలూ, అబ్బాయిలూ సాయంత్రము 5 గంటలయేటప్పటికి నీటుగా డ్రెస్ అయి, డాబాలమీదనో, కాంపౌండు గోడలదగ్గరో పచార్లు చేస్తూ ఉంటారు. అది చివరికి అలవాటయి, ఇరుగుపొరుగు అమ్మలక్కలు, బుగ్గలు నొక్కుకొని, లేనిపోని ప్రణయాలు నెత్తిన రుద్దుతారు. ఈ లేనిపోని అలవాట్లు చేసుకోవడ మెందుకు! తరువాత విచారించడ మెందుకు? కొంత మంది కిళ్ళార్పుతూ ఉంటారు. మా స్నేహితురాలు గొంతులో గురగుర శబ్దము చేస్తూ ఉంటుంది. అది మానుకోమని నేనంటే నామీద కోపము వచ్చి మా యింటికి రావడము మానేసింది. మనం చెప్పినా వాళ్ళు వినరండోయ్! మనం చెప్పినా వాళ్ళు చెడ్డగా తీసుకుంటారు.



—ప్రయాగ సత్యవతి.



దిండు గరిబు మీదకు-
ఇ. నిర్మల (మద్రాసు)



# పొగడ్త

**పి. సరళాదేవి**

మనిషికి ప్రాణవాయువు వంటిది పొగడ్త. ప్రాణవాయువు జీవించడానికి అవసరమయితే, పొగడ్త ఆ జీవితం చురుకుగా వుండడానికి అవసరమవుతుంది. పొగడ్త అని పెద్దమాట వాడానే కాని- ఆ పొగడ్తలోనే మెప్పు, ప్రోత్సాహం, ప్రశంస అని ఎన్నో రకాల మెట్లున్నయి. అయితే మొత్తంమీద అంతా పొగడ్తే. ఈ పొగడ్తని ఆశించే వాళ్ళనే కీర్తికాంక్షులనికూడా అంటారు.

## ఎంత కాదన్నా...

ఏపనిని పొగడాలి అన్నది సమస్యకాదు. వాకిలి తుడిచి కళ్ళాపుచల్లడందగ్గర్నుంచి- ప్రభుత్వం నడపడంవరకు ప్రతి నిమిషం కోటానుకోట్ల పనులు జరుగుతుంటాయి. ప్రతివారికీ ఏదో ఒక గొప్పతనం, ఎందులోనో ఒకదానిలో, అది చిన్నదే కానివ్వండి పెద్దదే కానివ్వండి వుంటుందంటాను. మిగిలినవి ఎన్ని అవగుణాలున్నా ఆ పనిలో మాత్రం మెచ్చుకోకుండా వుండలేం. అయితే ఆ ప్రత్యేకత చిన్నదానిలోఅయితే ఆ అవగుణాలమధ్య అణగిపోతుంది. పెద్దదానిలో అయితే పైకి వస్తుంది - అంతే తేడా!

నేను పొగడ్తల కాశించనని ఎంత వాదించినా లాభం లేదు. 'మంచి' గా బ్రతకాలని,'మంచి'అనిపించుకోవాలని మనిషన్నవాడికి లేకుండాపోతుందా? తానెంత దుర్మార్గుడైనా 'మంచివా'డంటే సంతోషపడని మనసుంటుందా ?...ఏమో, నమ్మశక్యంకాని విషయం!

## డబ్బుకన్నా...

ఒక పనికి ప్రతిఫలంగా డబ్బు వచ్చినా మనిషిని తృప్తిపరిచే డబ్బు రాదు కాబట్టి, ఒక వేళ వచ్చినా ఆ తృప్తి తాత్కాలికం కాబట్టి అంతరాంతరాల్లో పొగడ్తనే ఆశిస్తారు. ఎప్పుడూ ఏ పనిలోనూ పొగడ్త రాకుండా వుంటే ఏ పనైనా శ్రద్ధగా చేయగలరా? చేసినా మొక్కుబడి తీర్చుకుందుకు చేస్తారే గాని ఇష్టంగా, వుత్సాహంగా, మనస్ఫూర్తిగా చేయగలరా? ఏ పనైనా చేస్తున్నప్పుడు ఇది బాగా చేయాలని ఎందుకనుకుంటారు? 'నా తృప్తికోసం' అనొచ్చు. కాని ఇంకెవరైనా ఆ పనిని చూసి కనీసం సూచనగానైనా ప్రశంసించకపోతే ఆ తృప్తి ఎన్నాళ్లు నిలుస్తుంది? ఆ మెప్పు ఆ పనిలో లభించిందీ అంటే తరువాత పనిని బాగా- ఇంకా బాగా చేయడానికి తన అవసరాలను వదులుకోడానికైనా సిద్ధపడతారు!

## పూర్వపద్ధతికన్న...

తాహతునుబట్టి, తెలివినిబట్టి, చనువును బట్టి, వయసునుబట్టి పొగిడే తీరులు మారుతూ వుండాలి. ఒకొక్కప్పుడు మనకు తెలియకుండానే ఆ మాటలు మెప్పు ఇచ్చేస్తూంటాం. కాలంతోబాటు పొగడ్త తీరులు కూడా మారుతూవుంటాయి. పూర్వంలా ముఖాముఖిని పొగిడేసరికి ముత్యాలహారాలిచ్చే నరపతులు లేరు. అసలా ముఖాముఖి పొగడ్తే నచ్చదు. "అహాహాఁ ఏమి భోజనం పెట్టించేవయ్యా. రాజభోజనం! మీ వంశం అసలు రాజవంశం! నీలో రాచరీవి వెలుగుతోంది!" అని ఎవరైనా అంటే వెటకారంగా కనిపించదూ. అసలు ప్రత్యక్షపొగడ్త కంటే పరోక్షపు పొగడ్తే ఎక్కువ ఆనందాన్నిస్తుందనుకుంటాను.

ప్రత్యక్షపు పొగడ్తయితేనిజముంటుందో లేదో అని అనుమానం కలగొచ్చు. తనను ఉబ్బేయడానికే పొగుడుతున్నారు గాని హృదయంలోంచి వచ్చిందికాదు అనిపిస్తుంది. పరోక్షపు పొగడ్త-ఫలానవాళ్లు ఫలానవాళ్ళదగ్గర ఇలా అన్నారంటే, అది హృదయంలోంచి వచ్చింది కాకపోతే తనను వాళ్ళదగ్గర పొగడవలసిన అవసరమేవొచ్చింది? తప్పులుంటే సులభంగా ఎవరితోనయినా చెబుతారు గాని, మెప్పయితే మనస్ఫూర్తిగా మెచ్చుకుని ఆత్మవంచన చేసుకోనివాళ్ళయితేనే చెబుతారు. అందుచేత అదే ఎక్కువ ఆనందం ఇస్తుందనుకుంటాను.

ప్రత్యక్షపు పొగడ్తే అయితే వీలైనంత క్లుప్తంగా వుండి ఆ సందర్భంలో ఒకసారే వాడాలి. నిముషానికోసారి ఆ పొగడ్త ఎత్తి చూపుతూ మాట్లాడుతూంటే ఆనందాన్నివ్వడంపోయి దెప్పిపొడుస్తున్నారేమో అనిపిస్తుంది. అప్పుడు దాన్ని వికృతంగా అర్థం చేసుకుని మనస్పర్థలు కలగడానికి అవకాశముంటుంది.

## ఒకసారితిన్నా...

"మా బాబు బంగారుకొండ, చక్కగా బువ్వతినేస్తాడు" అంటూ గోరు గోరు ముద్దలు బాబునోట్లో పెడితే మొదటిసారి తింటాడు. అప్పటికీ తెలుసుకోలేకపోతే రెండుసార్లు, మూడుసార్లు తింటాడు. అదే వర్ణిస్తూంటే-తనను మోసంచేసి తినిపించడానికే అలా అంటున్నామని తెలుసుకున్న తరువాత, మనమెంత లాలించినా తినడానికి అల్లరి మానేస్తాడా? అందుకే పొగడ్తకెప్పుడూ అత్యుక్తి కలగనివ్వకూడదు. అప్పుడే మనమీద నమ్మకం ఏర్పడి అనవసరంగా పొగడమని తెలుసుకొని, మన నోటి నుంచి వచ్చిన పొగడ్తను నిజమని నమ్మగలుస్తారు.

పొగడ్తనెప్పుడూ ముఖస్తుతిగా కూడా కానివ్వకూడదు. అలా ఎప్పుడైనా వాడితే, అది వట్టి ముఖస్తుతి మాత్రమేననే సంగతి అన్నవాళ్లకీ తెలుస్తుంది. అనిపించుకున్న వాళ్ళకీ తెలుస్తుంది. దాంతో ఏదో పని నెరవేర్చుకోడానికి తప్పితే నిజం కాదనే వూహ కలుగుతుంది. అనిపించుకున్నవాళ్ళకి ఒకొక్కసారి చాల కోపవొఁచ్చే అవకాశాలు కూడా లేకపోలేదు.

నోటి మాటలద్వారా పొగడ్తే అక్కర లేదు. కొందరు నోరు మెదపకుండానే ఎదుటివాళ్ళపట్ల చరించే విధానంలోనూ, మొగం తీరులోనూ పొగిడే తృప్తి కలిగించగలరు. భోజనం చేస్తున్నప్పుడు తృప్తిగా తింటున్నట్టు వుండే విధానంలోనూ, ఎదుటివాళ్ళు చెబుతున్న విషయంపట్ల ఆసక్తి ప్రదర్శించే కళ్లతోనూ, నిండైన నవ్వు మొగంతోనూ ఎంతో తృప్తి కలిగించగలరు.

## ఎంతవస్తున్నా...

మనిషికి డబ్బు ఇచ్చేగుణమే పొగడ్త కూడా ఇస్తుంది. ఎంత గొప్పవారైనా ఈ విషయంలో పప్పులో కాలేస్తుంటారు. డబ్బెలాగైతే వస్తున్నకొద్దీ రావాలనే వుంటుందో, అలాగే పొగడ్తకూడా వస్తున్నకొద్దీ రావాలనే వుంటుంది. అప్పుడప్పుడు వస్తున్న పొగడ్తను తృప్తిపడక తాము చేసిన గొప్ప పనులు, తమను పొగిడిన విధానాలు కనిపించిన ప్రతి మనిషికీ చెబుతూ, ఇంకా ఇంకా పొగడాలని, తాము చేస్తున్న అతి చిన్నపనికి కూడా పొగడ్త రావాలనే కాంక్ష... దాహం బయలుదేరుతుంది. దాంతో ఎన్నెన్నో పిల్లిమొగ్గలు వేస్తూంటారు.

## మనసున్నా, మాటలు సున్నా

అసలు ఏదైనా మంచిది-అంటే నిజంగా, మనస్ఫూర్తిగా పొగడ్త ఇవ్వవలసినది ఏదైనా కనిపిస్తే మాటలే రావు. మనసులో మాత్రం ఎంతో ఎక్కువగా, ఆ సంతోషాన్ని పట్టలేనంత ఎక్కువగా మెచ్చుకుంటూంటాం. కాని పైకి ఒక్కమాట పెగలదు. మనకు తెలిసిన మాటల్లో ఆ భావం వెలువరచగలిగే శక్తి గలది లేదనిపిస్తుంది. "అబ్బ! ఎంత బావుంది" అంటాం. మనం సమంగా వెలువరచగలిగామనే తృప్తిమాత్రం వుండదు. అప్పుడే మన ఆకారమూ మొగమూ ఎదుటి వాళ్ళని తృప్తి పరచగలుగుతై.

వంటలు:

# మరికొన్ని హల్వాలు

పావుశేరు బంగాళాదుంపలు, పావుశేరు చిక్కనిపాలు, పావుశేరు చక్కెర 10. యాలక్కాయల గింజల పొడి:

ముందర దుంపలు ఉడకబెట్టి పొట్టు తీయాలి రోట్లో వేసి మెత్తగా ముద్దగా నూరాలి. పాలను వెడల్పు మూతిగల గిన్నెలో పోసి బాగా కాగనివ్వాలి. కళపెళ్లాడుతున్నప్పుడు నూరిన ముద్ద, చక్కెర వేసి బాగా కలియబెట్టాలి. అడుగు మాడకుండా అరకప్పు నెయ్యిపోసి స్టవ్వు కిందబెట్టకుండా కలపాలి. ముద్దగా అవుతుంది. ఒక ప్లేటుకు నెయ్యిరాచి హల్వాను దానిమీద పరవాలి. పైన యాలకుగింజలపొడి చల్లాలి. చల్లారనిచ్చి సర్వ్ చేస్తే బాగుంటుంది.

## సమోసాలు

పావుశేరు బంగాళాదుంపలు అర్ధపావు పచ్చి బటానిగింజలు తగినంగా పచ్చిమిర్చి, కొత్తిమీరి, ఉప్పు అర్ధశేరు మైదా.

విధానము:

బంగాళాదుంపలను, బటాని గింజలను వేరువేరుగా ఉడకబెట్టాలి. బంగాళా దుంపలు వుడికాక తీసి పొట్టుతీసివేయాలి. ఒక గరిటతో బాగా చితకగొట్టాలి.

ఉడికిన బటానిగింజలు వుప్పు మిర్చి ఖిరపకాయలు సన్నగా తరిగిన ముక్కలు కొత్తిమీర బంగాళాదుంపల ముద్ద అన్ని బాగా కలిసేలా చేతితో కలపాలి.

అర్ధశేరు మైదాలో అరకప్పు నెయ్యి పోసి కలపాలి. కొంచం నీళ్ళుపోసి గట్టిగా పూరీలపిండిమాదిరి కలిపి వుంచాలి. పొయ్యిమీద బాణలిబెట్టి నెయ్యిగాని డాల్డాగాని పోసి కాగబెట్టాలి. పూరీలు వత్తే పీటమీద పూరిమాదిరి వత్తి కలిపి వుంచుకొన్న ముద్దలో నుంచి నిమ్మకాయంత ముద్దబెట్టి మరలా మడత బెట్టాలి. చుట్టూ అంచులు గట్టిగా నొక్కాలి. లేకున్న బాణలిలో వేశాక విడిపోతాయి. నెయ్యిలో వేసి గోధుమ రంగు వచ్చేదాక వేయించి తీసెయ్యాలి. ఈ విధంగా అన్ని చేసుకోవాలి...

## ఉండలు

ఒకపావు దుంపలు, అరపావు పాలు, అర పావు మైదా, ఒకపావు చక్కెర, నెయ్యి:

దుంపలు ఉడకబెట్టి పొట్టుదీసి ముద్దగా నూరాలి. మైదాలో పాలుపోసి కలపాలి. మళ్లీ దుంపల ముద్ద చక్కెర, మైదాముద్దలో వేసి బాగా కలపాలి. బాణలిలో నెయ్యిపోసి కాగిన తరవాత, చిన్న చిన్న వుండలుతీసి కొంచం వెడల్పుగా వత్తి వేయించాలి. పొంగి చాలా బావుంటాయి.

## బొంబాయిహల్వా

కావలసినసామాన్లు-½ శేరు మైదాపిండి, 1½ పావు మంచినెయ్యి, పావుతులం యాలుకులపొడి, 1 చటాకు జీడిపప్పు, 1 చటాకు పిస్తా, ½ చటాకు కిస్‌మిస్ పళ్ళు.

ఈటిఫిన్ మూడుగంటలకు తయారుచేస్తామనగా 2 గంటలకు మైదాపిండి పూరీ పిండివలె గట్టిగా కలుపుకొనవలెను. ఒక గంట పోయిన తరువాత ఒక స్టీలు గిన్నెలో ఈ ముద్ద వేసి 2 పావుల నీళ్ళుపోసి పాలు తీయవలెను. తీసినపాలను పల్చటి గుడ్డలో వడకట్టి చిటికెడు మిఠాయిరంగు వేసి ఒక ప్రక్కగా వుంచుకొనవలెను. ఒక స్టీలు గిన్నెలో 2 పావులు పంచదార వేసి సన్నసెగమీద పాకం రానివ్వాలి. ఈపాకం చేతికి తీసుకొని వుంచటుకోవలెను. పాకం అయిన తరువాత మైదాపాలుపోసి కలుపవలయును. దీనిని సన్నసెగమీద వుడుకనివ్వాలి. కలుపుతూ నెయ్యి పోయవలెను. ఇది యిలాగు వుడుకుతూ హల్వాలాగు తయారగును. అంటే మనము కలుపుతూవున్న గరిటెకు అంటకూడదన్నమాట. ఇలాగు అయిన తరువాత యాలకులపొడి కిస్‌మిస్ వేసి కలియపెట్టి ఒక పళ్ళెమునకు నెయ్యిరాసి హల్వా ముద్దను వేసి పళ్ళెంనిండ సర్దవలెను. జీడిపప్పు పిస్తా సన్నగా తరిగి పైన అద్దవలెను. కొంచెము చల్లారనిచ్చి ముక్కలు కోయవలెను ఈ హల్వా నిల్వవుండును.

బళ్ల అన్నపూర్ణ విశాఖపట్టణం.

## రవ్వహల్వా

చేయు విధానం:

మధ్యాహ్నం చేస్తామనగా ఒక గ్లాసు సన్నరవ్వనూక దోశెలపిండి మాదిరిగా అంటే చిక్కగా కలుపుకోవాలి. నీటిలో ఉప్పు వేయకండి. నేను గ్లాసుల కొలతో చెప్తు న్నాను. మధ్యాహ్నానికి ప్రొద్దుటి నూక నానిఉంటుంది. దళసరి గిన్నె కుంపటిమీద పెట్టి(దళసరిగిన్నె అయితే అడుగంటకుండా ఉంటుంది.) ఏగ్లాసుతో నూకకొలిచినామో ఆగ్లాసుడు పంచదార గిన్నెలోపోసి కొంచెం కరిగేదాకా ఉంచండి. ఈతడిపిన నూక ఒక గ్లాసు-అంటేయిదివరకు కొలుచుకున్న గ్లాసు-నెయ్యి ఈ పంచదార పాకంలోపోసి బాగా దగ్గరపడేదాకా గరిటతో కలపండి. జీడిపప్పు,(వేసుకుంటేరంగు) కిస్‌మిస్ పళ్లు, ఏలకపొడుంవేసి ఒక పళ్లానికి నెయ్యిరాసి దాంట్లోకి యీహల్వా దిమ్మరించండి. చల్లారినాక బిళ్లలక్రింద కోయండి, చేయడం చాలా తేలిక, జలుబుచేయదు. ముందు ఒక చిన్నగ్లాసుతో చేయండి. బాగావస్తే చాలా చేసుకోవచ్చు.

కొమ్ము మారుతీదేవి, కాకినాడ.

* * *

## అనాసపండ్ల హల్వా

కావలసిన సామానులు: అనాసపండ్ల ముక్కలు అర్ధశేరు; ఐదుతులముల బాదం పిస్తా; ఐదుతులములు నెయ్యి; 8 తులములు మైదాపిండి! అర్ధశేరు చక్కెర! కుంకుమ పువ్వు! అల్లము తగుమాత్రంగా తీసుకోవాలి!

తయారుచేయు పద్ధతి! అనాసపండ్లు బాగుగా శుభ్రపరచి సన్ననిముక్కలుగాతరిగి ఒక అర్ధశేరుతూచి దానిలో ఐదుతులముల పిస్తాపప్పు వేసి నేతితో వేయించవలెను. మైదాపిండిని వేయించి, అల్లములో కలుపవలెను. తిరువాత అర్ధశేరు చక్కెర పాకము పట్టి సిద్ధముగానున్న అల్లపుముక్కలను, అనాసముక్కలను కుంకుమపువ్వును వేసి బాగుగా కలియబెట్టి దించుకొనవలయును. దించినపిమ్మట ఐదుతులములు బాదమపప్పును వేసి కలియబెట్టవలయును. గడ్డకట్టియున్న హల్వాను ముక్కలుగా కోసి భుజింపవలయును. ★

వాశిరెడ్డి విజయసుశీలకుమారి

---

దినకృత్యాలయిపోయిన పనుల్లో తప్పితే, సాధారణంగా మెప్పునాశిస్తాం. నిజం చెప్పాలంటే - మనకు ప్రీతిపాత్రమైన పనిలోనే పొగడ్త కోరుతాం. ఎందుకంటే అదంటే మనకెంతో ఇష్టం. మనకిష్టమైన పనిచే అందరూ ఇష్టపడి పొగడాలనుకుంటాం. కాని ఒక్కొక్కసారి నిరుత్సాహం ఎదురవక తప్పదు.

ఏదైనాపనిలో అందరూ పొగడాలనుకోడం అవివేకం. కొందరికి బావుండొచ్చు. కొందరికి బావులేకపోవచ్చు. అలాంటప్పుడు అందరూ ఎలా పొగుడుతారు? అప్పుడు ఈ బావులేదన్నవాళ్ళని కూడా తీసుకుని, వీళ్ళెందుకు బావులేదన్నారు? వాళ్ళెందుకు బావుందన్నారు? అని తరచి తరచి చూసుకుంటే మనతప్పులు మనకి బోధపడవచ్చు.

మనంకూడా ఎదుటివాళ్ళని ఆషామాషీగా ఉబ్బేయడానికో, మన పని నెరవేర్చుకోడానికో, లేకపోతే ఉపకారం అపకారం లేకపోయినా పనిలేకనో పొగడకుండా, జాగ్రత్తిగా వచ్చిన పనిని మనసారా మెచ్చుకుంటే గురి, గౌరవం ఏర్పడుతుంది-ఎదటివాళ్ళకీ, మనమటుకు మనకీకూడా. ★

# వంకాయ ★ ★ వంటి కూరయు...

వంకాయవంటి కూరయు
లంకాపతివైరివంటి రాజును గలడే
శంకరునివంటి దైవము
పంకజముఖి సీతవంటి పడతియుగలదే!

వంకాయ కేవలం కూరల్లోనే కాక విధాత సృష్టిలోనే ఉత్తమోత్తమమైన వస్తువ. కాదనేందుకు వీల్లేదు! అందుకనే కవి దానికి, పురుషోత్తముడైన రాముడితోను, సతీతిలకమైన సీతమ్మతోను, సకల చరాచర జీవుల లయకారుడైన శివునితోను సమానమైన 'హోదా' యిచ్చి, సింహాసనంమీద కూర్చోబెట్టాడు.

వంకాయల్లో రెండు విధాలు. ఒక రకం వంకాయలు గుండ్రంగాను, ఇంకొక రకం వంకాయలు కోలగా గొట్టంలాగఉంటాయి. నీటినే నీటి వంకాయ లంటారు. గుండ్రటి వంకాయల్లోనే మరొక తెగ ముళ్ళ వంకాయలు. ముళ్ళవంకాయ మహా రుచిగా ఉంటుంది. వీటిని పెంచడం బహు ప్రయాసతో కూడిన పని వంగనారు వేసి మొక్కలను జాగ్రత్తగా పెంచుతారు. ఈ ప్రయాసను పురస్కరించుకునే "వంకాయకు వంద తెగుళ్ళు" అనే సామెత వచ్చింది. అంత కష్టపడి పెంచవలసిన కాయలు కాబట్టే చుట్టాలకైనా యివ్వ బుద్ధి పుట్టదు! మరి. "ఎక్కడైనా బావకాని వంగతోటవద్ద మాత్రం కాదు!"

వంకాయ వెయ్యి విధాల వుపయోగపడుతుంది. సాధారణంగా కూర చేసుకోవడం, పప్పులో వేసుకోవడం కాక, గుత్తివంకాయ కూర వంటకం, వంకాయ విశిష్టత. దీన్నే ముద్వంకాయ అని కొందరు ముచ్చటగా వ్యవహరిస్తారు. ఉల్లికారం పెట్టి వండిన, గుత్తివంకాయ కూర ఘుమఘుమలు మాటల్లో చెప్పలేము. భోజనం చెయ్యనని బెట్టు చేస్తున్న క్రొత్తల్లుడైనా సరే, గుత్తివంకాయ కూర ఘుమఘుమలు, ముక్కుకు తగలగానే 'గమ్ముగ'న లేచి భోజనానికి కూర్చుంటాడు. ఈ గుత్తివంకాయ కూర గొప్పతనాన్ని గుర్తించిన, అధునాతనాంధ్ర గేయకవి అప్పారావు గొప్పగా "గుత్తి వంకాయ్ కూరోయ్ బావా" అని గర్వంగా చెప్పాడు. బందావారు దాన్ని వీనుల విందుగా గొంతెత్తి గానం చేశారు. ఆ పాట కని విని యెరుగని ఆంధ్రుడు లేడు.

ముద్వంకాయనుగురించి ముచ్చటైన కథొకటి చెప్తారు. పూర్వం ఒక వూరిలో ఒక రాజుగారుండేవారట. ఒకనాడు వంటవాడాయనకు ముద్వంకాయ కూర వండిపెట్టాడు. మసాలా ముద్వంకాయ రుచి నసాళాని కంటింది. ఓహో అనుకున్నాడు. ఇంకో క్షణం తరవాత ఓహోహో అనుకున్నాడు. వంకాయమీద గౌరవాభిమానాలు కొండంతగా పెరిగాయి. వెంటనే పచ్చి వంకాయ నొకటి ముచ్చటగా తెప్పించి దగ్గర పెట్టుకుని భోజనం పూర్తిచేశాడు. ఆ తర్వాత విలాసంగా వంకాయను పట్టుకుని దర్బారుకు వేంచేశాడు. చేతిలో దాన్ని అటూ యిటూ తిప్పుకుంటూ నవ్వుకుంటూ సాభిప్రాయంగా మంత్రి వైపు చూశాడు.

మహారాజులుంగారి మన సత్వ మెరిగిన మంత్రి "మహాప్రభూ! వంకాయ వంటి వస్తువు విశ్వంలో లేదు. దీని గొప్పతనాన్ని గుర్తించే బ్రహ్మగారు అందమైన అయిదంచుల కిరీటాన్ని దీని తలమీద పెట్టారు" అన్నాడు సమయస్ఫూర్తిగా. రాజుగారు "షెహబాస్" అని మెచ్చుకున్నారు.

ఇంతలో ఏమయిందీ! ఆయనగారి వ్రేలికి చురుక్కుమని ముల్లు గుచ్చుకుంది. రాజుగారు వంకాయను విసిరి నేలకు కొట్టారు.

వెంటనే మంత్రిగారు "మహాప్రభూ! వంకాయవంటి వెధవ వస్తువీ విశ్వంలో లేదు! అందుకనే కోపంకొద్దీ బ్రహ్మ దీని తలమీద మేకు దిగకొట్టాడు" అని సరిచెప్పాడు. రాజుగారి మొహంలో సంతోషం వెల్లివిరిసింది. ముల్లు ఒక్కటే వంకాయకున్న వంక!

వంకాయ వరుగు వేసుకొని ఏటికేడాది నిలువపెట్టుకుంటారు. అలాగే వంకాయ వూరగాయ కూడా పెట్టుకుంటారు. వంకాయ బజ్జీ, ఇగురు పచ్చడి, వంకాయ పులుసు, పులుసు పచ్చడి, పెరుగు పచ్చడి మొదలైనవి ప్రసిద్ధికెక్కిన వంటకాలు. వంకాయమీద విచిత్రమైన వేళాకోళం ఒకటి వుంది. చిన్నపిల్లలు ఒకరి నొకరు "What is this? వంకాయ ఫుల్స్, నీకేం తెల్స్ నిమ్మకాయ ఫుల్స్" అని వెక్కిరించుకోవడం మనం వింటూనే వుంటాము. మనిషి వయస్సు ఎక్కువయినా చిన్నగా కనిపిస్తున్న వాళ్ళను పరకాయించి చూచి "ఒత్తి గింజవంకాయిరా" అని అనడం పరిపాటి.

వంగపండురంగంటే వనితల కెంతో వుల్లాసం! వంకాయలతో తృప్తిపడని కొందరు వ్యక్తులు, తమ యింటి పేరే "వంకాయల" అని పెట్టేసుకున్నారు!

వహ్వా! వంకాయ! నీ జన్మ ధన్యమైంది!!

★

మందరపు పద్మ, లలిత
(విశాఖపట్టణం)




## పిట్టకథ

'ఉత్తరాల దొంగలు' అనే వ్యాసం చదివినాను. ఉత్తరాల దొంగతనాలవల్ల ఆమె చాలా ఇబ్బందులకులోనై ఆబాధతో తీవ్రంగా విమర్శించినట్లు కనబడుతున్నది. 'ముఖ్యంగా ఉత్తరాల దొంగల్లో ఎక్కువమంది మగాళ్లే' అని వ్రాస్తూ దానికి కొన్ని కారణాలు చూపించినారు. కాని అవి సబబుకావు. ఆడవాళ్ళలో చదువురానివారు చాలామంది వున్నారట. ఉంటేవుండవచ్చు. కాని వాళ్ళు, ఆవుత్తరాలు దొంగిలించి యింకొకళ్ళచేత చదివించుకోలేరా? అవకాశం మగవాళ్లకు ఎక్కువ అన్నారు. కాదు. ఆడవాళ్లకే ఎక్కువ. మగవాళ్ళు సామాన్యంగా పగలు యింటివద్ద వుండరు. పోష్టు బంట్రోతు వుత్తరాలు యింటివద్ద యిచ్చేసి వెళ్తాడు. అవకాశాలు ఎందుకు వుండవు?

ఓ కథకూడ వుంది. ఒకాయన స్నేహితునికి వుత్తరం వ్రాసి కవరుమీద "కాన్ఫిడెంషల్" అని వ్రాసినాడట. ఆలోపల వుత్తరంలో స్నేహితునికి వ్రాయవలసిన సంగతులన్నీ వ్రాసి ముగించి, P. S. అని గుర్తుపెట్టి స్నేహితుని భార్యపేర 'అమ్మా! నువ్వు యీ వుత్తరం తప్పక చింపి చదివి మళ్ళీ అంటిస్తావని తెలుసు. ఈసంగతులన్నీ నువ్వుకూడా మీ ఆయనకు గట్టిగా చెప్పమ్మా' అని ముగించినాడట. అనుకున్నట్టే జరిగింది. ఆవిడ యీ చివరి ముక్కలు చదువుకొని సిగ్గుపడిందట.

—నండూరి పూర్ణచంద్రరావు
(తణుకు)

## అన్యాయం

"ఉత్తరాల దొంగలు" అను వ్యాసం ఆ జాతిదొంగలకు ఒక చెంపపెట్టు లాంటిదని చెప్పక తప్పదు.

కాని నాకు ఇక్కడ ఒక సందేహము వచ్చినది. "ముఖ్యంగా ఉత్తరాల దొంగల్లో ఎక్కువమంది మగవారే. ఆడవాళ్ళు ధైర్యం చేసి ఆ పనికి పూనుకోలేరు. పైగా ఆడవారిలో ఎక్కువమంది చదువురానివారు" అన్నారు. దీనివలన, వారికి ఇష్టమున్నప్పటికిని, ధైర్యము లేనందువల్ల, చదువు రానందువల్ల మాత్రమే ఈ "ఆడదొంగలు" అల్పసంఖ్యాకవర్గమునందుండిపోయారను భావను వెంటనే కలుగుతున్నది. కాగా, ప్రభావతిగారు ఇలా పక్షపాతంగా మగవారిని ప్రత్యేకించటము, మనకు వారిపట్ల ద్వేషభావమును వ్యక్తీకరించుచున్నట్లున్నదని నా అభిప్రాయము. భర్తలకు వచ్చిన ఉత్తరాలను చించి చదివి, చదువు రాకపోతే ఏ స్కూలు కుఱ్ఱాడి చేతనో చదివించి, వాటిని చించి పారవేసే భార్యలు ఎంతమంది లేరు? అలా ఏవి దేనికి సంబంధించిన ఉత్తరాలో తెలియక, అఫిషియల్ "జాబులను కూడ చించి పారవేసి, భర్తలకనేక ఇబ్బందులు కలుగజేసినవారలెంతమంది లేరు? ఈ చదివించటములో కూడ ఇంకొక యనర్థమున్నది. ఆ చదివే వారలకు సరిగా ఇంగ్లీషు అర్థం చేసుకోలేకపోతే, వాటిని ఇంకొక అర్థము వచ్చేలాగున తర్జుమా చేసినందువలన, గృహములో రేగిన తుపానును ఆణచటానికి పితృదేవతలు సహితము దిగివచ్చిన సన్నివేశములనేకము లున్నవి. కనుక ఈ దొంగతనమంతా మగవారికే అంటగట్టుట కేవలము అన్యాయము అనియే నా యుద్దేశము —

—లీలారాయ్, (గుంటూరు)

* * *

'ఉత్తరాల దొంగలు' అనే వ్యాసము చదివేను. చాల బాగుంది. చదువుకున్నవారు, అన్నీ తెలిసినపెద్దలు సహితము దొంగతనంగా ఉత్తరాలు చదవడము, ఇతరుల రహస్యాలు తెలుసుకోవలెనని కుతూహల పడడము, వాళ్ళనుగూర్చి వ్రాశారని అపోహలు పడడము మానవజాతికే కళంకము. వ్యక్తిత్వానికి తీరని ద్రోహము. మన శాస్త్రాలలో ఘోరము మద్యం. నిత్యజీవితంలో, గృహజీవితంలో సాధారణ లోటుపాటుల నలా విమర్శించడంవల్ల మనో వికాసము కలిగి మనస్సులలో మాలిన్యాన్ని మాడ్చి తమ పద్ధతులు మార్చుకుంటారనుకోడం సహజం. మార్చుకుంటారని ఆశిద్దాము. ఇలాంటి వ్యాసము ద్వారా మంచి సందేశము అందిస్తున్న రచయిత్రికి హృదయపూర్వక అభివందనములు.

—రాయసం నిర్మలమీనాక్షి,
(గుంటూరు)

* * *

"ఉత్తరాల దొంగలు" అన్న వ్యాసం నన్నెంతో ఆకర్షించినది. ప్రభావతిగారు నిజం నిర్మొగమాటంగా స్పష్టపరిచారు.

—కే. రాధ (రాపూరు)

* * *

18-9-57 వ తేది వారపత్రికలో శ్రీమతి మంగళాకందూర్ గారు తమకు గ్రంథాలయములో పుస్తకములు సరిగా దొరకవని, స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలు కావలెనని వ్రాసినారు. సామాన్యంగా ప్రతివారు, అందులో ముఖ్యంగా స్త్రీలు నవలలే చదువుతారు కాని ఇతర పుస్తకములు సామాన్యంగా చదువరు. ప్రతి గ్రంథాలయములో నవలలన్నీ ఉండవుగదా! అటువంటప్పుడు నవలలే కావాలంటే లైబ్రేరియన్ ఏం చేస్తాడు? ఒక్క నవలలేకాక ఇతర గ్రంథములు కూడ చదివితే కాలక్షేపము జరుగును. మరియు అనేక క్రొత్త విషయములు తెలియగలవు. కాని నవలలే కావాలంటే ఎన్నని ఉంటవి. ఇక స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలు ఉంటే మంచిదని వ్రాశారు. వారు వ్రాసిన విషయమైతే మంచిగనే వున్నది కాని, ఉన్న గ్రంథాలయాలే నడవలేని ఈ కాలములో స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలు కావాలంటే అందని పండ్లకు అఱ్ఱులుచాచటమే.

—బి. నారాయణరావు,
లైబ్రేరియన్.
శ్రీ కీ. రా. గ్రంథాలయం, గొల్లపూడి.

* * *

18-9-57 పత్రికలో పి. సరళాదేవిగారు వ్రాసిన "కుట్లూ, తిట్లూ, ఇక్కట్లు", అను వ్యాసం చాలా బాగున్నది. వారు చెప్పినట్లు కొంతమందికి కుట్లంటే చాలా పిచ్చి. అవి కుట్టేవరకు వారికి నిద్రపట్టదు. మనకి ఉపయోగం వచ్చే స్వెటర్లు అవీ అల్లుకుంటే మంచిది. అదైనా మధ్యాన్నం రెండు, మూడు గంటలు కుట్టుకుంటే మంచిది. అంతే కాని అది తొందరగా పూర్తి అవాలికదా అని ఎప్పుడూ అల్లకూడదు.

 

# వనితావాణి



మంగళా కందూర్ గారు వ్రాసిన "స్త్రీలకు ప్రత్యేకం గ్రంథాలయాలు" కూడా చాలా బాగుంది.

— బి. రాజామణి,
(కాకినాడ)

* * *

## ఊహ మంచిది

పి. శరళాదేవిగారు 14-8-57 వ తేదీ ఆంధ్రపత్రికలో వ్రాసిన 'తెల్లచీరలూ, మల్లెపూవులూ, వెన్నెల రాత్రులూ' అన్న వ్యాసమును నేను చదివి చాలా ఆనందించినాను. తెలుపును గురించి ఆమె బాగుగా వర్ణించినారు. తెలుపు అంటే నాకు కూడ చాలా యిష్టము. కాని ఆవిడ వ్యాసము చివర ముఖ్యముగా మొగవాళ్ళకథల్లో కథానాయిక ఎల్లా ప్రవేశిస్తుందో వ్రాశారు. ముఖ్యముగా ఆడవాళ్ళకథల్లో కథానాయకుడుకూడ ఎల్లా ప్రవేశిస్తాడో తెలియజేస్తే చదివి ఆనందించాలని ఉంది.

— కె. వి. రమణ, మాడుగుల.

* * *

ఆర్. ఎస్. లక్ష్మిగారు (పొరుగింటి) పుస్తకపఠనము చాలా బాగా రాశారు. మా యింటికికూడా చాలా మంది పుస్తకాల కోసం వచ్చేవారు. ఒకవేళ మాయింట్లో ఏమీ పుస్తకాలు లేకున్నా యిందాక కొంటూంటే చూశామనేవారు. అల్లాంటివాళ్లను ఏమనగలము. ఇహ ఇది పనిగాదని మమ్మల్ని పుస్తక మడిగేందుకు వచ్చినవారితో మీకు కూడా పుస్తకాలంటె చాలా యిష్టము కాబోలు. మీరుకూడా ఏదేనా వీక్లీ తెప్పించండి. అప్పుడు మా పుస్తకము మీరు మీపుస్తకము మేము చదవవచ్చు అని చెప్పేదాన్ని, దానితో పొరుగు పుస్తకాలేకాని యింట్లో కొన్న పుస్తకాలంటె చదవ బుద్ధిపుట్టని వారంతా సర్దుకున్నారు. ఇప్పుడు పుస్తకమేమన్నా వుంటె యిస్తారా అని మాయింటికి ఎవరూ రారు.

మంగళా కందూరుగారు రాసినట్లుగా లైబ్రరీలో యిచ్చే (మావాళ్లు తెచ్చే) చదివేసిన పుస్తకాలె చదవలేక చివరకు విసుగెత్తి చందాకట్టడము మానేశాము. అల్లాకాకుండా మంగళా కందూర్ గారు రాసినట్టుగా కనీసం ఒక బండిమీద ఇంటింటికి పుస్తకాలు సరఫరాచేసినా మన్యతరగతి స్త్రీలకు సగుపాయంగా వుంటుంది.

— బి. ఎస్. లక్ష్మి (కాకినాడ)

* * *

## వినతి

(పక్కింటివారి) పుస్తక పఠనం అను వ్యాసం చదివితిని. చాలాబావుంది. నిజంగా పుస్తకాలున్న ప్రతివారికి ఈ బాధ తప్పకుండా వుంటుంది. మాకు ప్రతివారం పత్రిక వస్తుంది. బొమ్మలన్నా చూడనివ్వకుండా మా దగ్గరనుంచి లాక్కుపోయేవారు. ఇక అది వారి ఇంటిల్లిపాదీ చదివి మళ్ళీ పత్రిక వచ్చే నాటికి మాకు దక్కేది. అదీ మేమెళ్ళి ఒక గంటసేపు వుంటే, మరి వారంరోజు లేంజేసే వారోగాని అప్పుడు చదివి ఇచ్చేవారు. కొందరిళ్ళకెళ్తే అసలు మాకు పుస్తకమే ఇవ్వలేదు పొమ్మంటారు. కొందరు దానిలోని డిజైనులు వంటలు వగైరా చించుకుని గాని ఇచ్చేవారుకాదు. ఇక కొందరయితే ఎవరన్నా తమతో మాట్లాడనివారు పుస్తకం పట్టుకెళ్తారు చూడండి. అప్పుడు ఇక తమరుకూడా బయలు దేర్తారు పోటీకి ఏమైనా పుసకమిమ్మని చదివినా చదవకపోయినా. తీసుకెళ్ళేది పిల్లలదగ్గర పడేసి తమరేదన్నా లోకాభిరామాయణమో లేకపోతే నిద్రకో వుపక్రమించేవారు. ఇక ఈ పుస్తకాన్ని ఈ పిల్లలు చించేది. ఇట్లాంటి వారందరూ లక్ష్మిగారివ్యాసం చదివి అయినా పద్ధతులు మార్చుకోగలరని ఆశిస్తాను. మంగళా కందూర్ గారి "స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలు" అను వ్యాసం చదివితిని. చాలా బావుంది. నిజంగా ఆవిడ చెప్పినట్లు స్త్రీలకు ప్రత్యేకంగా గ్రంథాలయాలు పెడ్తే చాల బాగుంటుంది. పంచాయతీబోరువారు ఈ విషయమై శ్రద్ధతీసుకొనుట చాల అవసరం.

— పద్మావతి, (ఆకునూరు).

## నా అభిప్రాయము

'పక్కింటివారి పుస్తకపఠనము' అను వ్యాసం చాల బాగా వ్రాసిరి. పుస్తకములు తీసుకొని వెళ్ళునపుడు వుండు జాగ్రత్త తిరిగి ఇచ్చేటప్పుడు వారికి ఉండాలని ఎందుకు తట్టదు. మన మనస్సు ఎంత బాధ పడుతుందో వారికేం తెలుసు. అదే వారి పుస్తకమయితే ఎంతో జాగ్రత్తతో చూచుకుంటారు కదా. లక్ష్మిగారు వ్రాసిన వ్యాసమునకు కొందరయిన మారవచ్చునని నా అభిప్రాయము.

— టి. పద్మకుమారి
(రామచంద్రపురం)

## వంటలు

శ్రీమతి పి. అనసూయ గారు వ్రాసిన రకరకాల వంటకాలలోని "సగ్గుబియ్యం హల్వా" మా అక్కయ్యకూతురి పుట్టిన రోజు పండుగ కానుకగా (11-9-57) చేశాను. చాలా బాగుందని మా ఇంటిల్లిపాది ఎంతో కొనియాడారు. ఇటువంటి క్రొత్త వంటకాల్ని కనిపెట్టినందుకు అనసూయ గారికి ఆంధ్రపత్రిక ద్వారా అభివందనములు తెల్పుతున్నాను.

— బాలకి గిరిజ, విజయవాడ.

## సులభంగా

సగ్గుబియ్యం వడియాలుగురించి 4-9-57 ఆంధ్రవారపత్రికలో శ్రీమతి ఎస్. కె. లక్ష్మికాంతంగారు రాసినవిధము చదివినాను. తయారుచేయు విధము బాగుంది. కాని ఎండబెట్టడం గురించి ఒకసూచన: మంచము మీద తడి బట్టవేసి వడియాలుపెట్టి ఆరోజు అంతా ఎండనిచ్చి, ఆమరుచటి రోజు వడియాలుపెట్టిన బట్ట త్రిప్పి చన్నీళ్లు జల్లి జాగ్రత్తగా తీసి, చాటలో ఎండపెట్టమని రాసినారు. కాని అంతకన్న సులభపద్ధతి ఏమనగా వడియాలుపెట్టే ముందు డబ్బారేకులు శుభ్రముగా కడిగి వుంచవలెను. ఆ రేకులకు నెయ్యినీళ్లుగాని లేక నూనినీళ్ళుగాని కలిపి రాసి వాటిమీద మనకి కావలసిన సైజులలో పెట్టువలెను. బాగా ఎండకాచి సాయంకాలమునకు ఎండిపోవును. అటు తరువాత పదునైన అట్లకాడతో చుటూ గోకితే సులువుగా విరిగిపోకుండా వడియాలు ఊడివచ్చును. ఆ మరునాడు మళ్లీ 1-2 గంటలు ఎండపెట్టిన తరువాత డబ్బాలో వేసుకొంటే చాలనాళ్ళు పాడైపోకుండ వుంటాయి. ఏ వడియాలకైన డబ్బారేకుల మీద నూనెరాసి పెట్టటము అతిశ్రేష్ఠమైనది. నూనెమీద వేగంగా ఎండిపోవును. విరగకుండా సులువుగా ఊడివచ్చును.

— శ్రీరంగం సూర్యకాంతం,
రాయ్‌రంగ్‌పూర్ (పశ్చిమబెంగాల్)

* * *

"ఉత్తరాల దొంగలు" అన్న వ్యాసాన్ని చూచాను. వారు వివరించినట్టు "భార్య రాసే ప్రతిజాబు భార్య ఏమన్నా అనుకున్నా, మనస్సుండబట్టక చదివి కాని పోస్టులో వెయ్యరు ఆభర్తలు" ఈ వాక్యంలోని వారి భావాలతో ఏకీభవించలేకపోతున్నా. కాని భర్త జేబులోని ఉత్తరాలను పరికుగా పసికట్టి తీసికొనిపోయి తలుపు చాటులలోను, పరదాల ప్రక్కలను చదువుకుంటూ, మారాములు చేస్తూ వుంటారు ఆ భార్యలు. ఈ ఉత్తరాల దొంగను ఆడమగ అన్న విచకుత లేకుండా రెండు జాతులలోను కన్పిస్తూ వుంటారు. యథార్థాన్ని బాగా వెల్లడించారు. వ్యాసాన్ని చదువరులకు బాగా అందెంచినందుకు వారికి నా అభివందనాలు.

— కానూరి అచ్చన్న, ఏలూరు. ★




## ఏది గొప్ప?

పిల్లలన్ని వెంటరాగ
కల్లదాటితోటలో,
కుక్కుటంబు పురుగుబుట్ట
బొక్కుచుండె నంతలో,

మరుగునుండి గుంట నక్క
నరగున పైబడరాగా,
కడుపు తీపికొద్ది కోడి
వడిగముందు దూకగా,

ప్రాప్తించిన కోడిపెట్ట
పదివేలంచును నక్క,
కళ్ళు మూసి తెరచునంత
వెళ్ళిపోయె నట్టుప్రక్క.

తల్లి చావుకెంతో వగచి
పిల్లయొకటి మదిని తలచె:
ఫేరవంబు నెటులనైన
మారణంబు చేయగా.

మరుదినంబు కోడిపిల్ల
తిరుగుచుండె తోటలోన;
అరుగుదెంచి గుంటనక్క
ఉరకబోయె దానిపైన.

ఒక్క ఎగుడు ఎగిరిపైకి
ప్రక్కపెరటియందు దూకి,
చక్కగాను కడవయందు
నక్కియుండె కోడిపిల్ల.

ఆత్రముగను నక్కమట్టి
పాత్రలోన తలను దూర్చ,
మూతి చిన్నదగుట నక్క
మూతి కడవయందు చిక్క.

నక్కియున్న కోడిపిల్ల
రక్కరక్క గోళ్ళతోడ,
లొక్కచేసి నక్కకళ్లు
అక్కసంబు దీర్చుకొనియె.

అంధురాలు గుంటనక్క
అందే పడియుండ ప్రక్క,
నందునున్నవారు చూచి
చావగొట్టి చనిరి వేడ్క.

శక్తికేమి గాని భువిని
యుక్తి యున్న చాలు బాల!
యుక్తి ముందు శక్తులన్ని
ఏమి చేయలేవు చాల.

కె. శ్రీనివాసులు




విజయుడు తన ప్రయాణం కొనసాగించి మాయారాజ్యం జేరాడు. మాయావి ఆతనికి సైన్యంలో ఒక చిన్న ఉద్యోగ మిచ్చాడు.

విజయుడు చేయునది చిన్న ఉద్యోగమేమైనా, ఆతని బలపరాక్రమాలు మహావీరులను గూడ అచ్చెరువొందిస్తున్నాయి.

విజయుని శక్తి సామర్థ్యాలు చూచి మహాసేనానియైన కుమతి

నండూరి విఠల్ బాబు

అసూయచెందాడు. అతడు రాజకుమార్తెలలో కడగొట్టుదైన సుందరిని ప్రేమించి ఉండుటచేత విజయునిపై అతని అసూయ మిన్నుముట్టి, మాయావితో యాతనిపై కొండెములు చెప్పసాగాడు.

ఒకరోజు మహాసేనాని మాయావి దగ్గరకుపోయి "మహాప్రభూ! విజయుడు పలుకుతున్న డంబములకు అవధులు లేవు. ఒకే ఒక రాత్రిలో అరణ్యమంతా ఛేదించి భూమి సేద్యంచేసి, గోధుమ పండించి - రొట్టెలు తయారు చేస్తాడట!" అని చెప్పాడు.

విజయుని వెంటనే తనముందు హాజరుకమ్మని మాయావి కబురంపాడు.

విజయుడు వచ్చాడు.

అతన్నిచూచి రాజు "ఓ, యువకుడా! నీ డంబముల కంతులేదట. ఒకేఒక రాత్రిలో అరణ్యమంతా ఛేదించి - భూమి సేద్యం చేసి, గోధుమ పండించి-రొట్టెలు తయారు చేయగల వీరుడవట! రేపు తెల్లవారునప్పటికి - ఈ పురమున కుత్తరముగ ఉన్న యరణ్యమును ఛేదించి, గోధుమ పండించి, ఉదయముననే నాకు రొట్టెలను తెచ్చిపెట్టాలి. లేకుంటే నీతల తీయించి కోటగుమ్మానికి కట్టాను" అని ఆజ్ఞాపించాడు.

విజయుడు తానట్టి డంబము లెప్పుడు పలుకలేదని-ఎంత మొత్తుకున్నా - మూర్ఖుడైన మాయావి వినలేదు. విజయుడు చేసేదిలేక తిరిగి వచ్చి విచారవదనంతో ఒక తోటలో కూర్చున్నాడు.

మాయావి కడపటి కుమార్తె సుందరి విజయుని దగ్గరకొచ్చి "ప్రియతమా! ఎందులకు విచారముగా ఉన్నావు?" అని అడిగింది.

విజయుడు "సుందరీ? ఏమని

చెప్పను. ఏమిచెప్పినా నా కష్టమును తీర్చువా రెవ్వరు?" అన్నాడు.

సుందరి మరీమరీ అడగగా, విజయుడు తన దుఃఖకారణం ఆమె కెరిగించాడు.

సుందరి పకాలున నవ్వి "పిచ్చివాడా! ఈమాత్రానికే ఇంత విచారిస్తున్నావా? ముందున్నది అసలైన ప్రమాదం. నీవుపోయి రాత్రంతా నిశ్చింతగా నిద్రించు" అనిచెప్పి పంపివేసింది.

సుందరి అర్థరాత్రి అరణ్యానికి పోయి బిగ్గరగా పిలచింది. పుట్టలో నుండివచ్చేచీమల్లాగ వేలాదిరైతులు బిలబిలమని రాసారుగా. క్షణంలో వారు అరణ్యమంతా ఛేదించి విత్తులు నాటారు. మరుక్షణంలో పంట పండింది. రైతులు పంట కోస్తూ ఉన్నారు. ఆ అరణ్యమంతా ఈగలు రొదచేస్తూ ముసురుతున్న తేనెపట్టువలె ఉంది. తెల్లవారేసరికి గోధుమ రొట్టెలు సిద్ధమయ్యాయి.

విజయుడు ఆ రొట్టెలను తీసుకుపోయి మాయావి రాజున కిచ్చాడు. ఆత డంతులేని ఆశ్చర్యంతో ఆ రొట్టెలను తిని ఎంతో రుచిగా ఉన్నవని మెచ్చుకొన్నాడు.

మహాసేనాని యీ సంగతి విని అగ్గిపై గుగ్గిలం అయ్యాడు. కాని అప్పు డేమీ చేయజాలక సమయం కొరకు వేచిఉన్నాడు.

ఒకరోజున మహాసేనాని రాజు దగ్గరకు పోయి "మహాప్రభూ! మొన్నటి విజయం సాధించిననాటి నుండి విజయుని గర్వం పెరిగిపోయింది. ఒకేఒకరాత్రిలో గాలితో ఓడనిర్మించి ఆకాశంలో దేశమంతా తిరిగి రాగలనని గొప్పలు చెబుతున్నాడు" అని చెప్పాడు.



జి. సౌభాగ్యవాణి

—ఫొటో: బాబు]

మాయావి మళ్ళీ విజయుని పిలిపించి "ఓయీ! ఒకేఒక రాత్రిలో గాలితో ఓడనిర్మించి ఆకాశంలో ప్రయాణంచేసి దేశమంతా తిరిగి రాగలనని గొప్పలు చెబుతున్నట్లు విన్నాను. నీవు రేపు తెల్లవారు లోపున ఓడను నిర్మించి ఆకాశంలో దేశమంతా తిరిగి రాకపోతే నీశిరస్సు తీయించి కోటగుమ్మానికి కట్టిస్తాను" అని పలికాడు.

విజయుడు తా నెప్పుడు అలాంటి డంబములు పలుకలేదని మొత్తుకొన్నాడు. కాని ప్రయోజనం లేకపోయింది. చేయునదిలేక తిరిగిపోయి ఒక తోటలో విచారంగా కూర్చున్నాడు. సుందరి అచ్చటకు వచ్చి విజయునిచూచి విచారకారణం ఏమని అడిగింది.

విజయుడు జరిగినదంతా చెప్పాడు సుందరి పకాలున నవ్వి "పిచ్చివాడా! ఎందుకంత భయపడుతున్నావు. నీవుపోయి నిశ్చింతగా నిద్రించు. నీ కేప్రమాదం జరగదు" అని నచ్చచెప్పి పంపింది.

విజయుడు వెళ్ళిపోయాడు.

సుందరి అర్థరాత్రి అరణ్యానికి పోయి బిగ్గరగా పిలిచింది. తిరిగి బిలబిలమని వేలాది వడ్రంగులు వచ్చారు. వారందరిదగ్గర తలకొక గండ్రగొడ్డలి ఉంది. దానితోవారు చెట్లను నరికి క్షణంలో ఓడ సిద్ధం చేశారు. అది ఏమిచిత్రమోగాని ఓడ కొయ్యతో చేయబడినట్టుగా లేదు. గాలితో చేయబడినట్లున్నది. ఆ వడ్రంగు లంతటి నేర్పరులన్న మాట. సుందరి ఓడను విజయున కిచ్చింది. తెల్లవారకముందే విజయుడా గాలిఓడ నెక్కి దేశమంతా సంచారంచేసి తిరిగి అంతఃపురానికి వచ్చాడు.

మాయావి అత్యంతాశ్చర్యంతో ఓడ బాగున్నదని మెచ్చుకొన్నాడు.

మహాసేనాని విజయుని విజయాన్నిచూచి మండిపడ్డాడు.

మాయావి "విజయా! ఈవిచిత్ర నౌకలో మనమొకసారి ప్రయాణం చేద్దాం రా" అని మహాసేనానిని కూడా ఓడ నెక్కమన్నాడు.

ముగ్గురు ఓడ నెక్కారు. ఓడ వాయువేగాన ఆకాశాని కెగిరిపోయింది.

మాయావి మహాసేనానిని - విజయుని చూచి "మీ రిద్దరు ఇపుడు ద్వంద్వయుద్ధం చేయాలి. ఎవరు విజయమందితే వారికి నాముగ్గురు కుమార్తెలలో కోరుకొన్న కన్య నిచ్చి కల్యాణం చేస్తా"నన్నాడు.

మహాసేనాని మీసం మెలిపెట్టాడు. విజయుడు జబ్బలు చరిచాడు. వారిద్దరు ఆకలిగొన్న పులులవలె ఒకరిపై ఒకరు పోరునకు తలపడ్డారు. యుద్ధం భయంకరంగా

## ★ అపూర్వ సుందరి

సాగుతోంది.

ఓడ ఆకాశంలో వేగంగా పరుగెత్తుతోంది.

ఒకక్షణం విజయుడు అపజయం పొందుతాడని అనిపించింది. మరుక్షణమతడు విజృంభించటంతో, విజయమతనిదే అనిపించింది.

చివరకు విమానం సముద్రంపై పోతోంది. అందులో తిమింగిలములు మొసళ్లు-గుంపులు గుంపులుగా చేరి ఉన్నాయి. పైన గాలివోడపై యుద్ధం జరుగుతూవుంది. చివరకు విజయుడు మహాసేనానిని చావమోది క్రిందకు నెట్టాడు. మరుక్షణమా సముద్రమునందలి మొసళ్లు ఆతనిని ముక్కలుగా చీల్చి కబళించి వేశాయి.

మాయావి విజయుని అభినందించి "విజయా! రేపుదయం అంతఃపురానికివచ్చి నా ముగ్గురుకుమార్తెలలో నీ కెవరుకావాలో కోరుకో" అని చెప్పాడు.

గాలివోడ తిరిగి రాజధాని చేరింది. ఆరాత్రి సుందరి విజయుని కలుసుకొని "ప్రియా! మాతండ్రి రేపుదయం మమ్ము ముగ్గురను మూడు లేడిపిల్లలుగా చేస్తాడు. నాకుమాత్రం నొసట నొక మచ్చ ఉంటుంది. నీవది గమనించి నన్నే కోరుకో" అని చెప్పింది.

మరునాడు విజయుడు అంతఃపురానికి వెళ్ళగా మాయావి ముగ్గురు కుమార్తెలను లేడిపిల్లలుగా మార్చివేశాడు.

సుందరి చెప్పినట్లు విజయుడు "ఆ లేడి నాక్కావాలి" అన్నాడు.

మాయావి మరునాడు రమ్మని విజయుని పంపివేశాడు.

ఆరాత్రి సుందరి తిరిగి విజయుని కలుసుకొని "ప్రియా! రేపు మా ముగ్గురను మూడు తెల్ల పావురాలుగా మాతండ్రి మార్చివేస్తాడు. నా రెక్కలలో ఒకటిమాత్రం మెరుస్తూ ఉంటుంది. నీవు గమనించి నన్నే కోరుకో సుమా!" అనిచెప్పి వెళ్ళిపోయింది.

తెల్లవారింది. విజయుడు అంతఃపురానికి వెళ్లాడు. మాయావి మూడు పావురాలనుచూపి నీకే పావురం కావాలని అడిగాడు.

విజయుడు సుందరి పావురాన్ని కోరుకొన్నాడు. మాయావి అతన్ని రేపు రమ్మని పంపివేశాడు.

ఆరాత్రి సుందరి విజయుని దగ్గరకువచ్చి "ప్రియా! రేపు మాతండ్రి మాముగ్గురనూచూపి ఒకతెను కోరుకొమ్మంటాడు. మేము ముగ్గురమూ ఒకేపోలిక కలిగి ఉండుటచేత మానవమాత్రుడు మాలో ఏఒక్కరినీ పోల్చుకోలేడు. నేను తెల్లటి చేతిరుమాల ధరిస్తాను. నీవు గమనించి నన్నుమాత్రమే స్వీకరించుసుమా!" అనిచెప్పి వెళ్లిపోయింది.

మరునాడు విజయుడు అంతఃపురానికి వెళ్ళాడు. మాయావి తన ముగ్గురు కుమార్తెలనూ, చూపి ఒక కన్యను ఎన్నుకొమ్మన్నాడు.

విజయుడు చేతిరుమాల ఆధారముగా సుందరిని తనకన్యగా వరించాడు.

మాయావి మహానందభరితుడై ఆనాడే, సుందరిని విజయునకిచ్చి మహావైభవంగా వివాహం చేశాడు.

ఒకనాడు విజయుడు తనరాజ్యానికి పోవుటకు నిశ్చయించుకొని తన నిర్ణయాన్ని మాయావి కెరిగించాడు.

మాయావి ఆమాటవిని ఉగ్రుడై "సుందరి నీకు కావలెనంటే నీవీ రాజ్యంలోనే ఉండిపోవాలి. నా బిడ్డనుమాత్రం పంపను" అని చెప్పాడు.

ఆరాత్రి విజయుడు భార్య సుందరిని పంచకల్యాణి గుఱ్ఱంపై ఎక్కించుకొని పారిపోయాడు.

తెల్లవారిన పిదప మాయావికీవార్త తెలిసింది. అతడుగ్రుడై— విజయుని బంధించి తెండని సైనికులను పంపాడు.

సైనికులు విచ్చుకత్తులు ధరించి జవనాశ్వముల నెక్కి విజయుని వెంబడించారు.

సుందరి "విజయా! చెవులను భూమికానించి విను" అని చెప్పింది.

విజయుడట్లే చేసి "గుఱ్ఱాలు పరుగెత్తుకొని వస్తున్నట్లు డెక్కల చప్పుడవుతున్నది" అని చెప్పాడు.

సుందరి తన మంత్రబలంతో విజయుని గులాబిచెట్టుగా మార్చి తాను ఆచెట్టునకు గల పూవుగా మారింది.

మాయావిసైనికులు వెదకివెదకి విఫలులై తిరిగిపోయి "ప్రభూ! ఒక వింత గులాబిచెట్టు—దానికొక రంగురంగుల గులాబీ మాత్రమే కన్పించింది. విజయుని జాడ తెలియలేదు" అని విన్నవించారు.

మాయావి మండిపడి "ఓరీ, మూర్ఖులారా! సుందరి చేసిన

కుతంత్ర మది. వెంటనేపోయి ఆ గులాబిచెట్టును మొదలంట నరికి తెండి" అని చెప్పి పంపాడు.

మాయావిసైనికులు తిరిగి విచ్చు కత్తులు ధరించి అశ్వములనెక్కి బయలు దేరారు.

విజయుడు గుఱ్ఱపు డెక్కల చప్పుడు విని "సుందరీ! మరల గుఱ్ఱపు డెక్కల శబ్దం విన్పిస్తోంది" అని చెప్పాడు.

సుందరి సిపాయీలు వస్తున్నారని గ్రహించి విజయుని సంపెంగ చెట్టుగా మార్చి, తాను ఆ చెట్టునకు గల ఒకే ఒక సంపెంగపూవుగా మారింది.

సిపాయిలు తిరిగి మోసపోయి మాయావివద్దకు పోయి "ప్రభూ! మాకు వారిజాడ కన్పించలేదు. కాని ఒక అపూర్వమైన ఒక రంగురంగుల సంపెంగపూవు కన్పించింది" అని చెప్పిరి.

మాయావి మహోగ్రుడై "మూర్ఖశిఖామణులారా! సుందరి మళ్ళీ మోసగించింది. ఇక నేనే స్వయంగా బయలు దేరి వారిని బంధించి తెస్తాను" అని బయలు దేరాడు.

విజయుడు తిరిగి భూమిపై చెవి నుంచి "సుందరీ! మరల గుఱ్ఱపు డెక్కల శబ్దం విన్పిస్తున్నది. ఇంతకు ముందుకంటె వేగంగా బిగ్గరగా విని పిస్తోంది" అన్నాడు.

సుందరి ఆమాట విని కంగారు పడి, "విజయా! కొంప మునిగింది! నాతండ్రి మహోగ్రుడై శరవేగంతో వస్తున్నాడు. ఏమి చేయటానికి తోచటం లేదు. ఆయనను మనమింక మోసగింపలేము" అని వాపోయింది.

విజయుడు "సుందరీ! దిగులొందకు. నా ఖడ్గబలంతో నీ తండ్రిని జయించి, నిన్ను రక్షిస్తాను" అని ధైర్యం చెప్పాడు.

సుందరి "పిచ్చివాడా! నాతండ్రి మహామాయామంత్ర సంపన్నుడు. ఆతనితో పోరి గెలిచేవారీముల్లోకాలలో లేరు" అని చెప్పుతుండగా ఆమెకొక చక్కటి ఊహ కలిగింది.

సుందరివద్ద మూడు విచిత్రమైన వస్తువు లున్నాయ్. ఒక కుంచె-ఒక దువ్వెన - ఒకధోవతి - ఆ విషయం జ్ఞప్తికి రాగానే ఆమె కన్నులు ఆశతో మెరిశాయ్.

సుందరి తన వద్దగల కుంచెతో నేలపై తుడిచింది. ఆ ప్రదేశంలో చీమకూడా దూరరాని చిట్టడవి పుట్టింది. మాయావి దానిని దాటి రాలేడు. ఆ మహారణ్యంచుట్టి రావడానికి మూడు సంవత్సరాలు పట్టుంది.

మాయావి మిక్కిలి కష్టముతో ఆ అరణ్యం ఛేదించి, తిరిగి సుందరీ-విజయులను వెంబడించసాగాడు.

ఒకబారెడుదూరంలో మాయావి గుఱ్ఱం వెన్నాడుతూ ఉంది. ఇంతలో సుందరి తన వద్దగల దువ్వెనతో నేలపై తుడిచింది. ఒక మహోన్నతమైన పర్వత మచ్చట పుట్టింది. ఆ పర్వతంచుట్టి వచ్చుటకు మూడు సంవత్సరాలు పడుతుంది. మాయావి ఆ కొండను బ్రద్దలుకొట్టి తిరిగి సుందరీ - విజయులను వెంబడించ సాగాడు.

సుందరి తన ధోవతితో నేలపై తుడిచింది. కన్నుమూసి తెరచునంతలో అచట ఒక మహాసముద్రం ప్రత్యక్షమైంది.

ఆ సముద్రాన్ని దాటుట సాధ్యం కాక నిరాశతోనూ, అవమానంతోనూ, మాయావి తన రాజ్యానికి తిరిగిపోయాడు.

విజయుడు తన స్వగ్రామం చేరగానే, సుందరి "ప్రియా! గృహంలో ప్రవేశించగానే చిరకాలానికి కలుసుకొన్న ఆనందంతో తల్లి దండ్రులను నీవు కౌగలించుకొంటావు. కాని ఒక్కమాట! నీవు తల్లిని మాత్రం కౌగలించుకోవద్దు. అట్లు చేసినచో నన్ను గురించిన విషయాలన్నీ నీవు మరచిపోతావు" అని

# ★ అపూర్వ సుందరి ★

హెచ్చరించి పంపింది.

విజయుడు గృహంలో ప్రవేశించాడు. ఆ ఆనందంలో తల్లినిగూడ కౌగలించుకొన్నాడు.

ఫలితంగా ఆతడు సుందరిని మరచిపోయాడు.

పాపము! సుందరి భర్తకై నిరీక్షిస్తున్నది. మూడు దినాలు గడచినా భర్తవచ్చి తనను లోనికి తీసుకొనిపోలేదు. సుందరి దుఃఖించి, ఆ ఊరిలో ఒక పూటకూళ్ళ [illegible]లమ్మ యింట దాసీగా కుదిరింది.

ఇంతలోవిజయునికితల్లిదండ్రులు పెండ్లిచేయ నిశ్చయించి, కన్యను నిర్ణయించి, ఏర్పాట్లు కావించారు.

సుందరి బిచ్చకత్తెయై పెండ్లి పందిరిలోనికి వచ్చి ముష్టి అడిగింది. విజయుడు ఒక వెండిగిన్నెనిండా పాయసం పోసి ముష్టిదానికిచ్చాడు.

ముష్టిది ఆ పాయసాన్ని గాలిలో పారబోయగా, అందుండి రెండు తెల్లపావురములు పుట్టాయి.

విజయుడు మిగుల ఆశ్చర్యం పొందాడు. అందులో ఒకపావురము తన పెట్టను "ప్రియురాలా! నన్ను ముద్దుపెట్టుకో" అని పిలిచింది. రెండవ పావురం "ఛీ! మీ మగవారిని నమ్మరాదు. వర్తకుని కుమారుడైన విజయుడు మాయావి కుమార్తె సుందరిని మర్చిపోలేదా? అట్లాగే నీవు నన్ను మర్చిపోతావు. నిన్ను నమ్మను—పో" అని ఎగిరిపోయింది.

ఈమాట వినేసరికి విజయునికి జరిగిందంతా స్వప్నములోని కథలా గుర్తునకు వచ్చింది. మరుక్షణంలో విజయుడు ముష్టిదాన్ని గుర్తుపట్టి-ఆమెను కౌగలించుకొని తనను క్షమించమని ప్రార్థించాడు.

సుందరి "జరగవలసినది జరిగితీరుతుంది. ఇందులో మీ లోపమేమి ఉంది?" అని చెప్పింది.

ఆరోజే అదే ముహూర్తానికి, విజయుడు సుందరిని మహావైభవంగా పెండ్లాడాడు. వారిద్దరు అన్యోన్యముగా చిరకాలం సంసారంజేసి, సుఖించారు.

[ఒక చిన్న రష్యన్‌కథ ఆధారంగా.]

# సినిమా

## నూతన్ స్విట్జర్లాండ్ ప్రయాణం

ఇరవై యేళ్ళబాల నూతన్, నెల్లాళ్ళ విశ్రాంతి కోసం, స్విట్జర్లాండ్ వెళ్ళబోతోంది. ఎక్కువరోజులు జూరిచ్ నగరంలోనే కాల క్షేపం చేస్తుందట.

రెండుమూడేళ్ళనాడు నూతన్‌కు 'వర్ధమాననటి' అని విశేషణం ఉండేది. ఆ విశేషణంతో పనితీరి, నేటి ఈ స్థాయిని అందుకునేలోగా, అప్పట్లోనే ఒకసారి ఆమెకు జబ్బుచేసింది. ఆతురాలై ఆమె సంరక్షకురాలు అయిన తల్లి శోభనసమర్థ్, తక్షణం ఫిలింకంట్రాక్టులూ, ఉజ్వలభవిష్యత్తు, అన్నీ ఓ పక్కకి నెట్టేసి, కుమార్తెను స్విట్జర్లాండు పంపేసింది. జూరిచ్‌లో చికిత్సపొంది, విశ్రాంతి తీసుకుని నూతన్ కోలుకొంది. మంచి ఎత్తరి అయిన యువతిగా పెరిగింది. అప్పట్లో అక్కడే చదువుకూడా సాగించింది. స్విస్ యువతులూ, యితర యూరపియన్ యువతులూ చాలమంది ఆమెకు స్నేహితురాళ్లయారు. అయితే, వాళ్ళెవరికీ చాలకాలంవరకూ నూతన్ 'ఫిలింస్టార్' అని తెలియదు. తరవాత ఆమె తన చెల్లెలు తనూజను జూరిచ్ పిలిపించి అక్కడ బడిలో చేర్పి తాను బొంబాయి వచ్చేసింది. తనూజ మొన్న వేసంగులకు బొంబాయి తిరిగివచ్చింది. దూరదృష్టిగల

## బొంబాయి సినిమాలేఖ

శోభనసమర్థ్ దూరం ఆలోచించి, మొన్ననే ఒక కొత్త చిత్రం నిర్మాణం ఆరంభించి, తన రెండవతనయ తనూజచేకూడా ఆచిత్రం ద్వారా చలనచిత్రసీమలో పాదం పెట్టించింది. ఆమె తొలిచిత్రంలో నూతన్‌ను పరిచయంచేయడం విదితమే. సరే ఈ ప్రారంభోత్సవం కాగానే, తనూజను తిరిగి జూరిచ్ పంపివేసింది. నూతన్, తనూజ కలసే లండన్‌లో భారతీయ చలనచిత్రోత్సవాలకు వెళ్లారు. అక్కడనుండీ జూరిచ్ వెళ్లారు.

## సి..నీ..మః: లేక కథకుడి కథ...

అమెరికాలో ఒక వెస్టర్న కథల పత్రికలో చాలుగెల్లనాడు చిన్నకథ ఒకటి అచ్చుఅయింది. దానిపేరు "3-10 టు యుమా" ఒక టెలివిజన్ ప్రొడ్యూసరు ఆకథను 4 వేల డాలర్లకు కొని ప్రదర్శించాడు. తరవాత అతడు దానికి స్క్రిప్టు వ్రాయించి ఒక హాలివుడ్ ఫిలింకంపెనీకి అమ్మాడు. అప్పుడు పది వేల డాలరు పలికింది. ఆకంపెనీ వాళ్లు దాన్ని ఫిలిం తియ్యలేక ఇంకో పెద్ద కంపెనీకి అమ్మివేశారు. అప్పుడు దాని ధర లక్ష డాలర్లు.

ఇంతకీ అసలు ఆ కథను రాసిన ఆసామికి ఈ బేరాలలో ఒక్క సెంటుకూడా విదల్చినవాళ్ళు లేరు. అతని పేరేమిటో తెలియరాలేదు కాని అందులో గ్లెన్‌ఫోర్డ్, వాన్ హెఫ్లిన్ ప్రభృతులు నటించారు.

## షమ్మీకపూర్ పులివేట

నటుడు షమ్మీకపూర్, నటి, అతడి సతీ అయిన గీతాకపూర్, భోపాల్ పరిసరారణ్యాలలో పులిని వేటాడడానికి బయలుదేరి వెళ్లారు. వేట అంటే సరదావున్న జంట బొంబాయి చిత్రసీమలో ఇదొక్కటే. ఇంతవరకూ వాళ్లు నాలుగు చిరతపులులను, రెండు మొసళ్లను, బోలెడన్ని రాబందుల్ని వేటాడారు. ఈసారి ఏమైనాసరే పులిని కొట్టి తీరాలని పంతంపట్టి బయల్దేరారు.

* * *

"అల్లరి మానేసి ఇద్దరూ హాల్లో కూర్చుని ఆడుకోండి. కాఫీ చెయ్యాలి" అంది అనగనగా ఓ అమ్మాయి.

"ఇది నాయిల్లు. నాయిష్టంవచ్చినంత అల్లరి చేస్తాను" అన్నాడు ఆ అమ్మాయి మొగుడు—'కదురా బాబూ' అంటూ కులదీపకుడి వంక చూస్తూ.

"అయితే కానియ్యండి. చూస్తూ కూచుంటాను" అన్నది అర్థాంగి ప్రణయకోపం నటిస్తూ.

"నువ్వు చెప్పేదేమిటి...అలా అయితే అసలు అల్లరి చెయ్యను. ఇలా బుద్ధిగా కూర్చుంటాను."

"నాకేం అభ్యంతరం లేదు" అని ఆ అమ్మాయి మూతిముడుచుకు కూర్చుంది.

అమ్మా నాన్నా కజ్జా లాడుకోవడం ఓ క్షణంచూశాక, సునీల్ కేమీ తోచలేదు. "వానీ చేసుచేస్తా అల్లరి" అన్నట్టుగా (అనడం ఇంకా చేతకాదు.) దగ్గరలో ఉన్న ఓ పుస్తకాన్ని విమర్శించడానికి సిద్ధపడ్డాడు.

విక్రం ప్రొడక్షన్స్‌వారి "కుటుంబ గౌరవం" చిత్రంలో సావిత్రి



ట్వెంటియత్ సెంచరీ ఫాక్స్‌వారు జాన్ స్టీన్‌బెక్ నవల ఆధారంగా నిర్మించిన "వేవర్డ్ బస్" చిత్రంలో జేన్‌మాన్స్‌ఫీల్డ్.

'అరెరె...ఆ పుస్తకం చింపకు' అంటూ ఒక్కసారి అమ్మానాన్నా ఎగిరి గంతేశారు కొడుకుదగ్గరకి. ఆ క్షణంలో ఇద్దరూ నిష్కారణంగా కిలకిల నవ్వడం మొదలు పెట్టారు.

ఈసారికూడా సునీల్‌కి వాళ్ళెందుకు నవ్వారో బోధపడలేదు. మనకెందుకులే అనుకున్నాడు దగ్గరోఉన్న బొమ్మ తీసుకుంటూ.

అలా నవ్వులూ, అప్పుడప్పుడు పాటలూ, ఉండుండి కీచులాటలూ, వాదాలు ప్రతివాదాలతో కలకలలాడే ఆ కుటీరంలోవుండే దంపతులు దేవానంద్, కల్పనా ఆనంద్‌లు. వాళ్ళెప్పుడూ ఇంతే. ఒకప్పుడు వాళ్ళ పెళ్ళి బొంబాయి చిత్రసీమలో సంచలనం కలిగించింది. అప్పుడు "టాక్సీ డ్రైవర్" చిత్రం తయారవుతోంది. అర్ధరాత్రి వేళ, ఆ చిత్రం సెట్ వివాహవేదికగా, దర్శకుడూ, ఇతర చలనచిత్ర కారులూ సాక్షులూ ప్రేక్షకులుగా పెళ్ళి జరిగింది. దేవానంద్ గురుదాస్‌పూర్ గ్రామస్థుడు. పంజాబీ. బి. ఏ. ఆనర్సు ప్యాసయ్యాడు అతని కుటుంబంలో అంతా విద్యాధికులే. ఇద్దరు సోదరులు చేతన్ ఆనంద్, విజయానంద్ చలనచిత్ర దర్శకులు. దేవానంద్ భార్య కల్పనది కూడా పెద్ద కుటుంబం. ఆ అమ్మాయి అసలు పేరు మోనా. ఏడుగురు అన్నదమ్ములూ, ముగ్గురు అక్కచెల్లెళ్ళూను. అన్నదమ్ములంతా రక్షణశాఖలో పెద్ద ఉద్యోగస్థులు. సైనిక, నావిక, వైమానిక శాఖలలో దేని తాలూకు కార్యాలయానికి వెళ్ళినా ఈ ఏడుగురిలోను ఎవరోఒక అన్నదమ్ముడు ఎదురై పలకరిస్తాడు.

మోనాను చలనచిత్రాలలో చేర్చి, కల్పన అని పేరు మార్చినవాడు దేవానంద్ అన్న చేతన ఆనంద్. నవకేతన్‌వారి (దేవానంద్ స్వంత సంస్థ) "బాజీ" ఆమె తొలిచిత్రం. అందులో దేవానంద్ తో కలసి నటించింది. తరువాత ఇద్దరు వివాహం చేసుకోవాలనుకున్నారు. దేవ్ ఇంట్లో పెద్దలు ఒప్పుకోలేదు. కాని పెళ్ళి ఆగలేదు. అతగాడికి నచ్చినవన్నీ ఆమెగారికీ ఇష్టమే. ఆమెకు గిట్టనివంటే అతనికి అంతకన్న గిట్టదు. రుచులలో, అభిరుచులలో వాళ్ళ ఊహాపోహాలు కవలపిల్లల్లా ఉంటాయి. ఒక్క పేకాట విషయంలో మాత్రం, సినిమా కళ అనే వారికీ పరిశ్రమ అనే వారికీ ఉన్నంతటి భిన్నాభిప్రాయాలు. అతనికి మహాయిష్టం. ఆమెకు మహాఅయిష్టం. మిగతా అన్ని విషయాలలోను ఇదగూ ఒకటే. దేవానంద్ షూటింగ్‌కు వెళ్తే ఆమె వెంటనే ఉంటుంది. స్టుడియోలో పనిలేకపోతే పిక్నిక్‌లకూ, చిన్న చిన్న షికార్లకూ వెళ్తారు.

అతనికి ఒక చిత్రంలో పని ఉంటే, ఆమెకు ఇంకోచోట పనిఉండడం జరగదు. ఎందుకంటే, ఇంతవరకూ ఆమె దేవానంద్‌తో తప్ప ఎవరితోనూ నటించలేదు...

'ఏక్ సాల్'

గోయెల్ సినీ కార్పొరేషన్‌వారి 'ఏక్ సాల్'లో అశోక్‌కుమార్ హుషారైన



...హింద్' చిత్రంలో కుంకుం, చంద్రశేఖర్.



భూమిక నిర్వహిస్తున్నాడు. ఇందులో అత నికి నాయిక మధుబాల. హాస్యగాడు జానీ వాకర్.

దర్శకుడు దేవేంద్ర గోయెల్. సంగీత దర్శకుడు రవి.

## రాగిణి

అశోక్ కుమార్ స్వంత చిత్రం "రాగిణి" చురుకుగా తయారవుతోంది. ఇందులో నాయిక పద్మిని మాస్కో నుండి తిరిగివచ్చాక మొన్ననే ఈ చిత్రంలో పని ఆరంభించింది. కిశోర్, నజీర్ హుసేన్, అచల మొదలగు వారు కూడా పాల్గొంటున్నారు. దీని రచన దర్శకత్వం 'రాఖన్' నిర్వహిస్తున్నారు.

సంగీతం: ఒ. పి. నయ్యార్.

## శాంతారాం కొత్త చిత్రం

రాజ్ కమల్ కళామందిర్ వారి కొత్త చిత్రం "మౌసీ"కు గతవారం ప్రారంభోత్సవం జరిగింది. రాజ్ కమల్ అధిపతి శాంతారాం ఇందులో ఇద్దరు కొత్త యువతులను పరిచయం చేస్తున్నారు. ఒకామె పేరు 'వందన'. రెండవ నటి 'శేషము'. ప్రారంభోత్సవం రోజున 'షాట్' చేసిన తొలి సన్నివేశంలో 'వందన' నటించింది. ఈ ఇద్దరూ కాక బెంగాలీ నటుడు బౌనామి చౌధురీని కూడా శాంతారాం ఈ చిత్రానికి తీసుకున్నారు. ప్రముఖ మహారాష్ట్ర రచయిత జి. డి. మద్గూల్కర్ దీనికి కథ వ్రాశారు. సంగీతం వసంత్ (ఝనక్ ఝనక్ పాయల్ బాజే) దేశాయి సమకూర్చుతున్నారు. దర్శకుడు ప్రభాత్ కుమార్. ఛాయాగ్రహణ దర్శకుడు త్యాగరాజ్ పెండార్కర్.

## దో ఆంఖేఁ బారా హాత్

రాజ్ కమల్ వారి వర్తమాన చిత్రం "దో ఆంఖేఁ బారా హాత్" సెప్టెంబరు 27 న విడుదల అయింది. దర్శకత్వం, ఇందులో ముఖ్య భూమిక కూడా శాంతారాం నిర్వహించారు. దీనికి కూడా మద్గూల్కర్ కథ వ్రాశారు. వసంత్ దేశాయి సంగీతం సమకూర్చారు. భరత్ వ్యాస్ పాటలు వ్రాశారు.

సంధ్య, ఉల్హాస్, బాబురావు పెండార్కర్, కేశవరావ్ (తూఫాన్ ఔర్ దీయా) దాతే, ఇందులో నటించారు.



దసరా పండుగకు జమున బొమ్మలకొలువు పెట్టుకుంటోంది.
— ఫొటో: ఎన్. గిరిధర్.

## శారద

ప్రసాద్ ప్రొడక్షన్స పేరిట దక్షిణ భారత దర్శక నిర్మాత ఎల్. వి. ప్రసాద్ నిర్మిస్తూన్న 'శారద' చిత్రం పూర్తి కావచ్చింది. దీపావళివేళకు, కాస్త అటూఇటూగానో విడుదల కావచ్చునని తెలిసింది.

మీనాకుమారి, రాజ్ కపూర్, శ్యామ, ఆగా, ఓంప్రకాష్, అనితాగుహ పాల్గొంటున్నారు. సంగీత దర్శకుడు సి. రామచంద్ర.

* * *

గతవారం "ఆషా", "హిల్ స్టేషన్" అనే రెండు చిత్రాలు విడుదల అయాయి. ఎం. వి. రామన్ నిర్మించిన "ఆషా", బాక్సాఫీసు హంగులతో, రంగుల (గేవాకలర్, టెక్నికలర్) నృత్యాలతో, ఆటలతో పాటలతో కాలక్షేపం మార్కు చిత్రంగా రూపొందింది. సంగీత దర్శకుడు సి. రామచంద్ర, ఇందుకుతగ్గట్టు హుషారైన పాటలు కట్టారు. వైజయంతిమాల నృత్యాలు మనోహరంగా వున్నాయి. నటనకు చోటూ లేదు; అవసరమూ కనబడలేదు. కిశోర్ కుమార్, ప్రాణ్, లలితాపావర్ పాల్గొన్నారు. మినుముంతాజ్ నృత్యంకూడా బాగుంది. పాటలు మన జానపదగీతాలూ, విదేశవాళీ రాక్ అండ్ రోల్ మట్లూ కలగాపులగం చేసిన బాపతుగా వున్నాయి.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



లోక్ ఫిలింస్ వారి "చంగస్"లో కమలాలక్ష్మణ్ నృత్యం.



ఎ. వి. ఎం. వారి
'భూకైలాస్'లో జమున

# సినిమా వార్తలు

నేషనల్ ఆర్ట్ థియేటర్స్ వారు సీతా రాముల పెళ్ళి కథను వెండి తెరకెక్కించ సంకల్పించారు.

"సీతాదేవి జన్మ వృత్తాంతం కూడా కలుపుకొని సమగ్రంగా ఈ మనోహర గాథను రూపొందించడానికి కృషి చేస్తున్నాము" అని నిర్మాత త్రివిక్రమరావు చెప్పారు.

ఇతఃపూర్వం అనుకున్న కార్యక్రమం ప్రకారం "పాండురంగ మాహాత్మ్యం" తరువాత విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు గాథను చలనచిత్రంగా నిర్మించవలసింది.

"అయితే, సీతారామరాజు చరిత్రకు సంబంధించిన సమాచారం యావత్తూ సమగ్రంగా సేకరించవలసి ఉంది. ఆయన సమకాలికులు కొందరు సజీవులై ఉన్నారు. వారందరినీ కలుసుకొని, వారి సూచనలు, సలహాలూ కూడా సంపాదించాలి. లభించిన సమాచారాన్నంతటినీ చిత్రం కథలోకి సవ్యంగా పట్టించి, సద్వినియోగం చేసుకోవాలి. అందువల్ల ఈ చిత్రం నిర్మాణం ఆరంభించడానికి ముందు, ఈ విధమైన కార్యకలాపాలు చాలా జరుగవలసి ఉన్నాయి. ఈ దృష్ట్యా, ఈ చిత్రనిర్మాణం ప్రస్తుతానికి వాయిదా వేసి, ఇప్పుడు 'సీతారామ కల్యాణం' నిర్మించ నిశ్చయించాము" అని ఆయన వివరించారు.

సీతారాముల కథకు మాటలు, పాటలూ సముద్రాల రాఘవాచార్య వ్రాస్తున్నారు.

శ్రీరాముడి పాత్రను ఎన్. టి. రామారావు నిర్వహిస్తారు. రావణ బ్రహ్మ, దశరథుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, జనకుడు ప్రభృతి మహాపురుషుల పాత్ర లన్నిటినీ అగ్రశ్రేణి నటులకు ఒప్పగిస్తారు. ఈ పాత్రలకు విశేష ప్రాధాన్యం ఇస్తూ, సర్వసమగ్రమైన రూపకల్పన చేయాలని నిశ్చయించారు.

ఎన్. ఎ. టి. వారి వర్తమాన చిత్రం "పాండురంగ మాహాత్మ్యం" నవంబరు 28న విడుదల అవుతుంది.

## "వద్దంటే పెళ్లి"

విఠల్ ప్రొడక్షన్స్ వారి హాస్యరస ప్రధాన చిత్రం "వద్దంటే పెళ్లి" ఈ నెలలో విడుదల అవుతుంది.

మొదట్నించి చివర వరకూ నవ్వుతూ నవ్విస్తూ తిరిగే జంటగా కృష్ణకుమారి, చలం ఇందులో చాలా హుషారుగా కథను నడిపారని రషెస్ చూచినవారు చెబుతున్నారు.

ఇది ముగ్గురమ్మాయిల కథ. ముగ్గురూ కలసి చదువుకున్నారు. వాళ్లి ఊహలు వేరువేరు దారులలో పోయాయి. ఒకమ్మాయి భర్తయే దైవమని భర్త పూజ్యుడనిఅంటుంది. ఇంకో అమ్మాయి 'ఉతి నాన్సెన్స్' అంటుంది. మొగుడు డౌనం లే, తాను కాదన్నే పెంకె ఘటం. మూడో అమ్మాయి జల్సామతి...

ఒక చోటనుండి మూడు దిక్కులుగా బయలుదేరిన ఈ అమ్మాయిల కథలు గమ్యస్థానం చేరేక తేలేదేమిటో తెరమీద తెలియాలి. దీనికి మాటలూ పాటలూ రామచంద్, జి. కె. మూర్తి వ్రాశారు. దర్శకుడు విఠలాచార్య. కృష్ణకుమారి, చలం, శ్రీరంజని అమర్‌నాథ్, సూర్యకళ, రమణారెడ్డి, సి. ఎస్. ఆర్. మొదలగు వారంతా నటించారు.

## పెళ్లి సందడి

హాస్యం ప్రధానంగా తయారవుతున్న మరో చిత్రం రిపబ్లిక్ పిక్చర్ వారి "పెళ్లి సందడి."

తాను వలచిన అమ్మాయిని పెళ్లాడడానికి కావలసినన్ని అడ్డంకులు. అవన్నీ దాటి, అక్కాచెల్లెళ్ల అమ్మాయిల బారినుండి తప్పించుకుని బయటపడ్డ ఒక రోమియో కథను ఇందులో చిత్రిస్తున్నారు. రచయిత సముద్రాల జూనియర్. అంజలీదేవి, నాగేశ్వరరావు, చలం, రమణారెడ్డి, గుమ్మడి,



విఠల్ ప్రొడక్షన్స్ వారి "వద్దంటే పెళ్లి" చిత్రంలో కృష్ణకుమారి, గిరిజ



సుధాకర్ ఫిలింస్‌వారి తొలిచిత్రంలో తాగుబోతుజోగులుగా సి. ఎస్. ఆర్.

సి. ఎస్. ఆర్., హేమలత, సురభి బాల సరస్వతి ఇందులో నటిస్తున్నారు. సంగీతం ఘంటసాల. దర్శకత్వం యోగానంద్. వచ్చే వారం కొత్త సెట్‌పై షూటింగ్ ఆరంభిస్తున్నారు. ఇప్పటికి సగం పూర్తి అయిందని నిర్మాత సి. సీతారాం చెప్పారు. ★

## కీ. శే. ఉప్పులూరి సంజీవరావు

"ఇంకొక దీపం ఆరిపోయింది" అన్నారు నాగయ్య; రంగరత్న, రాజహంస ఉప్పులూరి సంజీవరావు స్మృతికి సంతాపం వెలిబుచ్చుతూ.

సంజీవరావుగారు సెప్టెంబరు 11న విజయవాడలో కాలధర్మం చెందారు. ఆయన వయసు 68 సంవత్సరాలు. దాదాపు రెండేళ్లుగా ఆయన పక్షవాతంతో తీసుకుంటూ వచ్చారు.

* * *

"సుబ్బిడి జగ్గరాజు తరువాత తెలుగు నాట నాటకరంగాన్ని ఏలిన మహానటుడు సంజీవరావు. స్టేజిమీద వేషంకట్టి నిలబడితే, ఈ మనిషి ఆడదా? మొగాడా? అని భ్రమ కలిగేది. తొలిసారి నాటకం చూడవచ్చిన వాళ్లు ఓ పట్టాన నమ్మేవారుకాదు సావిత్రి వేషం కట్టింది సంజీవరావు అంటే". అన్నాడు ఆనాటి నాటకాలను వందలకొద్దీ చూచిన ఒక ప్రేక్షకుడు.

సంజీవరావుగారు, సావిత్రి, అనసూయ, గయోపాఖ్యానంలో చిత్రరేఖ పాత్రల నిర్వహణకు పెట్టింది పేరనిపించుకున్నారు. స్థానంవారు శృంగార రస ప్రధానమైన స్త్రీ పాత్రలు నటిస్తే, సంజీవరావుగారు పతివ్రతల పాత్రలలో ప్రత్యేకత, అనన్య సాధ్యమైనశిల్పం ప్రదర్శించేవారు. నడకలో రాయంచవయారం, హావభావాలు ప్రదర్శించడంలో ఆయన ప్రతిభ సర్వత్రా మన్నన లందుకుంది. 'రాజహంస' అనేబిరుదును గడించిపెట్టింది. ఈ హావభావాలకు తోడు, శ్రావ్యమైన కంఠస్వరం తోడై ఆయన ధరించిన పాత్ర మరింత రాణించేది.

స్త్రీ పాత్రలు ధరించే పురుషనటులు ప్రయత్న పూర్వకంగా కంఠం బిగపెట్టి సన్నని స్వరంతో మాట్లాడడం మామూలు. సంజీవరావుగారి కంఠం సహజంగా కొంత సన్నంగా ఉండేది. కొత్తల్లో ఆయన 'రాయించ నడక' నేర్చుకొనడానికని, కాళ్లకి బందాలు వేసుకుని సాధన చేసేవారని, వారి నెరిగినవారు చెబుతారు. అటువంటికృషి, సహజంగాఉన్న ప్రతిభ కలసి ఈ మహానటుడిని రూపొందించాయి. మైలవరం కంపెనీ వారి నాటకాలలో సంజీవరావుగారి సావిత్రిని, యడవల్లి సత్యవంతుడినీచూచిన వారు ఎప్పుడూ మరచిపోరు. ★



యన్.ఏ.టి. వారి "పాండురంగ మాహాత్మ్యం"లో రంగదాసు, రామదాసు

## న్యూఢిల్లీ లేఖ

(6 వ పేజీ తరువాయి)

చూస్తే ఈ సంగతి తెలుస్తుంది.

ప్రజలనుంచి ఋణసేకరణ కూడా అంతంత మాత్రంగానే వుంది. చిన్న మొత్తాల సేవింగ్స్ తగ్గిపోయిందని శ్రీ నందాయే అంగీకరించారు.

ఇక వేతన విచారణ సంఘం సిఫార్సులు చేస్తే, వాటి ఆర్థికఫలితాలెలా వుంటాయో ఊహించలేము. బహుశా గడచిన రెండేళ్లలో అదనపు పన్నులద్వారా వచ్చిన ధనమంతా కేంద్రోద్యోగుల కోర్కెలు తీర్చడానికే అయిపోతుందని ఒకరి అంచనా.

* * *

## అవినీతి నిర్మూలన

అవినీతిని నిర్మూలించడానికి జరిగే ఉద్యమంగూర్చి ఈ మధ్య బోలెడు వింటున్నాం. అసలు రోగాన్ని కాకుండా రోగలక్షణాలను మాత్రమే నయంచేసే వైద్యుడు లాగా ప్రవర్తిస్తోంది ప్రభుత్వం.

ఒకానొక సబ్ అసిస్టెంట్ సర్జన్‌ను బదిలీ చేయరాదని 16 గురు పార్లమెంటు సభ్యులు ఒక మహజరును అధికారులకు అందజేశారట. పార్లమెంటు సభ్యులు దైనందిన పరిపాలనలో ఇలా జోక్యం కలిగించుకోవడం నానాటికీ ఎక్కువౌతోంది.

ఢిల్లీలో ప్రభుత్వ స్థలాలను ఆక్రమణ చెయ్యడంకూడా మితిమీరుతోంది. అలా ఆక్రమించకుండా వారిద్దామంటే పార్లమెంటుసభ్యులే అభ్యంతర పెడుతున్నారు.

న్యూఢిల్లీలో ఇళ్లలోగాని, ఆవరణలోగాని పశువులను ఉంచుకోవడం మునిసిపల్ శాసనాలకు విరుద్ధం. కాని ప్రతి రెండో ఇంట్లోనూ ఒక ఆవు కనిపిస్తుంది ఇక్కడ. ఇలాగే నగరాన్ని పరిశుభ్రంగా ఉంచుదామనే ప్రతిప్రయత్నానికీ ఏదో అడ్డంకే.

ఇందులో అవినీతి ఎక్కడుందని అడగవచ్చు. ఆవరణలో ఆవును అట్టే పెట్టుకున్న ప్రతిగృహస్థూ మునిసిపల్ ఉద్యోగులకు కొంచెం లంచం సమర్పించుకోవాలి. అలాగే ప్రభుత్వస్థలాన్ని ఆక్రమించుకున్న వాళ్ళు కూడా అధికారులకు కొంత ముట్టచెబుతూ ఉంటారు.

అవినీతిని అణచడానికేవో సంఘాలూ అవీ ఏర్పాటుచేయడంతో ఊరుకోక, ప్రభుత్వం తనపార్టీవ్యక్తులే ఓట్లకోసం అవినీతిని ప్రోత్సహించడాన్ని అరికట్టాలి.

న్యూఢిల్లీలో మరొక విచిత్రం. మురికిపేటలను నిర్మూలంచేయడానికి ప్రభుత్వం ఒక వంక కోట్లకొలది ధనం ఖర్చు పెడుతుండగానే, మరోవంక న్యూఢిల్లీ నగరమే మురికిపేటగా తయారవుతోంది. దైనందిన పరిపాలనలో పైవారు కలగజేసుకొని అడ్డంకులు కలిగించడంవల్లనే ఈ మాదిరిగా జరుగుతోంది.

ఉదాహరణకి - ఇండియా గేటు ప్రాంతం చూడండి. చాలా గంభీరమైన, సుందరమైన దృశ్యం అది. కాని ఆ దృశ్య సౌందర్యం చెడగొట్టేవిధంగా అక్కడ కొందరు వండినపదార్థాలను బాహాటంగా అమ్ముతూ, నానా గలీజా చేస్తూ ఉంటారు. ఈ మనుషులు తాము రక్షణార్థులమని ఇంకా చెప్పుకుంటూనే ఉన్నారు. వాళ్ళకి వేరేచోట బసఏర్పాటు చేశారు. కాని వాళ్లు ఇండియా గేటు ప్రాంతం వదిలివెళ్లరు. వాళ్ళు వెళ్లేట్టు చేయగలిగిన అధికారులు తమ పలుకుబడి ఎక్కడ ఖర్చయిపోతుందో అని భయపడి కఠిన చర్యలు తీసుకోరు. వాళ్లకి ఆ ప్రాంత పారిశుద్ధ్యం, సౌందర్యంకంటె తమ స్వప్రయోజనాలే ముఖ్యం. ★

## దేవీ నవరాత్రులు

(7-వ పేజీ తరువాయి)

బంగారాన్ని దేశంలో పంచేవారట. ఆనాటి 'సువర్ణపత్రి' పందారానికీ నాటి జమ్మిపత్రి పందారం చిహ్నంగా నిలిచింది.

సుధాకర్ ఫిలింస్‌వారి తొలిచిత్రానికి శ్రీ సుందరలాల్ నహతా ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు. వెనుకనున్నవారు శివరామన్ ప్రసాద్.



## విజయదశమి గాథలు

యుగ యుగాల్లోనూ ఈ విజయదశమికి సంబంధించిన గాథలనేకం వున్నాయి. దేవ యుగంలో – కల్పాంత కాలంలో విష్ణుకర్ణోద్భవులైన మధుకైటభులనే రాక్షసులు శ్రీ మహావిష్ణువు యోగనిద్రా ముద్రితుడై వున్న అదనుచూసుకుని సృజనశక్తియైన బ్రహ్మను త్రిరించ ప్రయత్నిస్తారు. బ్రహ్మ యోగనిద్రను ప్రసన్నం చేసుకోవడం ద్వారా శ్రీ మహావిష్ణువును మేల్కొలుపుతాడు. సృజనశక్తియైన బ్రహ్మదేవుని ద్వారా సృష్టిజరుగనిదే తానెవరిని పోషించుతాడు? అందువల్ల రక్షణ శక్తియగు శ్రీ మహావిష్ణువు మధుకైటభులతో యుద్ధము చేసి వారిని సంహరిస్తాడు.

శుంభుడు నిశుంభుడు దేవేంద్రుని పదభ్రష్టుని చేస్తారు. దైవశక్తుల నణచివేస్తారు. దేవతలు చేయగలిగినదేమీ లేక సర్వశక్తి సమేతయగు దేవిని స్తోత్రంచేస్తారు. దేవి శరీరాన్నుండి ఉద్భవించిన శక్తిని శుంభ నిశుంభుల భృత్యులగు చండముండులు చూసారు. వెంటనే ఈ "సుందరి"ని గూర్చి తమ ప్రభువులకు నివేదిస్తారు. శుంభ నిశుంభులిరువురూ స్వార్థులై ఆ మోహినిని కాంక్షిస్తారు. ఆమె భేదోపాయముతో వారిని విడదోసి వారి అంతమును సాధించింది.

మహిషుడు దేవతలనోడించి తనే దేవేంద్రుడైనాడు. ఏ ఒక్కరూ వానిని ఓడించలేకపోతారు. ముక్కోటి దేవతలు త్రిమూర్తులు తమకుగల శక్తులలో ఒక్కొక్క శక్తిని త్యాగంచేసి ఆ శక్తులన్నిటిని సంఘటిత పరుస్తారు. వీరందరి శక్తుల సంఘటనా ఫలితంగా సింహనాదంచేస్తూ సింహవాహనయైన మహాశక్తి ఉద్భవిస్తుంది. మహిషునితో హోరాహోరి నవరాత్రులు యుద్ధము చేసింది. ముప్పదిమూడుకోట్ల దేవతల ఆయుధములతో వారి సంఘటనా శక్తి విజృంభించితే మహిషుని అసురశక్తి అంతమొందింది. ఆశక్తి మహిషాసురమర్దనియైంది. మూర్తీభవించిన సంఘటిత శక్తియే మహిషాసుర మర్దని. సత్యయుగమునాటి ఈ సంఘటనబట్టి విజయదశమి దేవతలకు కూడా పండుగైంది.

త్రేతాయుగంలో రావణ-సంహారం వల్లను, ద్వాపరంలో ఉత్తర గోగ్రహణ సందర్భంలో విజయుని విజయంవల్లను విజయదశమి సార్థక నామధేయమైనది.

ఈ కలియుగంలోనూ విజయదశమి మనకు స్ఫూర్తినిచ్చే అనేక సంఘటనలతో సంబంధాన్ని కలిగివుంది.

దేశంలో అధర్మం ప్రబలి సమాజం దుఃఖభూయిష్టమై పతనోన్ముఖమైన సమయంలో సమాజ శ్రేయస్సుకై దుఃఖానికి తరుణోపాయాన్ని కనుగొనడంకోసం రాజ్యాన్ని భార్యాపుత్రులను సర్వస్వాన్ని త్యజించి సంకుచిత బంధాలను త్రెంచుకుని సమాజం

లోని చెడుగుపై గౌతమ బుద్ధుడు దండయాత్రకు వెడలినది గూడా ఈ విజయదశమి నాడే.

భారతదేశాన్ని ముస్లిములు పూర్తిగా ఆక్రమించుకొన్నారు. సమర్థ రామదాసంతటి మహావ్యక్తి 'సాక్షాత్తు పరమేశ్వరుడవతరిస్తేతప్ప హిందూరాష్ట్రం రక్షింపబడే అవకాశంలేదు.' అని నిస్పృహతో అన్నరోజులవి. 1674 లో ఈ విజయదశమినాడే రాయఘడ్ దుర్గంలో శతఘ్నికొల్పులు జరిపించి విజయభేరి మ్రోగించి విజయయాత్ర నుపక్రమించాడు ఛత్రపతి శ్రీ శివాజీ.

విజయనగర సామ్రాజ్యాన్ని కబళించాలని సరిహద్దుల్లో పొంచికూర్చున్న బహామినీ రాజ్యాలపై మొట్టమొదటిసారిగా విజయయాత్ర నుపక్రమిస్తూ శ్రీకృష్ణదేవరాయలు సంప్రదాయానుసారం ఆయుధపూజలు గావించి సీమోల్లంఘనకు బయలుదేరడం గమనిస్తే ఈ విజయదశమి చారిత్రక కాలంలో గూడా యెలాంటి స్ఫూర్తినిస్తూ వచ్చిందో గ్రహించవచ్చు.

మైసూరు, ఢిల్లీ, కులూ లోయలలో ఈనాటికీ దసరా ఉత్సవాలు ప్రత్యేకతను కల్గివున్నాయి. 'కులూలోయ'లో కొండజాతుల వారి వేడుకలు కన్నులపండువుగా వుంటాయి. మైసూరులో గతవైభవ చిహ్నమైన రాజదర్బారు జరుగుతుంది. నాటి రాజనగరు, రాజఠీవి, రాజలాంఛనాలు, రాజరికపు ఉత్సవ సంరంభం ఒకనాడు దసరా పండుగను మనవారెంత గొప్పగా జరిపేవారో ఈనాటికీ తెల్పుతూవుంటాయి. పూర్వం యిక్కడ మల్లయుద్ధం పోటీలు జరిగేవి. వీరులకు సన్మానాలు జరిగేవి.

ఢిల్లీలో రామలీల అంటూ తొమ్మిది రోజులు ఉత్సవాలు జరుపుతారు దసరాకి. ఆఖరురోజున రావణ కుంభకర్ణుల బొమ్మలు బ్రహ్మాండమైన వాటిని తయారుచేసి వాటిని తగులబెట్టి పెద్దగా జయజయ ధ్వానాలు చేస్తారు.

దక్షిణాదిన దసరాకు బొమ్మల కొలువు పెడతారు. పూర్వం విజయ యాత్రానంతరం తమవారుతెచ్చిన సంపదను, విశిష్ట వస్తు సంచయాన్ని ప్రదర్శించేవారు. బహుశా వాని ప్రతిరూపంగా ఈ బొమ్మల కొలువు నేటికి మిగిలిందేమో! మహారాష్ట్ర ప్రాంత గ్రామీణ యువకులు చిన్నచిన్న ఆయుధాలతో వీరులవలె నటిస్తూ పొలిమేర దాటడం ఈనాటికీ చూడ ముచ్చటగా వుంటుంది. విజయనగరంలో దసరా ఉత్సవాలకంటూ ప్రత్యేక రంగస్థలం వుండేది. అదే ఈనాడు "దసరా దిబ్బ"గా ఆ శిథిలాల్లో వుండి గత వైభవాన్ని గుర్తుకు తెస్తూ ఉంటుంది. ★

# అర్ధాంగి అలుక ★

(24-వ పేజీ తరువాయి)

"నీరజంటే చంద్రశేఖరం పెళ్ళామేనా?" అన్నాను.

"అవును." అన్నాడు.

"నీరజకి విజయకు ప్రాణస్నేహం" అన్నాను.

"రైట్!" జయపాల్ కుర్చీలోంచి లేచి ఒక్క గెంతు వేశాడు. నేను, మణి తెల్లబోయి చూచాం.

"సరే! నువ్వుమధ్యాహ్నం ఆఫీసుకు శలవు పెట్టేసెయ్యి." అన్నాడు.

"యెందుకు?" అన్నాను.

"యెందుకంటా వేమిట్రా ప్రాణస్నేహితుడు వస్తేనూ?" సీరియస్‌గా అన్నాడు. నేను శలవుపెట్టటానికి ఒప్పుకున్నాను.

"సాయంత్రం నాలుగింటికి నువ్వు నీరజగారింటికిరా! తెలుసుగా" అన్నాడు.

"యెందుకని అడగాలని నోటిదాకా వచ్చినా వాడిమొహంలో గాంభీర్యం చూసి వూరుకున్నాను. కాసేపుండి వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

భార్య వుండి ప్రాణస్నేహితుడు వస్తే ఇంటికి పిలవలేకపోయానని మహాబాధపడ్డాను. వాడికి మాట యిచ్చినట్లుగానే ఆ సాయంత్రం నాలుగింటికి నీరజగారింటికి వెళ్లాను. ఇల్లంతా ఏదో హడావుడిగావుంది. చంద్రం వాకిట్లోనే నాకు యెదురై "రండి! రండి! ఇవాళ మా అమ్మాయి పుట్టినరోజు. టీపార్టీ" అన్నాడు.

పిలవని పేరంటానికి వచ్చిన నేను అభిమానంతో తలదించుకున్నాను. ఇంతలో జయపాల్ యెదురై నన్ను లోపలకు లాక్కెళ్ళాడు. నన్నొక గదిలోకి తీసుకెళ్ళాడు. ఆ గది కొంచెం విశాలంగా వుండి పది పన్నెండు మంది కూర్చుని కాఫీలు త్రాగేటందుకు వీలుగా టేబులు వాటి యెదుట కుర్చీలూ అమర్చబడివున్నాయి. యెదురుగుండా గోడకు దగ్గర ఆ చివరనుంచి యీ చివరకు నీలం దాని మీద యెరుపు పూలద్దిన కర్టెన్ బిగించబడివుంది. జయపాల్ నన్ను చెయ్యి పుచ్చుకుని ఆ కర్టెన్ దగ్గరకు లాక్కువెళ్ళి "రాజూ! లోపల కుర్చీవుంది. అక్కడ కూర్చో" అన్నాడు "ఎందుకు?" అన్నాను అర్థంగాక.

"అబ్బ! నీ ఎందుకూలతో చంపకురా నాయినా. నా మాట విని తెర అవతల రాజాలాగ పడుకుని తెర యివతల జరిగే నాటకం విను. ఈ పుట్టిన రోజూ గిట్టిన రోజూ అన్నీ అబద్ధాలే. కేవలం విజయను ఇక్కడకు ఆహ్వానించటం కోసం నీరజతో కలిసి యీయెత్తు యెత్తాం. అంతా వింటూ వుండు నీకే తెలుస్తుంది" అన్నాడు కర్టెన్ ప్రక్కకు లాగి నన్ను తీసుకెళ్ళి కుర్చీలో కూలదోసి "నువ్వవతలవాళ్ళకి కన్పించవు నీకు అవతలవాళ్లు కన్పించరు." అన్నాడు.

"మధ్యలో యెవరయినా యీ కర్టెన్ లాగితే ఇందులోంచి బుద్ధదేవుడి లాగ నేను బయటపడితే?" సందేహంగా చూస్తూ అన్నాను.

"అయితే, గియితే. మహా సందేహపు మనిషివిరా నాయినా. నాకళ్లు రెండూ యీ కర్టెన్ మీదే వుంటాయి. భయపడకు" అన్నాడు.

"నాకేదయినా అవమానంలాటిది జరిగితే ఇంక నన్ను నువ్వు పట్టలేవు ముందే చెప్తున్నా" అన్నా చికాకుగా మొహం పెట్టి.

"సరే! నాదిగాపూచీ నీకేం జరగకుండా" అని కర్టెన్ మూసేసి వెళ్ళిపోయాడు. ఇదంతా యేమిటని ఒక ప్రక్క కుతూహలంగా వున్నా మరో ప్రక్క యిలాగ కూర్చోటానికి విసుగ్గా వుంది. జేబులో సిగరెట్ పాకెట్ తీసి సిగరెట్ ముట్టించి పడక్కుర్చీలో వెనక్కు వాలాను.

గదిలోకి యెవరో వస్తున్నారు. పోతున్నారు. తమషా తమాషా సంభాషణలు విన్పిస్తున్నాయి. నాలో ఓపిక నశిస్తోంది. ఇంతలో "రా! విజయా! నీకోసమే చూస్తున్నాం" అన్న నీరజ కంఠం విన్పించింది. అడుగుల చప్పుడును బట్టి వచ్చిందని అనుకున్నా.

"ఈ విజయే అన్నయ్యా నీ ఫ్రెండ్ రాజు భార్య"

"ఇతను మా అన్నయ్య అంటే పెత్తండ్రి కొడుకు, జయపాల్. ఈ విడ మా వదిన మణి" పరిచయవాక్యాలు మహాపసందుగా వున్నాయనుకున్నా.

"నేను వస్తున్నట్లు టెలిగ్రామిచ్చాను. అందలేదాండి." అన్నాడు జయపాల్. విజయ తల తిప్పిందో యేమో శబ్దం మటుకు విన్పించలేదు.

"స్టేషన్‌కు వస్తాడని యెంతో చూశాం. కానీ రాలేదు. అసలు వూళ్ళో వున్నాడా లేదా?" జయపాల్ చాకచక్యానికి మెచ్చుకోకుండా వుండలేక

# అరాంగి అలుక 

పోయాను. దాన్నుంచి విజయ మళ్లా నిబ్బరంగానే జవాబిచ్చింది.

"అరె! వున్నాడా? మరి స్టేషన్‌కెందుకు రాలేదో?"

"నేను చెప్పలా. మీరు వ్రాసిన వుత్తరం అతనికి కోపం తెప్పించివుంటుంది." ఇది మణికంఠం.

"యేమిటా వుత్తరం?" నీరజ కంఠంలో కుతూహలం కన్పిస్తోంది.

"మీరు చూశారా ఆ వుత్తరం?" బహుశా విజయనై వుంటుంది మణి ప్రశ్నించింది.

"యెందుకులే అని చూపించివుండరు. యింత స్నేహితులయితే మాత్రం మరీ అంత ఇదా. తనొక ఆడపిల్లలాగ తన్నేదో మోసం చేసినట్లుగా యేవిటేవిటో వ్రాశారు. ఇంకా నయమే. మీరు చూడలేదు గాబట్టి సరిపోయింది. లేకపోతే మా రాజుమీద తప్పకుండా అనుమానపడి పోట్లాట పెట్టుకునేవారు." అంది మణి. నాకాసమయంలో విజయ మొహం యెలావుందో చూడాలని మహా ఆసక్తి కలిగింది. కాని యేంచెయ్యను? కాసేపు మళ్లా ఆ ఖబుర్లు యీ ఖబుర్లు దొర్లిపోయినాయి. చివరికి విజయ "వస్తానండి" అంది. అమ్మయ్య ఇప్పటికి వినిపించింది అనుకున్నాను.

"మీరు ఒక చిన్నసాయం చేసి పెడ్తారా?" అన్నాడు జయపాల్.

"యేమిటది?"

"రాత్రికి మీయింటికి వస్తాం మేమిద్దరమూనూ. వాడిలో యీ విషయమేమీ చెప్పకండి. హఠాత్తుగా కన్పిస్తాం. యేం చేస్తాడో చూడాలని అపేక్షగా వుంది" అన్నాడు.

"అలాగే"

"మరి అడ్రస్ చెప్పి వెళ్తారా?"

విజయ చెప్పి రమ్మనమని మణిని తనకి తనుగా మళ్లా ఆహ్వానించింది అందులో గల వుద్దేశం నాకు తెలియలేదు. క్రమంగా అందరూ వెళ్లిపోయారు. జయపాల్ కర్టెన్ లాగి "దయచెయ్యండి" అంటూ యువతులకు దారిచూపాడు. నా మొహంలో భావాలు దాచుకోవటం నాకు చాలా కష్టంగావుంది.

"సరాసరి యింటికి దయచెయ్."

"యెందుకు?" అలవాటుచొప్పున నోటి నుంచి ప్రశ్న వచ్చేసింది. జయపాల్ నన్ను వురిమిచూచాడు. నేనేం చలించకుండా "సరే! సతీసమేతంగా మాయింటికి భోజనానికి దయచెయ్" అన్నాను. సరేనని అంగీకారం తెలిపాడు.

"కాని ఒక్క విషయం జయపాల్! నాకు నీకు మల్లే నటన చేతగాదు. ఇంటికి వెళ్లి విజయతో నువ్వు బజార్లో కనిపించావని చెప్తాను" అన్నాను. వాడు కాసేపు ఆలోచించి సరేనన్నాడు.

తర్వాత చెప్పవలసిందేముంది? ఇంటికి వచ్చాను. విజయ మామూలుగా యింట్లో పనులు చూచుకుంటోంది. నేను తనను పలకరించకుండా వచ్చి నా గదిలో కూర్చున్నాను. కాసేపటికి విజయ కాఫీ తీసికొని వచ్చింది. ఈ మూడు రోజుల్నుంచి జరిగిన ప్రళయ తాండవమంతా బలవంతాన మర్చిపోయి వచ్చినట్లు మొహం స్పష్టంగా చెబుతూనే వుంది. కాఫీ కప్పు తీసుకుంటూ "నా స్నేహితుడు జయ, అతని భార్యా వచ్చారు. బజార్లో కనిపించితే మనింటికి రమ్మనమని చెప్పాను: ఇంకా హోటల్‌కి కబురు పంపుదామనుకుంటున్నాను. నువ్వు వచ్చావుగా" అన్నాను చాలా సహజంగా. క్షణంసేపు విజయ కళ్లెత్తి నా మొహంలోకి చూచి వెంటనే వెళ్లిపోయింది.

ఆ రాత్రి జయపాల్, మణి వచ్చారు. నేను విజయను యేమీ తెలియనట్లుగా పరిచయం చేశాను. మణి-విజయ చాల చక్కగా కలిసిపోయి వంట యింట్లోకి వెళ్లిపోయారు.

ఇద్దరం భోజనం చేస్తుండగా జయపాల్ ఇలా అన్నాడు: "ఆ కాస్త దానికే అంత కోపం యెందుకురా నామీద నేను నువ్వు రావటం మానేశావు. అయినా వెనక పేజీలో క్రింద చివర వ్రాశానుగా." అన్నాడు. ఈ మాటలు యే వుద్దేశంతో అన్నాడో గ్రహించుకున్న నేను మాట్లాడలేదు.

చాల్లెండి ప్రతాపం. మీ చెల్లెలు చూడలేదుగాబట్టి ఆ వుత్తరం సరిపోయింది. లేకపోతేనా?"

"మా చెల్లెలేం అలా చెయ్యదు తెలుసా?" జయ విజయ పక్షం వహించాడు. ఆ రాత్రి చాలా సరదాగా గడచిపోయింది.

ఆరాత్రి విజయ నా పాదాలమీద చేతులాన్చి కళ్ళనీళ్లతో "నన్ను క్షమించండి" అంది. నేను నా కాళ్ళు దూరంగా లాక్కుంటూ "ఉహు. నిన్ను క్షమించలేను విజయా. నా కోసం గాదు. ఆ రోజున రఘుని నామూలంగా వుత్తపుణ్యానికి కొట్టావు. అది నాకుయెంతో బాధ కల్గించింది తెలుసా?" అన్నాను.

"లేకపోతే యేమిటి చెప్పండి. నీరజ వచ్చింది. నిన్ను పిలుస్తోందని అబద్ధం చెప్పాడు, తీరాచూస్తే మీరు."

"నా కాసమయంలో నీమీద అంత కోపం వచ్చిందన్నమాట. అందుకనే వుత్తరంలో..."విజయ తన చేత్తో చటుక్కున నా నోరు మూసేసి "ఇంక ఆ విషయం యెత్తవద్దు." అంది. నేను చెయ్యి లాగివేస్తూ "యెత్తవద్దని అనటంమాత్రం అంటున్నావుగాని నేను యెంత బాధ పడ్డానో తెలుసా?" అన్నాను కోపంగా. విజయ యేడుస్తూ నాకాళ్లమీదవంగి "అందుకే నన్ను క్షమించమంటున్నాను. ఇంక యిలాంటి తెలివితక్కువ పనులు జీవితంలో చెయ్యను. ఈ ఒక్కసారి నన్ను క్షమించండి" అంది. వంచిన తల్లోంచి సన్నజాజుల పరిమళం నన్ను వుక్కిరిబిక్కిరి చేసింది. చేత్తో విజయను లేవనెత్తుతూ "చాల్లే. భగవంతుడు పురుషుల్లో అన్ని శక్తులు పెట్టాడుగాని ఆడదాన్ని కన్నీరుచూచి సహించగల మనస్తత్వం పెట్టలేదు. అందుకనే మగవాళ్ళెప్పుడూ మీ ఆడవాళ్ల ముందు వోడిపోతూవుంటారు" అన్నాను నవ్వుతూ.

జయపాల్ మణి మరి రెండురోజులున్నారు. నేను ఆఫీసుకు శలవు పెట్టాను. విజయ, మణి అక్కచెల్లెళ్లలాగ కలిసిపోయారు. ఆఖరికి వాళ్లు వెళ్ళిపోయే రోజున విజయ, మణి ఒకళ్లనొకళ్లు కావలించుకుని ఆనందబాష్పాలు రాలుస్తుంటే నాకు నిజంగా చాలా ఆశ్చర్యమేసింది. ట్రెయిన్ ఎక్కుతూ రహస్యంగా వాడిచెవులో యిలా చెప్పాను: "ఒకేయ్. జయపాల్ నీ వుత్తరాలు మొదట్లో ప్రళయకాలంనాటి సంఘటనలు సృష్టించినా తర్వాత చక్కని మార్గాలు ఏర్పరుస్తాయి. ఇప్పుడుచూడు. నీ వుత్తరంమూలాన ఇవాళ విజయ నేను నిజంగా తప్పుచేసినా నన్ను మన్నించేంత విశ్వాసం నామీద యేర్పరుచుకుంది. దీనికి నేను నీకు కృతజ్ఞుడిని" అన్నాను.

"రాజూ! నీకంత మంచిపని చేసిపెట్టాను గాబట్టి నువ్వు నాకొక బహుమానం ఇవ్వాలి" అన్నాడు.

"ఏమిటది?" అన్నాను.

"సంక్రాంతికి మీ రుభయులూ మా వూరు రావాలి యేం విజయా?" ఈ మాటలు బిగ్గరగా అన్నాడు.

"ఆ రోజు విజయ పుట్టినరోజు గూడాను" అంది మణి.

"అయితే స్పెషల్ ప్రోగ్రాం ఇద్దాం. యేకోయ్ తప్పకుండా రావాలి." నేను విజయ మొహంలోకి చూచాను. ఆ కళ్లు అంగీకారం తెలిపాయి. జయపాల్ సంతోషంతో నా చేతిని ఆఖరుసారి గుంజాడు. రైలు కదిలింది. ఆ జంట అటువైపు వెళ్తుంటే మేం ఇటువైపు ఇంటికి బయలుదేరాం. 

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

